శ్రీ 'అవతార్' స్వామి గంగానంద సరస్వతీ

మహారాజ్ వారు

ఆంగ్లమున రచించిన

# ఆధ్యాత్మిక నాటకములు



అనువాదకులు:

అధ్యాత్మ రత్న, జ్ఞాన యజ్ఞ రత్న

నండూరి వెంకటసుబ్బారావు B A S D. L S,

దివ్యజీవన సంఘాధ్యక్షులు ఏలూరు.

1960 వెల 1-50

## కృతి సమర్పణ

ఈ పవిత్రపుష్పము మదీయ గురుదేవులగు శ్రీ శ్రీ శ్రీ అవతార్ స్వామి శివానందసరస్వతీ మహరాజ్ వారి పాదపద్మములకు సమర్పింపబడినది.

నందూరి వెంకటసుబ్బారావు.



ఈ గ్రంథము వలయువారు యీ దిగువ చిరునామాలకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.

(1) దివ్యజీవన సమాజము -

శివానందనగరము హృషీకేశము-డెహరాడూన్ జిల్లా.

(2) శ్రీ నందూరి వెంకటసుబ్బారావు -

దక్షిణపువీధి - యేలూరు ప॥ గోదావరి జిల్లా.

# అనువాదకుని విజ్ఞప్తి

అవతార పురుషులు శ్రీ శ్రీ శ్రీ [illegible] స్వా

స్వాములవారు అనేక గొప్ప ఆధ్యాత్మిక [illegible]ములు

రచించినవని అవి [illegible] [illegible] [illegible] [illegible]

[illegible] క్షేత్రములందును త[illegible] [illegible] [illegible] [illegible]

లందును ప్రదర్శితములందు ప్రదర్శింపబడుచున్నవి. అవి కాం

మిక శృంగార సంబంధమైనవి కాక కేవలము ఆధ్యాత్మిక లీల

లను సూచించునవి. ముముక్షువులకు చాల ఉపయోగకరము.

ఆంధ్రలోకమునంతా ఆధ్యాత్మిక ప్రచారణ జరుపు సమాజ

ములతో సహా నాటకములలో కొన్నిమాత్రమే తెనుగున

తర్జుమా చేసితిని. ఇవి ప్రేక్షకులు చదివియు మిగుసద్భావము

ప్రదర్శింప జేసియు తామును ఆంధ్ర మహాజనులు తగు ప్రయో

జనము పొందుదురని ఆశించెదను. అట్లు జరిగిన నేను

ధన్యుడనగుటయే గాక గురు మహారాజవారి ఆశీర్వాదమునకు

మీ అనురాగమునకు పాత్రుడనగుదునని భావించుచున్నాను.

ఇట్లు అనువాదకుడు

నందూరి వెంకటసుబ్బారావు

# వి ష య సూ చి క



## CONTENTS

# ఆధ్యాత్మిక నాటకములు.

## I శుష్క వేదాంతి

### మొదటి రంగము

విచారానందుని ఆశ్రమము. అతడు ఆసీనుడై బ్రహ్మసూత్రములు చదువుచుండును. మూర్ఖానందుడు కాలక్షేపమునకై అక్కడకు వచ్చును. అతడు వచ్చినవెంటనే విచారానందుడు వానికి అభివందనముచేసి సంభాషణ ప్రారంభించును.

విచా:-ఓం నమో నారాయణాయ! మూర్ఖానందజీ, మీ ఆరోగ్యమెట్లున్నది? మీసాధన బాగుగా జరుగుచున్నదా? శివోహం శివోహం శోహం|సత్ చిత్ ఆనందస్వరూపోహం!

మూ:-శివోహం శివోహం శివోహం శివోహం శివోహం. నేను క్షేమముగా నున్నాను. నేను ఆనందస్వరూపుడను. జ్ఞానస్వరూపుడను. నేను యీ ప్రపంచమంతయు నా స్వరూపముగా చూచుకొనుచున్నాను. వేదాంతవాక్యములు చదివితిని. నాకు చాల బుద్ధిసూక్ష్మత గలదు.

వి:-చాల సంతోషము. స్వామిజీ! సాధారణముగ మావంటి వారికి లఘుసిద్ధాంతకౌముది చదువుటకు ఆరు సంవత్సరములు, యోగదర్శని. సాంఖ్యదర్శని చదువుటకు 12 సంవత్సరములు పట్టును. మీరు యీ తత్త్వమంతయు ఎంత కాలము పరిశ్రమ చేసిరి.

మూ:-నేను అంతయు 6 మాసములలో పూర్తిచేసితిని. మీ వంటివారికి 25 సంవత్సరములు పట్టును. మీకు సరియైన సూక్ష్మబుద్ధి లేదు.

వి:-అది ఎట్లు సంభవమగును. మీ బడాయిలు చాలింపుడు. పూర్వకాలపు ఋషులు వారి గురువులవద్ద సంవత్సరముల కొలది యుండి, యీ విద్య నేర్చుకొనిరి.

మూ:-స్వామిజీ, నేను చెప్పునది శ్రద్ధగావినుడు-నేను చేసిన పని మీకు చెప్పెదను. కాశిలో నొకమహాత్ముని ఉపన్యాసమువిని పంచదశి, విచారసాగరము అను పుస్తకములు కొంటిని పండ్రెండు ఉపనిషత్తులు కొంటిని. వేదాంతము బాగుగ తెలిసికొనిన నేను, రాజులకు రాజునగుదుననియు, ప్రపంచమందలి భాగ్యమంతయు నాకు చేకూరుననియు, గొప్ప ఐశ్వర్యము గలుగుననియు విన్నాను. ఆ పుస్తకములు చదివి అందరిలోనుండు పరబ్రహ్మ నొకడేయని తెలిసికొనినాను.

వి:-నీవుచేసిన సాధనయంతయు యిదియేనా?

మూ:-వినండి, వేదాంతశాస్త్రముయొక్క సారము గ్రహించినాను. అది ఏమన-నేనే బ్రహ్మము అన్నియు బ్రహ్మమే. అన్నియు నావే. అన్ని శరీరములునావే. ప్రపంచమంతయు నా శరీరమే. ప్రపంచమంతయు నా యిల్లే.

వి:-ఇంతేనా! ఆత్మసాక్షాత్కారమునకు ముఖ్యమైన సాధన చతుష్టయము మీరు పొందలేదా?

మూ:- ప్రియమైన స్వామిజీ! మీరుప్రాత పద్ధతికి అలవాటుపడి యున్నారు, అష్టాదశ్లనము, శ్రోత్రియము పనికిరాదు;

అట్టి స్వల్పగుల విషయమై శ్రద్ధ తీసికొనవసరము లేదు. కష్టమైన తపస్సులు చేయనవసరము లేదు. సాధన చతుష్టయము మూఢునకు అవసరము. నేను మొదటినుండి సాధకుడనని మీకు తెలియదా! నేను పరమహంసను. తత్త్వమభ్యసించుటకు సులభముగ నుండవలెను. తపస్సు చేసి, శరీరమునకు బాధకలుగజేసి దానిని శుష్కింప జేయగూడదు.

వి:-శాస్త్రములు చదివి పండితుడగుట వేరు. ఆత్మసాక్షాత్కారము పొందుట వేరు. ఎంత పండితుడైనను, కోపము, కోరికలు, ఇంద్రియ సుఖములు అనుభవించుట మొదలగునవి స్వాధీనమందుంచుకొనవలెను, సోదరా, చాలజాగ్రత్తగా నుండవలయును సుమా?

మూ:-నేను బ్రహ్మసాక్షాత్కారము యొక్క ఫలితము తొందరగా అనుభవింప కోరుచున్నాను. ముక్కు మూసుకొని తపస్సు చేస్తూ కూర్చుండుట మందమతులకుగాని మావంటి సూక్ష్మ బుద్ధిగల వారికి కాదు.

వి:-వివేకము, వైరాగ్యము, షట్సంపత్తి (అనగా శమము దమము, ఉపరతి, తితీక్ష, శ్రద్ధ, సమాధానము) ముముక్షత్వము లేనిది బ్రహ్మసాక్షాత్కారము కలుగనేరదు. నీవు మొదట నీగురువునకు నిష్కామ సేవజేసి మనస్సు పవిత్రము చేసికొనవలెను.

మూ:-ఇవి అన్నియు ముసలి వేదాంతులు చెప్పు మాటలు. ఇతరుల సహాయము కోరి నిష్కామ్య కర్మయోగము గురుసేవ అవసరమని చెప్పుదురు.

వి:-ప్రియమైన మూర్ఖానందజీ, నీతత్త్వము చాల ఆశ్చర్య కరమైనది. నీ తెలివికూడ ఆశ్చర్యకరమైనదిగా కనుపించుచున్నది! మాయయొక్క శక్తి యిట్టిది! (అని తలపైన చేతులు పెట్టుకొని కన్నులు మూసికొని కొద్దికాలము యూరక నిలుచుండెను.)

మూ:-నేను చెప్పు విషయము సరిగా వినండి. మీరు సాధన చతుష్టయము అవసరమని చెప్పేయెడల అది నా పూర్వ జన్మమందే నాకు గలిగియున్నది. ఇప్పుడు నూతనముగా అది ప్రయత్నము చేయనవసరములేదు.

వి:-అయితే మీరు శ్రవణ మనన నిధిధ్యాసలు అభ్యసించితిరా?

మూ:-ఇవియు నావంటి మొదటి తరగతి అభ్యాసకులకు అవసరము లేదు. శ్రీ శంకరులు, దత్తాత్రేయులు అట్టి సాధన చేసినారా? లేదు. నేనుకూడ స్వయంసిద్ధుడను. పుట్టుక నుండియు యోగిని. మనము అజ్ఞానులమనుకొనిన అజ్ఞానుల మగుదుము. మనము కర్మ ప్రారంభించిన కొన్ని చెడు పనులు చేయుటగలుగును. కాబట్టి కర్మత్యజించవలెను. శ్రుతులు ఆప్రకారము తెలుపుచున్నవి.

(భాస్కరానంద ప్రవేశించి యిద్దరకు ప్రణామము చేయును)

మూ:- పూజ్యమైన స్వామిజీ! నిష్ఠతో కూడిన ముసలి సాధువుల మార్గములు పరిశీలింపుడు. వారు గురువులవద్ద యెద్దులవలె పనిచేయగోరుదురు. మనము బోధయందలి సారముగ్రహించి పిప్పినివిడువవలెను. జపము, ధ్యానము, సంకీర్తన, సేవ, సాధనచతుష్టయము, శ్రవణము, మననము

సిద్ధి, ధ్యానము, అనవసరమగు బాహ్యాచర్యలు, అవునా? కాదా ? మీరుచెప్పండి !

ఘా :- నీవు ఎంత పండితుడవని అనుకొనినను నీ అభిప్రాయముతో నేనేకీభవించను. నీకు చాలతొందరగలదు. నీ మాటలు నేనువిశ్వసింపజాలను. నీకు గురువు ఉన్నారా? లేదా ? నీవు ఉపదేశము పొందితివా ? లేదా ?

మూ:-ఉపదేశములయందు నాకు నమ్మకము లేదు. గురువు లేడు. శిష్యుడు లేడు. నగురున శిష్య చిదానందరూపం శివోహం శివోహం. గురువు అవసరము లేదు. ఆత్మయే మనకు గురువు.

వి:-నీవు నిజముగా మూర్ఖుడవే. ఇందుకు సందేహము లేదు. పంచదశి, విచారసాగరము చదివినంత మాత్రమున మనుజుడు జ్ఞాని కాజాలడు. బ్రహ్మవిద్య శాస్త్రములన్నిటిలో శ్రేష్ఠమైనది. అదియొక బ్రహ్మనిష్ఠుడైనట్టువంటిన్ని శ్రోత్రియుడైనటువంటిన్ని గురువువద్ద అభ్యసించవలెను. మామూలుగా డాక్టర్లు, యింజనీర్లు నొక గురువువద్ద కొంతకాలముండి నేర్చుకొనెదరు బ్రహ్మవిద్య వాటికంటె చాలకష్టమైనది.

(మూర్ఖానంద అచ్చటనుండి దిగ్గున లేచి వెళ్ళబోవుచూ)

ఓ భగవానుడా! ఇట్టి మూర్ఖుల యెదుటకు నేను యీ రోజున వచ్చుట నా దురదృష్టమే. ఆధునిక పురుషులు యిట్టి పిచ్చి ఊహలకు పాత్రులుకాకట్టు చూడవలెను. మీరు సాధన, చిత్తశుద్ధి గురుసేవకొఱకే జీవితమంతయు గడిపెదరు కాబో

లును. ఓ భగవంతుడా! నన్ను యిటువంటివారి బారినుండి రక్షింపుము. ముందు వీరిని కలిసికొనకూడదు. (వెళ్లును)

(విచారానంద భాస్కరానందు లొకరికొకరు ఓంనమో నారాయణాయ అని ప్రణామములు చేసికొని వెళ్ళెదరు)

## 2 వ రంగము

(మూర్ఖానందుడు కళ్ళజోడు బూట్సులు చేతికర్ర వగైరాతో బయలుదేరును. లాలాజీ, దీనదయాళు కాఫీహోటలులో వచ్చును.)

మూ:-శివోహం శివోహం శివోహం.

దీ:-నమస్కారము. దయచేయుడు. తమ కేమి కావలెను? ఫలహారములు తెప్పించెదనా?

మూ:-బిడ్డా! సుఖముగా నుండుము. నీవు నా ఆత్మవే. నీకునూ నాకును భేదములేదు. అంతా బ్రహ్మమే. ప్రపంచములో దేనియందును ఆసక్తి యుంచకుము.

దీ:-చిత్తము. ఈ దినము బహు సుదినము. తమ దర్శనమైనది. (ఫలహారము పెట్టును. మూర్ఖానందుడు సుఖముగ భుజించును.)

(ఇంకొక వర్తకుడు వచ్చినందున దీనదయాళుడు వెళ్ళిపోవును. ఆ గదియందు యెవరును లేనందున మూర్ఖానందుడు ఆ గదియందలి యినుపపెట్టె తెఱచి అందుండు నగలు, డబ్బు తీసికొనును. మధ్యమధ్య శివోహం శివోహం అనుచుండును. వెళ్ళుటకు ఉద్యుక్తుడగుచుండగా దీనదయాళుడు వచ్చును.)

మూ:-నీవు నన్ను దయతో చూచినందుకు నీకు ధన్యవాదములు. చాల ఆలస్యమైనది. సంధ్యావందనకాలము సమీపించినది. నేను వెళ్లెదను.

(దీనదయాళుడు కుమారుని పాపు చూచుచుండుమని చెప్పి మూర్ఖానందుని కొంతదూరము సాగనంపి)

రేపు మీరు మాయింటికి భిక్షకు దయచేయవలయును!
(అని చెప్పి వెళ్ళిపోవును.)

## శి వ రం గ ము

(లాలాజీ దీనదయాళుని యిల్లు. మూర్ఖానందుడు వచ్చును. వానికి అతిథ్యమిచ్చి నొక అసనముపై కూర్చుండబెట్టును.)

లా :- ఆనందోహం ఆనందోహం ఆనందోహం బ్రహ్మానందం సచరాచర పరిపూర్ణ శివోహం సహజానందస్వరూప శివోహం ॥

మూ :- మీ వంటి భక్తులనుచూచిన నాకు చాలఆనందము కలుగుచున్నది. సంసారబాధలు తొలగించుకొనుటకు వేదాంతమే శరణ్యము అంతయు బ్రహ్మమే. వేదాంతికి విచారముండదు. అతనిని అందరు మర్యాదచేయుదురు. జ్ఞాని భూమియందుండు భగవంతుడు - నేను జీవన్ముక్తుడను. ఆరు మాసములలో నేను అంతయునేర్చితిని. ఈ విద్యఅంతయు యితరులు నేర్చుకొనుటకు యాబది సంవత్సరములుపట్టును. నేను అందరికండ్లతో చూచెదను. నీయిల్లునాది, నీపాపునాది, నీవునావాడవు, నేనుపరిపూర్ణుడను, శివోహం శివోహం.

(పంచభక్ష్యపరమాన్నములతో ప్లేటులో పెట్టినదంతయు మూర్ఖానందుడు కడుపునిండునట్లు భుజించును. తరువాత లాలాజీ నిద్రించును. మూర్ఖానందుడు కొంతసేపు విశ్రమించి లేచి బయటనున్న మంచి క్రొత్త పాదరక్షలున్ను రెండువందల రూపాయిలు విలుగల కాశ్మీర శాలువనుచూచి, చుట్టుప్రక్క ఎవరును లేకుండుట గ్రహించి అవి సంగ్రహించి వెళ్ళిపోయెను. తరువాత కొంతసేపటికి లాలాజీ లోపలినుండి బయటకువచ్చి తనలో తానిట్లనుకొనెను.)

లా:- చాలకాలాతీతమైనది షాపుకు వెళ్ళవలెను. నాపాదరక్షలేమైనవి? ఎచ్చట మరచినానో! ధర్మదాసు కొట్లో యెట్లున్నవాడో. వానికి యేమియు వ్యవహారము తెలియదు త్వరగా వెళ్ళవలెను. (అనుకొని షాపుకు వెళ్ళియినుపపెట్టెలో సొమ్ము లెక్కపెట్టుకొనును.

లా:-(స్వగతముగా) 5000రూపాయిలు రొక్కముకనుపించుట లేదే! పదివేల రూపాయిలు ఖరీదుచేయు నగలు లేవే! ఆహా! ఏమిది! ఇంత సొమ్ము యెవరు దొంగిలించిరి?

(లాలాజీ మూర్ఛపోవును. తిరిగి తెలివి వచ్చినతరువాత కుమారుడగు ధర్మదాసును కేకవేయగా అతడు వచ్చును.)

లా:-ఎంతటి దురదృష్టము. సొమ్ము యావత్తు దొంగిలింపబడినది. నీవు కొట్టు విడిచి వెళ్ళితివా?

ధ:-నే నెచ్చటకు వెళ్ళలేదు. ఉదయం నేను కొట్టువద్దకు వచ్చినప్పుడు తాళము సరిగానే యున్నది. నాతప్పు యేమియు లేదు. ఈపని నిన్నవచ్చిన మహాత్ముని పని యని నాకు అనుమానముగ నున్నది.

లా:-అటువంటిమాటలు అనవద్దు. చాల పాపము. మహాత్ము లను అనుమానించకూడదు. నరకము వచ్చును. మన కుటుంబమంతయు నాశనమగును.

ధ:-మీరు పవిత్రులు. అమాయకులు. ప్రపంచమందు ఏమి జరుగుచున్నదో మీకు తెలియదు. మీరు రుజుమార్గమున ప్రవర్తించెదరు. మీకు తెల్లగా కనుపడునవి పాలను కొనెదరు. నాకు వారియందు గట్టి అనుమానము గలదు.

(సాయంకాలము తండ్రి కొడుకులు తమ యింటికి వెళ్ళుదురు. ఇంటివద్ద శాలువ కనుపించదు.)

లా:-(స్వగతముగా) మహాత్ముని విషయమై అనుమానపడవల సినదేనా ? నిన్న లోగదిలోనికి అతడు తప్ప నింకెవరును రాలేదు, అయినను పోలీసువారికి తెలియపరచెదను.

(నిష్క్రమించును.)

## 4 వ రంగము

(మూర్ఖానందునికి రాత్రి నిదురలేదు. తాను చేసినపని యితరులకు తెలియునని అనుమానము కలిగినది. తాను తెల్లని దుస్తులుధరించి పంజాబీ తలపాగ చుట్టుకొని తెల్లని చొక్కా తొడిగి ధైర్యమువహించి 'సేట్ రామనాథ్' అను పేరుపెట్టుకొని జంతు ప్రదర్శనశాలకు వెళ్ళెను. అచ్చట మృగములను చూచుచుండెను. పోలీసు సి. ఐ. సూక్ష్మారాం వచ్చి లాలాజీ తనకు తెల్పిన గుర్తులనుబట్టి అతడే మూర్ఖానందుడని తెలిసికొని వానికి 50 గజముల దూరములో నిలుచుని వానితో యిట్లు సంభాషించెను.)

సూ:-ఓముర్ఖానందంగారూ ! మనము స్టేషనుకు వెళ్లుదాము. కారు సిద్ధముగా నున్నది.

(మూర్ఖానందం సూత్ముారాం తనవైపుకు వచ్చుట చూచి వణుకుచు మాటుమాటాడక యింకొక వైపునకు వెళ్లుటకు ప్రయత్నించెను. అప్పుడు సూత్ముారాం వానిని కేకవేసి పిలిచి వానివద్దకు వెళ్ళి వానిబుజముమీద చెయివేసి ఈప్రకారం వానితో సంభాషించెను.)

సూ:-మీరు మూర్ఖానందులా! లాలా దీనదయాళుని గురించి మీకేమైన తెలియునా?

(మూర్ఖానందుడు మూర్ఛపోవుటకు సిద్ధమయ్యెను. సూత్ముారాం వానిని కాపుపై నెక్కించుకొని కోర్టుకు తీసికొని వెళ్లెను.

5 వ రం గ ము

జడ్జి:-నీవుఎవరు? నీ నివాసమెక్కడ?

మూ:- నేను అనుభవ వేదాంతిని నేను ముక్తినాధ్‌లో నుండును. ఈ తీర్ధరాజమందు కొంతకాలము గడుపుటకు వచ్చితిని.

జ:-లాలాదయాళ్ తాలూకు 5000 రూపాయిల రొక్కము 10000 రూపాయిల విలువగల నగలు క్రొత్త పాదరక్షలు ఒక కాశ్మీరు శాలువ దొంగిలించితివా?

మూ:-దొంగిలించుట అనునది నాకు తెలియదు. అంతయు నాదే. ప్రపంచమందలి ధనమంతయు నాదే. నేను వేదాంతిని. నా వేదాంతము దైవిక వ్యవహారములయందుపయోగించెదను. నాసొమ్ము నేనుతీసికొనినప్పుడు నామీదనేరము మోపుటకు వీలులేదు. లాలాజీ నేను యిద్దరము ఒకటే.

జ:- (నవ్వుచు) చాలబాగున్నది. నీవు వేదాంతము బాగుగ గ్రహించినావు. నీవు నిజముగ అనుభవజ్ఞుడవగు వేదాంతివి. ఎంతకాలమునుండి యీ వేదాంతము అమలులో పెట్టుచున్నావు ?

మూ:-కొద్దికాలమునుండియే. నేను ధ్యానము వగైరాలు అలవాటు చేసికొని యుండలేదు. పుస్తకములు మాత్రము చదివి వాటినిబట్టి అన్నియు నా సొత్తుఅని తెలిసికొంటిని. ప్రపంచమందు ప్రతివస్తువునకు అధికారిని నేనే.

జ:-రామూ! పోలీసువానిని పిలువుము. ఈ వేదాంతిని కొరడాతో కొట్టుమని చెప్పుము.

(అప్పుడు యిద్దరు పోలీసువారువచ్చి మూర్ఖానందుని నొకస్థంభమునకు కట్టి వానిమీద దుస్తులు తీసివేసి కొరడాతో కొట్టుట ప్రారంభింతురు. మూర్ఖానందుని శరీరమునుండి నెత్తురు వచ్చును. అతడు పెద్దగా నేడ్చును.)

జ:-ఓ అనుభవ వేదాంతీ! ఇప్పుడు నీ వేదాంతమంతయు యేమైనది. అంతయు నీవేగదా! కానిస్టేబిలు నీవాడే. కొట్టుట మిధ్య. ఎందువల్ల యేడ్చెదవు. శరీరము నీది కాదని వేదాంతమునందు నీవు చదివియుండలేదా ?

మూ:-ఇట్టి వేదాంతము నేను చదివియుండలేదు. వేదాంతము యొక్క నిజస్వరూపము నేను తెలిసికొనలేకపోతిని.

జ:-నీవు చాల అదృష్టవంతుడవు. 'నేను శరీరమునుకాను. మనస్సుకాను. సచ్చిదానంద స్వరూపుడను' అను వేదాంత విషయము మాత్రము నీకు అనుభవమునకు వచ్చినది

కాదు. సొమ్ము అంతయు నీ దేహము విషయముమాత్రము అనుభవమునకు వచ్చినది కాబోలు.

మూ:-నేను పొరబడితిని స్వామీ; ఇప్పుడు నాకు తెలిసినది. శరీరము నాదే. నా చెడు సంస్కారములు పోలేదు. నాకు మంచి బోధ చేసితిరి. ఇప్పుడు నాకు నిజము తెలిసినది.

జ:-నీకు ఒక సంవత్సరము కఠినఖైదు విధించినాము. నీవు యీ గడువుఅనంతరము బైటకు వచ్చినతరువాత నొకగురువును ఆశ్రయించి వారివల్ల ఉపదేశము పొందుము. అప్పుడు నీవు నిజమైన వేదాంతివి కాగలవు. ఇప్పటి శుష్కవేదాంతము కట్టిపెట్టుము. (అందరు వెళ్లెదరు.)

## 6 వ ర ం గ ము

(స్వామి విశ్వానందుని ఆశ్రమము మూర్ఖానందుడు ప్రవేశించును స్వామికి సాష్టాంగనమస్కారము చేయును.)

వి:-ఓం నమో నారాయణాయ! మీ ఆరోగ్యము బాగుగ నున్నదా ? చాల చిక్కిపోయినారే ? కారణమేమి ? మీ సాధన యెట్లున్నది ? మనము కలుసుకొని చాలకాలమైనది. మీరు ప్రయాగలోనే నుంటూ ఉన్నారా ?

మూ:-పూజ్యులగు స్వామిజీ! మీకు ప్రణామములు నాకు సరియైన మార్గము బోధింపుడు. నేను దుర్గుణములతో కూడి యున్నాను. నేను వేదాంత రహస్యములు గ్రహించలేదు. నేను మూర్ఖుడను.

వి:-మీరు అభిమానముతో కూడిన వేదాంతులే. ఇప్పుడు యీ ప్రకారము చెప్పుచున్నారేమి? మీరు రాజులకు రాజులే!

(అప్పుడు మూర్ఖానందుడు తనకథ చెప్పును)

వి:-మీరుచాల అదృష్టవంతులు మీరు ఆరు మాసములలో వేదాంతమంతయు గ్రహించినవారు. ఆధ్యాత్మికమార్గమందు మీరు మొదటి రకపు సాధకులు!

మూ:-కాదు. మహారాజా! నాతప్పు నాకు తెలిసినది. నాకు ఉపదేశము చేయుడు. మీరు చెప్పిన ప్రకారము చేసెదను. నేను మీకు శరణాగతుడను.

వి:-మీరు శుష్కవేదాంతము విడిచి పెట్టండి. నావద్ద కొంత కాలము ఉండుడు. నేను మీకు బోధచేసెదను. భయము లేదు. మీరు జీవన్ముక్తులయ్యెదరు.

(బ్రహ్మానందుని పిలుచును. రామనామ స్మరణ చేయుచుండు)

(బ్రహ్మానందునితో ఈ స్వామివచ్చినారు. నీవు వీరితో పరిచయము చేసికొనుము. మొదట నీవు యిచ్చటకు నే ప్రకారము వచ్చితివో వారికి తెల్పుము.

(అందరు నిష్క్రమింతురు)

సమాప్తము



# II కపట వేదాంతి

## I వ రంగము

బ్రహ్మానంద, భగత్ రామదాసు ప్రవేశము

ఒకతోట అందులో ఒక తిన్నెపైన బ్రహ్మానందుడు ఆసీనుడై యుండును. వానిప్రక్కన దండము, కమండలములుండును. అప్పుడప్పుడు శివోహం శివోహం అని ఉచ్చరించు చుండును. ఒక పువ్వుల బుట్టతో భగత్ రామత్రోవను వెళ్ళుచుండును.

బ్ర:-రామదాస్ జీ, మీరు తొందరగా వెళ్ళుచున్నారు.

రా:-ఎక్కువ తొందర యేమియులేదు. పూజవేళయైనది. ఏమి సెలవు ?

బ్ర:-నేను ప్రతిదినం యిచ్చట ధ్యానముకొఱకు కూర్చుండు నప్పుడు మీరువచ్చి వెళ్ళుచుందురు. జితేంద్రియుడగు మనజుడెట్లు కాలము గడపవలెనో మీకు కొంత చెప్పవలె నని పిలిచితిని. మీరు బాహ్యాపూజక్రింద చాలకాలము వృధాచేయుచున్నారు. నిజమైనపూజ ఆత్మపూజ. మీరు యింకను క్రిందమెట్టుగో నున్నారు. నేను మీ పూజ ప్రస్తుతం చెడగొట్టు నుద్దేశముతో లేనుకాని కొంతకాలమునకు మీరుకూడ నావలెనే మారిపోవుదురు. నేను నిర్మించిన కుటీరము నేను వేసినతోట మీకు చూపెంచవలెనని ఊహించితిని. నా కుటీరము శాంతికి నిలయము. తోట రూపమున అంపము వహించిన భగవానుడే, జీవముగల అన్నివస్తువులు చెట్లు, పువ్వులు అన్నియు భగవంతుడే.

పుష్పమే భగవంతుడైనప్పుడు భగవంతునిపై భగవంతుని వేయుట తెలివితక్కువకాదా?

రా:-స్వామిజీ! మీయొక్క గొప్పజ్ఞానవాక్కులు నేనుగ్రహింపజాలకున్నాను. నేను భగవంతునిపూజతో తృప్తిపడెదను.

బ్ర:-నాకు వృక్షశాస్త్రము బాగుగ తెలుసును. పంచదశి విచారసాగరము చదివినవారికి యితర విద్యలు నాకలెక్కలోనివికావు. నేను తోటలో తిరుగునప్పుడుకూడ బ్రహ్మమును చూచెదను. చూచుదు. ఆ పువ్వు ఎంత అందముగానున్నదో! ఎంత పరిమళము వెదజల్లుచున్నదో! (రామదాసు పువ్వు కోయబోగా వానిని వారించును.) పువ్వులు కోయకూడదు. చెట్టునుండి పువ్వుకోసిన మొక్కయొక్క అందము చెడిపోవును. భగవంతుడే అందము గనుక భగవంతుని నశింపు చేయుచున్నారని చెప్పవలసి వచ్చును. మీరు పువ్వులను మీ పూజాగృహమందు వెదజల్లుదురు. మీ దేవుడు శవములేని యొక రూపము. అట్టి వస్తువుమీద మీరు పుష్పములు యెందుకు వృథాగా వేసెదరు? నేను నా తోటమాలి పుష్పములు కోసినను వానిమీద కోపగించి వాని జీతము తగ్గించుచుందును. మరియు వానిని కొట్టుచుందును. నాకు రాగద్వేషములు లేవు. నవుకరు మంచికొరకే వానిని కొట్టెదను. కొట్టుట అనగా వానికి ఉపకారము చేయుటయే. కొంతకాలమునకు వాడు నావలె జ్ఞాని యగును.

రా:-మీరు చెప్పినది బాగుగనున్నది. కాని మీవంటి బ్రహ్మజ్ఞానులు కోపము తెచ్చుకొని బీద నవుకరును కొట్టకూడదు.

బ్ర:-మీ అభిప్రాయముతో నే నేకీభవించను. శివుడు మన్మధు నిపై కోపగించలేదా? దానివలన మన్మధునకు ఉపకారము జరుగలేదా? విష్ణు నరశింహావతారమెత్తి హిరణ్యాకసిపుని వధించలేదా? నేను బ్రహ్మ విష్ణు శివులతో సమానము కానా? నిర్గుణరూపమున వారికంటె అధికుడను. మీరు కేవలము భక్తులు. నా జ్ఞానమును గ్రహించలేదు దయ చేయుడు నా కుటీరము, నేను ధ్యానముచేయు చోటు చూపెదను.

(ఇద్దరు కలసి కుటీరము ప్రవేశించెదరు)

రా :- చాలబాగున్నది. మధ్యమందిరము గొప్ప యింజనీరు సలహాపై కట్టియుండవచ్చును.

బ్ర :- (నవ్వుచు) ఇంజనీరా! నేనే యింజనీరును. ఇంజనీరు లకు యేమి తెలుసును? నేనే ప్రపంచమునకు విశ్వకర్మనని ధ్యానించిన నేనే యింజనీరులలో గొప్పవాడనగుదును. కుటీరము కట్టుట నాకు స్వల్పవిషయము ఊహ లన్నియు నాహృదయమునందేగలవు. నాయందు అన్ని విద్యల జ్ఞానమున్నది. బ్రహ్మకళ దేవతయగు సరస్వతిని చూడ వలెనన్న నాలో వెదుకవలసినదే. (ఒక చలువరాతి శిలతో అమర్చబడిన అరుగుచూపి) ఇక్కడ నేనుకూర్చొని ధ్యానముచేసికొనెదను. నేను చిద్రూపుడను. నాగొప్ప తనము నాకు తెలుసును. ఒకప్పుడు యితరుల అజ్ఞానము తెలివితక్కువ కనిపెట్టుచుండును. నాతోటమాలులు పువ్వు లను వారమున కొకసారి మార్కెట్టునకు తీసికొనివెళ్ళి అమ్ముచుందురు నాతోటలో పండ్లు, కాయకూరలు

కూడనున్నవి. అవికూడ కోటకూలులు అమ్ముమంకుపు
వారికి నెలజీతము పుష్కలముగా నిచ్చెదను ఈతోటవల్ల
నాకు బాగా సొమ్ము వచ్చును. (రామదాసు సన్యాసు)
బ్రహ్మజ్ఞాని ఫలములు అమ్మకూడదని మీరూహించు
చున్నారు రాబోలును. మీరుఆశన చేసినతప్పు. నావిషయము
తప్పుకాదు. నేను నిజమైన బ్రహ్మజ్ఞానిని. ప్రపంచ
మంతయు నేనే. వస్తువులు అమ్మునప్పుడు నేను నొకవర్త
కునిగానె ఎంచుకొని ఖరీదులు బాగారాబట్టుచుందును.
శిష్యునుకూడ 'తస్కరనాంపతి' అనగా దొంగలలోరాజు
ఆ ప్రకారము జేసెగాండ్రలో, రాజును

రా:-స్వామిజీ! ధన్యవాదములు, మీ అందమైన కుటీరము చూచితిని. మీమనస్సు యెట్లునడుచుచున్నదో కూడ తెలిసి కొంటిని. నేనింక పూజకు వెళ్లెదను. ఇంకొక రోజున వచ్చెదను.

బ్ర:-మంచిది. నేను చాల దయాస్వరూపుడను. నాసత్సంగము యితరులకు కలుగ జేయుటకును, నాఆధ్యాత్మిక సలహా యిచ్చుటకును నేను ఎల్లప్పుడు సిద్ధముగా నుండెదను. మీ యిష్టము వచ్చినప్పుడు మీరు రావచ్చును.

రా:-చిత్తము, సెలవు-

## 2 వ రంగము

(బ్రహ్మనంద కుటీరమువద్ద నొకరోడ్డు. అచ్చట కొంతమంది జనులు గుంపుగా నుండిరి.)

మొదటివాడు:-ఇతడు స్వామియను పేరు పెట్టుకొనెనా? ఎంత దుర్మార్గుడైనను ఆవును చంపునా.

రెండవవాడు:-ఆవును చంపుటయా! రామరామ (చెవులు మూసికొనును)

మొ:-(కుటీరము వంకచూపి) ఇచ్చట నొక మోసగాడు ఉన్నాడు. జాబరారంగు దుస్తులు ధరించును. తన తోట లోనికి నొక ఆవువచ్చి కాబేజీ వగైరాలు మేసినదనే నెప ముచే ఒక పెద్దకర్రతో ఆవును కొట్టి చంపినాడు

మూడవవాడు:-కాబేజీలుతినినందుకా! నేను ఆవుకుబజారులో దొరుకు క్యాబేజి లన్నియు ఆహారముగా పెట్టుదునే. కాని ఆ ఆవు యజమాని ఊరుకున్నాడా? దానిని వెదుకుటకు రాలేదా?

మొ:-తోట యజమాని తెలివి తక్కువ వాడుకాడు. అతడు తక్షణం ఆ ఆవును తన తోటమాలి చేత రోడ్డుమీద పార వేయించినాడు. యజమాని వచ్చుసరికి తోటలో ఆవు లేదు. ఆ గుంపుచూడుడు ఆ ఆవు కళేబరమును పాతి పెట్టుట యా లేక మాదిగవానికి అమ్ముటయా అనుచర్చ జరుపుచున్నారు.

రెండవవాడు:-కాని స్వామియేమైనాడు? వానిపైన కేసుపెట్ట లేదా?

మొదటి:- అతడు చాల శక్తిగలవాడు. బాగా వాదించగలడు. వానిపైన కేసుపెట్టినను వాద వివాదముల తెలివితేటలవల్ల అతడే నెగ్గును.

మూడవ.-కాని యీ విషయము యిట్టిస్థితిలో విడువకూడదు. ఇది హిందూసంస్కృతికి చాల అవమానము గలిగించు

విషయము. ఆవును చంపుటయా! సిగ్గుసిగ్గు! అందులో సన్యాసివల్ల!

మొదటి:-మనస్నేహితుడు భక్తరామదాసు నానితో మాట్లాడు టకు వెళ్ళినాడు. అతడు వానిని యెరుగును. అదిగో చూడు వారిద్దరు వచ్చుచున్నారు.

అందరు అవును. అవును (దాగెదరు)

(రామదాసు బ్రహ్మానందం ప్రవేశం)

రా:-ఈపనికి మిమ్ముల నెవరును క్షమింపరు. ఆవునుచంపుట హిందువుచేయు పాపములలో మిక్కిలి హీనమైనపాపము.

బ్ర:-మీరు ఉద్రేకపురుషులు. బుద్ధిని సరిగా నుపయోగించరు. మీరు గీతచదివినారుగదా. చంపువారెవరు. చంపబడున దేది. ఇదిఅంతయు వట్టిభ్రమ. ఆవులోనున్న జీవునకుచావు లేదు. ఆవుయొక్క కళేబరమునకు ప్రాణములేదు. కాబట్టి ఆవుబహిశ్శరీరమునకు ప్రాణముండదు. ఇప్పుడు ఆశరీరము పోయినది. దానికి ముక్తిగలిగినది. అది తిరిగి ఆవుగా జన్మింప నవసరములేదు. అది మనుష్యజన్మ యెత్త వచ్చును. నీవలెభక్తుడు లేక నావలె జ్ఞానికావచ్చును.

రా: మీమిథ్యవేదాంతము కట్టిపెట్టుడు. ఆవును చంపి గీతశరణముగా తీసుకొనుచున్నారు. 'అద్వేష్ట సర్వ భూతా నాం' అని రోజును చదువుచున్నారా లేదా? జీవజంతువు సందు దయా విహీనుడుగా నుండవచ్చునా? నీ కృష్ణుడు గోవులను యెక్కువగా ప్రేమించువాడు. నీవు అట్టి ఆవును చంపితివి, నీవు నరకమునకుపోయెదవు.

బ్ర:-భక్త రామదాసు! నీవు చాల పొరపడుచున్నావు. నేను సాక్షిని నామనస్సు యింద్రియములు పనిచేయు చుండును. నేను యేమియు కర్మచేయను. విషయములు విషయేంద్రియములతో తిరుగుచుండును. నాహస్తము యొక్క దేవతయగు ఇంద్రుడే ఆఆవును చంపినవాడు. నేను అకర్తను. నిష్క్రియుడను. నేను కర్మతో సంబంధములేని ఆత్మను. కర్మనన్ను అంటదు. నేనునిర్లిప్తుడను. అసంగుడను. నీవుభక్తుడవు. నీకు యీతత్వము తెలియదు. రామనామము జపముచేయుట, కీర్తనచేయుటమాత్రమే నీకు తెలియును. నీకు వేదాంతజ్ఞానము లేదు. నీవుకీర్తన జపమువదలిపెట్టుము అప్పుడే నన్నును, నాతత్త్వమును తెలిసికొనగలవు. నాకు తొందరగా నున్నది. నీతో కాలము వృథాపర్చలేను. (వెళ్ళిపోయెను)

రా:-ఇటువంటి మోసగానిని ఎన్నడును చూచియుండలేదు. అతడు నాభక్తిని నిరసించెను. నేనుప్రార్థనచేసి నాప్రార్థన ఇంద్రుడు వినునట్లు చేయగలుగుదును. (ప్రార్థనచేయును) ఓస్వామి! ఇంద్రా! బ్రహ్మానందుడు నీవు ఆవును చంపి నావనియు ఆసమయమందు అతడు నీస్వరూపములో నిలిచి యున్నానని యు చెప్పుచున్నాడు. నీవు భూమికిదయచేసి వానికిబుద్ధిచెప్పుము. (నేనువచ్చెదను అనుధ్వని వినబడును) (అప్పుడు చెట్టుచాటున దాగిన మనుష్యులు బయటకు వచ్చెదరు.)

మొదటివాడు:-రామదాసుగారు నమస్కారము. ఆ దుర్మార్గుడు తప్పించుకొని పారిపోయినాడే. మేము మీ ప్రార్థన విన్నాము. భగవంతుడు భక్తునికోరిక తప్పక తీర్చును.

రా:-పుణ్యపురుషులారా! ఇట్టి దొంగవేదాంతులను సన్మానములు చేయుటకు వీలుకల్పించకున్నది. ఇతడెన్నడును ధ్యానము చేయడు. సంకీర్తన చేయువారి నెల్లప్పుడును నిందించుచుండును. రామనామము అతనికి గిట్టదు. భక్తి నిష్కామ్యకర్మ వానికిపనికిరావు. జాబరాంగుబట్ట ధరించి కరకమండలముతో వీధుల వెంట తిరుగుచుండును. గృహస్థులను మోసగించి సొమ్ము సంపాదించుటకు శివోహం శివోహం అనుచుండును. ఇతనిని తప్పక భగవంతుడు శిక్షించును.

రెండవవాడు:-భగవంతుడు తప్పక వానికి నీతి నేర్పును.

రా.-ఇంద్రుడు నాప్రార్థన తప్పక వినును. మనము ఆతుర్దా పడ నవసరములేదు. అతని వృత్తి అతని గుణములు అన్నియు వానికి తెలియును. నమస్తే దేవాలయమునకు వెళ్లు సమయమైనది.

అందరు:-మేము కూడ వచ్చెదము.

రా:-అట్లయిన రండు. భగవన్నామ సంకీర్తన చేసికొనుచు వెళ్ళెదము. (అందరు నిష్క్రమింతురు)

3 వ రంగము

(ఒక వర్తకుని వేషముతో ఇంద్రుడు వచ్చును-బ్రహ్మానందుని ఇల్లుతోట)

వర్తకుడు:-నమస్తే, స్వామిజీ! పూర్ణబ్రహ్మజ్ఞాని యనిపేరుగల బ్రహ్మానందస్వామి తమరేనా? ఈ కుటీరపు తోటకు యజమానులా? ప్రణామములు.

వర్తకుడు:- వారు తమరు కానియెడల వారు లోపల సమాధిలో నున్నారేమో వారికి కబురుచేయుడు. నేనొక సాధా

రణపు న ర్తకుడను.

బ్ర:-నేనే ఆయన. నా సమాధి 15 నిముషముల క్రిందటనే సమాప్తమైనది. అప్పుడు తోటలో సౌందర్యమను రూప ముతోనున్న ఆత్మను చూచుటకు వచ్చితిని.

వ:-మంచిది సంతోషము. ఆ అందమైన పువ్వుల మొక్కలు తమరెచ్చటనుండి తెప్పించితిరి.

బ్ర:-వాటిలో కొన్ని కాశ్మీరమునుండి తెప్పించితిని. అవి బాగుగా నెదగక నిలిచినప్పుడు నేను వృక్షశాస్త్రము బాగుగ తెలిసినవాడను కనుక వాటికి తగిన చికిత్సచేసి బ్రతికించితిని.

వ:-మొక్కలు పెంచుటలో మీకుచాల చతురులు. నేనుకొన్ని పండ్లు, కూరగాయలు, పువ్వులు కొనెదను. నేను వ్యవ హారరీత్యా యిక్కడకు వచ్చితిని. మీ రెక్కువఖరీదు చెప్పరని నూహించు చున్నాను.

బ్ర:- నేను బేరం చెప్పను. నేను స్థిరమైనధరలు చెప్పెదను. ఆ ధరలు యివ్వగలిగినవారు యిచ్చికొనెదరు. ఎక్కువ ఖరీదు పెట్టగలిగినవారికే అవి లభ్యమగును.

వ:-నన్ను నిరుత్సాహపరుచు చున్నారే! మీరు సన్యాసులు. మీకు గొప్పధరలు ఎందుకు?

బ్ర:-నేను సన్యాసిని గనుకనే నాకు సొమ్ము బాగా యివ్వ వలెను. ఇచ్చేవారుపరబ్రహ్మ. పరబ్రహ్మకు సొమ్మెందుకు? నాకు వచ్చేసొమ్ము పరబ్రహ్మ యిచ్చుచున్నాడు. మరియు సూర్యుడు అన్ని జలాశయములనుండి నీరు ఆవిరిరూపమున తీసికొనును అంతనీరు సూర్యుడెందుకు తీసికొనుచున్నాడు? ప్రజలందరకు వర్షరూపమున తిరిగి యిచ్చుటకు నాకు

ప్రపంచముకొరకు సొమ్ము కావలెను. నేను భుజించిన, లోకమంతయు భుజించినట్లే. నేను త్రాగిన ప్రపంచ మంతయు త్రాగినట్టే. నాకు ప్రపంచమందుండెడి ప్రేమవల్ల నాద్వారా ప్రపంచమునకు తినుటకు త్రాగుటకు కట్టు కొనుటకు మరియు యితరపనుల నిమిత్తము కావలసిన సొమ్ము తీసుకొనుచున్నాను. ప్రపంచము బీదగా నుండు టకు నేను సహించను. అది రాజువలె భాగ్యముతో తుల తూగు చుండవలెను.

వ:-బాగున్నది. ఆలోచనలేనివారు యింకొకవిధముగ అను కొనినను తెలివిగలవారు తప్పక మిమ్ములను పొగడుదురు. ఎందువల్లననగా మీరు మీ స్వంతవిషయముకూడ లెక్క చేయక ప్రపంచ కాళ్యాణము కొరకు పని చేయు చున్నారని చెప్పుచున్నారు. ఈకుటీరముకూడ యింజనీరుల సహాయములేకుండ మీరే నిర్మించినారనికూడ విన్నాను.

బ్ర:-నిజమే. నాకు బుద్ధికుశలత నెక్కువగానున్నది. నాకు యింజనీర్ల సలహా అవసరము లేదు.

వ:-బాగున్నది. బుద్ధిమంతుడు స్వతంత్రుడుగా నుండవచ్చును. కాని ఒక్కవిషయము మీకు వ్యతిరిక్తముగా కనుపించు చున్నది. మీరుకొంత కాలముక్రిందట నొకఆవునుచంపినట్లు గ్రామములో ప్రజలు చెప్పుకొనుచున్నారు.

బ్ర.-గ్రామస్థులు శుద్ధమూర్ఖులు. నేనుసాక్షిని. నేను అకర్తను నాచేయితాలూకు అధ్యక్ష దేవత ఇంద్రుడు ఆవును చంపి నాడు. గ్రామస్థులు సరిగా గ్రహించలేరు. నేను చెయ్యి కాదు. చేయినరికిన, నేను మరణింతునా? ఆరోజున

ఇంద్రుడువచ్చి ఆవును చంపినసంగతి గ్రామస్థులు గ్రహింప జాలకున్నారు.

ఐ:-(కోపముతో) ఓరీ మూర్ఖుడా! నేనే యింద్రుడను. నీవు మాయసన్యాసివి. సమాధి అభ్యసింపని శుష్కవేదాంతివి. నీవు యేదో కొంత చదివి నీయిష్టమువచ్చినట్లు వాగు చున్నావు. నీవు నన్ను మోసగించుకొని ప్రజలనుకూడ మోసగించుచున్నావు. నేను నిన్ను స్తోత్రము చేయునప్పుడు 'నేనే కుటీరము కట్టినాను. నేనే తోట వృద్ధిచేసినాను. నేనే అన్ని ప్లానులు వేస్తున్నాను, అని చెప్పినావు ఆవునుచంపుట విషయమైఅడిగినప్పుడు,నీవు అకర్తనని అధ్యాత్మతత్త్వము చెప్పి ఆపని యింద్రుడుచేసినట్టు చెప్పుచున్నావు. ఇదియేనా నీతత్త్వము. ఇదియేనా నీవేదాంతము. నీవు మోసగాడవు మిథ్యాచార్యుడవు. నిజమైన జీవన్ముక్తుడు కష్టసుఖములకు నిందాస్తుతులకు అతీతుడు. ప్రపంచసంబంధములో వాని మనస్సు నిర్మనస్సుగానుండును. అతడు శీతోష్ణములకు నోర్చినవాడుగనుండును. ఇంద్రియము లేపనిచేయును. నేను అకర్తను అని నీవు చెప్పేయెడల నీవు శీతోష్ణములకు చలించకూడదు. నిందాస్తోత్రములకు మానావమానములకు లోనుగాకూడదు. ఇదియేపరీక్ష. ఇందులో నీవు ఉత్తీర్ణుడవు కానియెడలనీకు మోక్షము లేదు. నీవుశరీరముయింద్రియము లతో తాదాత్మ్యముపొందినవాడవే. ఈ విషయము నిక ముందుమరువకుము. ఏమిచెప్పెదవు?

బ్ర.-(సిగ్గుతోతలవంచుకొని రెండు నిముషములతరువాత) స్వామీ! మీరు నాకండ్లు తెరచినారు. నేను వేదాంత

సారమిప్పుడు గ్రహించితిని. నేను అనుభవజ్ఞుడను. పంచదశి విచారసాగరముమాత్రము చదివితిని. నేను అనేక మందిని మోసపుచ్చి చాలధనము సంపాదించితిని. ఇకముందు నాజీవితముమార్చుకొనెదను. మననమునిధిధ్యాసనము చేసెదను. నాతప్పులన్నియు క్షమింపుడు.

వ:-(ఇంద్రుడు) నీ పాపములన్నియు నేను తుడిచివేయఁజాలను. నీవు లోగడనెట్లు వ్యవ్యహరించు చుంటివో ఏ ప్రకారము నీవు నడుచుకొనవలెనో చెప్పియున్నాను. జరిగినది మఱచిపొమ్ము. క్రొత్తజీవితము ప్రారంభింపుము. తప్పుడు మార్గములు త్రొక్కక వైరాగ్యము, పట్టుదల శ్రద్ధతో సాధన ప్రారంభింపుము. నిరాడంబరముగ కాలము గడుపుము. నిజమైన వేదాంతికి దయ, కరుణ, ప్రేమయుండవలెను. దురాశ, కామము, స్వలాభము, అహము నుండకూడదు. నీవు దీనుడవై అందరకు సేవచేయవలెను. వాచాలత్వము పనికిరాదు. మితభాషిగా నుండవలెను. ఊహాలకంటె పని యెక్కువగకన పడవలెను. నీవు మంచిగానుండి యితరులకు మంచి చేయవలెను.

బ్ర:-స్వామీ! తమ ఉత్తరువుల ప్రకారము నడుచుకొనెదను.

(ఇంద్రుడు అంతర్ధానమగును)



# III కామము క్రోధము

స్థలము కలకత్తా-అనేక కాఫీహోటల్సు వగైరాలతో జనసమ్మర్ధము గల బౌరంగీబజారు అను ప్రాంతము. రాత్రి 11 గంటల సమయము. అనేక మంది స్త్రీ పురుషులు విలాసముగా విహరించుచోటు.

## క్రోధుడు ప్రవేశము

క్రో:-(స్వగతము) సెబాస్! ఈరోజున నేను చాల మంచిపని చేసినాను. ఒక నల్లవాడితల నొక తెల్లవాడు సారా గ్లాసుతో బ్రద్దలకొట్టినాడు. అంతటితో నేనూరుకొంటినా? లేదు. త్రాగియున్న నల్లవాడు కత్తితో వాడి విరోధిని పొడిచెను. ఈ గందరగోళములో జనులు ఆ కాఫీహోటలును తగులబెట్టిరి. అగ్నియింజనులు, పోలీసులారీలు వచ్చినవి. చాల మంచిపని జరిగినది. నిర్మలమైన స్థలమునకు వెళ్ళి యింకను నేను చేయవలసినపని చూచుకొందము- (పాట పాడును.) నే నెట్టివాడనో మీకు తెలియునా? నాశక్తి మీకు తెలియునా! నేను తపస్సు పాడుచేయగలను. దూర్వాసుని జయించితిని. యాజ్ఞవల్క్యుని జయించితిని. శాంతికి విరోధిని. జ్ఞానమునకు విరోధిని. నేను రజోగుణమునకు పుట్టితిని. నేను అందరిని మ్రింగివేయగలను. నేను నరకమునకు ద్వారమును. ఆత్మయొక్క శాంతి మాపగలను. ఏకోరికైనను తృప్తిపడనప్పుడు నేను మనస్సునుండి బయలుదేరి జీవుని మూర్ఖునిజేసి అన్ని అధర్మములు వానిచేత చేయించెదను. వానికి కోపము తెప్పించి

నాకు దాసునిగా చేసికొందును. వాని మతి అపభ్రంశము
చేసి పూర్తిగా గ్రుడ్డివానిగా చేయుదును.

(అప్పుడు నొక స్త్రీ పురుషుల జంటకు కామోద్రేకము
కలిగించుచు కాముడు అక్కడకు వచ్చెను.)

కాముడు:-ఓ స్నేహితుడా! ఎవరునీవు?

క్రో:-నేనుక్రోధుడను. నన్నే కోపమనికూడ అందురు. నీవెవరు?
నాకు అడ్డమురాకుము. నా ఆలోచనకు అడ్డమురాకుము.
దూరముగా తొలగిపొమ్ము

కా:-అటులనా! మంచిది. నీ బలమునకు అడ్డు లేదు. ఓహో
మోహమా! నేనునీకంటెనుబలముగలవాడను. నేనుఅంద
రిని లోబర్చుకొందును. నేను భార్యాభర్తలకు పోరాటము
కల్పించివారివల్ల విడాకుపత్రములు (ఒకరినుండి రెండవవారు
విడిపోవుటకు అర్జీలు) పెట్టించగలను. నేను అందరిని ఉద్రే
కించునట్లుచేయగలను.

కా:-అంతేనా! నేను నీకంటె శక్తివంతుడను. వృత్తులలో
నాదిమొదటిస్థలము. నీది రెండవది. కామము మొదట
క్రోధము తరువాతవచ్చును. నీవునాకుమారుడవు. నీపుట్టుక
నావల్లనే. ఒకవ్యక్తికి తానుకోరిన వస్తువు దొరకనప్పుడు
అతనికి కోపము వచ్చును. కామమే క్రోధముక్రింద
మారును. కాన నీవు నాకు లొంగియుండవలెను. నన్ను
మర్యాద చేయవలెను. (పాట) నేను అవిద్యవలన పుట్టితిని.
నేను మూడు గ్రంథులలో నొక గ్రంథిని. ప్రపంచమంతయు
నాకు లోబడియుండును. నేను యెక్కువ శక్తిమంతుడను.
నేను సబబును ఖండించెదను. వివేకము తెలివి నాకు

లోబడవలసినదే. నేను ప్రతివ్యక్తిహృదయములో సంభోగాపేక్ష అంకురింపజేసెదను. అధ్యాత్మసాధకులు అప్రమత్తతగ నున్నప్పుడు వారిసాధనకూడ మట్టిలో కలిపి వేయగలను. నేను విశ్వామిత్రునివంటి మహాతపస్వియొక్క తపస్సుభంగము చేయగలిగితిని. సామాన్యుల లెక్కఎంత?

క్రో:- నీవు తప్పుడు అభిప్రాయము పడుచున్నావు. నేను నీకు కుమారుడనో కుమార్తెనో కావచ్చును. అది అట్లుండనిమ్ము. మునులశక్తి బలము ఆలోచించవలెను. నేను తప్పక నీ కంటె ఎక్కువ శక్తిగలవాడను. దూర్వాసునకు కామమున్నదా? కామమును అతడు లోబర్చుకొనగలిగెను కాని నన్ను అతడు జయింపలేక పోయెను. తండ్రి కంటె కుమారుడు ఎక్కువ తెలివిగలవాడు, బలము కలవాడు కావచ్చును. తండ్రి ఒకచిన్న గ్రామమునకు నెలకు 10 రూపాయలు వేతనముపైన గ్రామాధికారి ఉద్యోగము చేయుచున్నను వారి కుమారుడు నెలకు వెయ్యి రూపాయలు వేతనముపై కలెక్టరుపదవిలో నుండును.

కా:-నీవు విశ్వామిత్రఋషిపేరు వింటివా?

క్రో:-వింటిని. నేను వానిని యెరుగుదును. అతడు గొప్ప తపస్వి.

కా:-నేను వానికి కామోద్రేకము కలిగించితిని. దేవకన్యక యగు మేనకకు లొంగిపోయెను. తపశ్శక్తి మంట కలిసి పోయెను. ఆమెకు వానివలన శకుంతల యను కుమార్తె జనించెను.

క్రో:-నీవు ఒక్క విషయము తీసికొని బడాయి కొట్టకుము. ప్రపంచమంతయు దేవతలుకూడ నాకు లోబడుదురు.

కా:-ఓ స్నేహితుడా! వృథాగా అరవకుము. నీవు యయాతిని ఎఱుగుదువా?

క్రో:-ఎఱుగుదును - అతడొక చక్రవర్తి.

కా:-అట్టి యయాతి తన కుమారునివద్దనుండి యౌవనము యాచించి చాల సంవత్సరములు కామభోగలంపటుడై యుండెను.

క్రో:-నేను అందరిని మండించివేయుదును. నాకు లోబడిన మనుజుని నరకమునకు పంపుదును. నేను రజోగుణమువల్ల పుట్టితిని. శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పిన విషయము నీకు తెలుసునా?

శ్లో. కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్. (3-37

దీనినిబట్టి నేను రజస్సునుండి పుట్టినట్లు తెలియుచున్నది. మరియు

శ్లో. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః
కామక్రోధ స్తథాలోభ స్తస్మా దేత త్త్రియంత్యజేత్.
(16-21)

దీనినిబట్టి నేనుకూడ నాకు లొంగినవానిని నరకమునకు వేరుగా పంపగలనని తెలియుచున్నది.

క్రో:-నీవు వస్తువులయందు ఆసక్తిని మాత్రము గలుగజేయ గలవు. నేను వాని బుద్ధి నశింపజేసి యెట్టి ఘోరవుపను

నైనను చేయించగలను. నాయొక్క ప్రోద్బలమువలన వ్యక్తులు వారి తండ్రులను, సోదరులను, గురువులనుకూడ చంపగలరు. తరువాత వారు పశ్చాత్తాపబడుదురు.

కా:-పెద్దపెద్ద పరీక్షలు ప్యాసైనవారుకూడ స్త్రీలవద్ద కుక్కలుగ మారిపోవుదురు. నేను వారికి ఉద్రేకము గలిగించిన, వారి బుద్ధి నిముషములో అపభ్రంశమగును వారు బ్రహ్మచర్యవిషయమై పెద్దపెద్దపుస్తకములు వ్రాసినను, సభలలో గొప్ప ఉపన్యాసము లిచ్చినను యింటికి వచ్చినతరువాత వారు ఆడవాండ్రకు దాసులే. మోహాపరవశులగుదురు. వారి స్థితి చాల శోచనీయము, మంగలివానికి పావులా యిచ్చుటకు కూడ ఆడదానిని యాచించవలసినదే. వారి ఆత్మశక్తి, మగతనము పోగొట్టుకొనెదరు.

క్రో:-ఓ కామా ! వెదురు అడవిలో అగ్ని పుట్టుట నీవు చూచినావా ?

కా:-ఆ, చూచితిని.

క్రో:-రెండు వెదుళ్ళరాపిడివల్ల అగ్నిపుట్టి అడవియంతయు భస్మమగును. నేను యీ అగ్నికంటె యెక్కువశక్తి గలవాడను.

కా:-శ్రద్ధగావినుము. ఒకఋషి సంభోగించుచేపను చూచెను. నేనువానికి కామవికారము కలుగజేసితిని. నేను యింద్రుని అహల్య బాధపెట్టునట్లు చేసితిని. నేను మనుజుల మనస్సునందుండనియెడల ప్రపంచమంచు రక్తియేలేదు. స్త్రీలు, ఆకర్షణీయులుగాను అందముగాను కనుపించరు.

క్రో:-నేను హనుమంతునివంటి గొప్ప బ్రహ్మచారిని కోపము కలుగజేసి లంకఅంతయు తగులపెట్టి చివరకు తన తల్లి సీతకు ఎట్టి యాపదగలిగెనోయని తహతహపడుచు యిట్లు ఆలోచించెను. 'నేను కామమును పూర్తిగా జయించినను క్రోధమునకు లోబడితిని ఆహా! క్రోధము కామముకంటె బలిష్టమైనది, ఇంకనుమనము ఋషీకేశములో తపస్సుచేయు కొందరు పావనపురుషులయొక్క ఉద్దేశములుకనుగొందెదము

కా:-మంచిది. అదినాకునుసమ్మతమే. వెళ్లుదము.

(ఇద్దరు నిష్క్రమింతురు)

## 2 వ రంగము

(ఋషీకేశ ఆశ్రమము. అక్కడ కొందరు పాపపురుషులు ధ్యాన నిమగ్నులై యుండగా కామక్రోధులు వారిని కలిసి కొందురు)

క్రో:-ఓ ముముక్షులారా! నేను క్రోధుడను, అతడు కాముడు. మాలో నెవరుగొప్పవారో మీవల్ల తెలిసికొనుటకు వచ్చినారము.

కృష్ణారావు:-నేను కామమును జయించితిని. కాని అప్పుడప్పుడు కామము వచ్చుచుండును.

క్రో:-(ప్రేమచైతన్యునితో) ఓ బ్రహ్మచారీ! మీ అభిప్రాయ మేమి? నిజము వచింపుడు,

ప్రే.చై:-నేనును కామమును జయించితిని గాని అప్పుడప్పుడు కోపమునకు లోనగుచున్నాను.

కా:- ఈ సాధకులు చిన్నవారు. అనుభవజ్ఞులగు పెద్దవారిని అడుగుదము.

క్రో.స రే. ప్రొఫెసర్లను అడుగుదము. ఓ ప్రొఫెసరుగారూ! ఏది యెక్కువ శక్తిగలది? కామమా? క్రోధమా?

ప్రొఫెసరు సుబ్రహ్మణ్యం:- ధ్యానమువల్లను మతగ్రంధములు చదువుటవల్లను నేను కామమును లోబర్చుకొంటిని గాని క్రోధమును లోబర్చుకోలేక యున్నాను. ఇందువల్ల నన్ను దూర్వాసులని జనులు పిలిచెదరు.

కా:-నేను ఓడితిని. స్నేహితుడా! నీకు జోహారు చేయుచున్నాను. నీ శక్తిబలము ప్రసంశనీయము.

(తెఱపడును)

## ఏ వ రం గ ము

(ఉత్తరకాశి-ఒక సన్యాసి ఆశ్రమము. శిష్యుడు గురువును ఆధ్యాత్మిక సాధన విషయమై కొన్ని ప్రశ్నలు వేయుచున్నాడు. గురువు వాటికి సమాధానములు చెప్పుచుండును)

ఆత్మచైతన్యుడు:-జయగురు, హరిగురు, శివగురురాం.జగద్గురు పరమగురు సద్గురుశ్యాం ఓ గురుభగవానుడా! నేను కోపమును స్వాధీనము చేసికొనలేక యున్నాను. దీనిని స్వాధీనపర్చుకొనుటకు మార్గము తెలపిండు.

జ్ఞానానంద:-బిడ్డా కోపము తపస్సును నిమేషమాత్రమున ధ్వంసముచేయును. నీవు కోపమును స్వాధీనపర్చుకొనిన నీకు సుఖముగలుగును. యోగివగుదువు. శ్రీ కృష్ణుడు గీతలో చెప్పినదేమన.

శక్రోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్,
కామంక్రోధోద్భవం వేగం సయుక్తః ససుఖీనరః॥

అనగా యీ ప్రపంచమందు కామక్రోధములనుండి విముక్తి చేసికొనువాడే యోగియై సుఖించువాడు. రాజ యోగులు ప్రతిపక్ష భావపద్ధతివల్ల కోపమును జయింతురు. కోపమునకు వ్యతిరిక్తమగు గుణము అభ్యసించుటవల్ల కోపము తగ్గును.

చై:-తక్షణందాని వేగముతగ్గించుకొనుటకు నేనేమిచేయవలెను.

జ్ఞా:-మొదట నీశరీరము నీస్వాధీనమందుంచుకొనవలెను. నీవు సరిగా జపము చేయుము. ధ్యానము చేయుము. నీవెన్ని మాలలు జపము చేయుచున్నావు ?

చై:-ఉదయం 2 మాలలు, సాయంత్రం 2 మాలలు చేయు చున్నాను.

జ్ఞా:-అది చాలదు. ఉదయం పది మాలలు సాయంత్రము 10 మాలలు చేయుము.

చై:-స్వామి, అలాగుననే చేసెదను

జ్ఞా:-ఆహారము కూడకొంత ఉద్రేకము గలిగించు గుణము లుండును. పాలు, పెరుగు, పండ్లు, బార్లీ, వేరుశెనగ, మజ్జిగ, పుచ్చుకొనుము. వెల్లుల్లి, నీరుల్లి, ములగ పుచ్చు కొనకూడదు.

చై:-తమ ఆజ్ఞప్రకారము జరిపెదను. ఇంకనుతమరు సెలవిచ్చు నది యేమైన యున్నదా ?

జ్ఞా:-మరియు ప్రతిదినము 2 గంటలు మౌనముగానుండవలెను. ఆదివారం 6 గంటలు మౌనముగా నుండవలెను. అప్పు డప్పుడు రోజంతయు మౌనముగా నుండుము.

చై:-మౌనసమయమందు నేను యేమి చేయవలెను? పుస్తక ములు చదువవచ్చునా?

జ్ఞా:- జపము ధ్యానము చేయుము. నీకు యెక్కువగా శక్తి గలుగును.

చై:-ప్రాణమునకును మనస్సునకును సంబంధమేమి ?

జ్ఞా:-ప్రాణము మనస్సును నొకతీగెవలె చుట్టుకొని యుండును. ప్రాణము మనస్సును లోబర్చుకొనుటకు మార్గదర్శిగా నుండును.

చై:- ప్రాణాయామముకూడ మనస్సును స్వాధీనమందుంచు కొనగలదా ?

జ్ఞా:-తప్పక స్వాధీనమందుంచుకొనును. మరియు ప్రాణాయామము వలన వాక్బంధన గలుగును.

చై:-ఈ విషయమై తమరు యింకను విపులముగ బోధింపుడు.

జ్ఞా:-బ్రహ్మచర్య అవలంభింపుము. చిత్తమునందు విసుకుఅను ఒక చిన్న అల కనుపించునపుడు అది పెద్దది కాకుండ దానిని త్రుంచివేయవలెను. ఆ ప్రకారము స్వాధీనపర్చుకొన లేనప్పుడు ఆ స్థలము విడిచిపెట్టి ఓం ఓం అనుకొనుము. తర్కించుట మానుము. మృదువుగా మాట్లాడుము. ఎవరైనను నిన్ను తిట్టిన వానితో ఎదురు మాట్లాడకుము అందరిలోనుండు ఆత్మ నొకటియేగనుక ఆత్మతో తాదాత్మ్యము పొందుము.

చై:-తమ ఉపదేశము ప్రకారము నడుచుకొనెదను. వేదాంతి పద్ధతిని కోపమును ఎట్లు జయించవలెనో తెలుపగోరెదను.

జ్ఞా:-వేదాంతి తాను ఎవరో విచారణచేయును. నేతినేతి వాక్యములవలన అనగా నేను శరీరమునుకాను, మనస్సును కాను, చిదానంద స్వరూపమగు బ్రహ్మమును అని తాను

బ్రహ్మముతో తాదాత్మ్యమునుపొంది ఎల్లప్పుడు ఓం ఓం అని పాడుచుండును. ఓం అనియే ధ్యానించును. తానే ఆత్మస్వరూపమని నిశ్చయించును. అందువలన అతనికి ఆత్మశక్తి ఆధ్యాత్మికబలము కలుగును. నీవు మిధ్యా దృష్టి, దోషదృష్టి కలిగి కోపముయొక్క లోపములను, ఓర్పుయొక్క ఉపయోగములను గుర్తించిన నీకు యెప్పుడును కోపమురాదు.

చై:-స్వామీ! నేనొక్కమార్గమందే నడువనా? లేక రెండును సంపుటీకరణము చేయనా?

జ్ఞా:-రెండును కలిపి అనుసరించిన యెక్కువగ ఉపయోగము కలుగును. జపము ప్రాణాయామము చేయుము. అప్పుడప్పుడు విచారణ చేయుము.

చై:-ఓ పూజ్యప్రభూ! తనుయొక్క విలువగల సలహాల ప్రకారము నడుచుకొనెదను. ఓరక్షకుడా! ప్రాణదాతా! తమకు కోట్లకొలది ప్రణామములు. తమ ఆశీర్వచనము కోరుచున్నాను. తమరే నాతండ్రి, తల్లి, స్నేహితుడవు, రక్షకుడవు. ప్రపంచమందు గురువుకంటె గొప్ప ఆధారము లేదు. గురువే బ్రహ్మము.

గురుర్ బ్రహ్మగురుర్ విష్ణుగురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

ధ్యానమూలం గురోర్మూర్తి పూజామూలం గురోర్పదం। మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోర్కృపః॥

# IV కాఫీ - పాలు

## మొదటి రంగము

ఒక గవర్నమెంటు ఉద్యోగస్థుని గృహము. ఉద్యోగస్థుడు, డాక్టరు సంభాషించుచుందురు. నౌకరు కాఫీ తెచ్చి బల్లమీద పెట్టును.

ఉద్యోగస్థుడు అయ్యంగారు:-డాక్టర్ నాయర్ గారు కాఫీవచ్చినది. ఈనవుకర్లు సరియైన టైముకు కాఫీ తీసుకొని రాక బాధ పెట్టుచుందురు. కాఫీచాల బాగా ఉండును. (ఒక కప్పులో డాక్టరుగారికి కాఫీ పోయును. నవుకరుతో వెళ్ళుమని చెప్పును. అతడు వెళ్ళును.)

అయ్యం:-ఇది మీఆరోగ్యమునకై త్రాగుచున్నాను. ఇది మంచి రుచికరముగా నున్నది. (కాఫీ త్రాగును)

నాయర్:-(కాఫీ త్రాగును) చాలా బాగా నున్నదండీ ?

అయ్యం:-ఔను నాకు తెలుసును. ఈచలిగాలిలో కాఫీ త్రాగుట చాలా సంతోషముతో కూడియున్న విషయము. (ఇంకొకసారి కఫీ కప్పులోపోసి డాక్టరుకు యిచ్చును) జీవితములో యింతకంటె సంతోషముకలిగించే పదార్థముండదు.

(80 సంవత్సరముల వయస్సుగల అయ్యంగారి తల్లి వచ్చును)

తల్లి:-(అయ్యంగారుతో) నీనూ! నీవు భోజనమునకురావా ? ఇప్పుడు 11 గంటలైనది. ఈరీతిగనీవు కాఫీ తీసికొనుచుండిన నీఆరోగ్యము చెడిపోదా ? నీభార్య యింతవరకు భోజనము చేయ లేదు. వెళ్ళి భోజనముచేయుము. నీతండ్రి గారిని పిలిచెదను. (వెళ్ళి తిరిగి తల్లి తండ్రి వచ్చెదరు.)

అయ్యం:-(తల్లితో) మీరు వెళ్లి భోజనము చెయ్యండి నాకివ్వాడాకలి లేదు.

తండ్రి:-(విసుకుతో) ఔను నీకు ఆకలి యెందుకగును? నీపొట్ట విషతుల్యమగు కాఫీతో నింపుచుంటివిగదా!

అయ్యం:-అది విషమని మీకెవరు చెప్పినారు? (డాక్టరుగారితో) ఈ ముసలివాండ్రు యొక్క విపరీతమైన యూహాలిట్లుండును.

తల్లి:-ఇందులో విషముగాక మరేమున్నది?

అయ్యం.-పూర్వకాలమందు కాఫీలేదు. గనుక మీరు చల్ది అన్నమునకు, పెరుగునకును అలవాటుపడియుండిరి. ఇప్పుడు కాఫీ దొరుకుచున్నది. మీరు త్రాగుడి. కాఫీ యొక్క ఆశ్చర్యకరమైన ఉపయోగ మేమనిచెప్పను!!!

తండ్రి:-అవును! నాకు చెప్పనవసరము లేదు. నీముఖము చూస్తే సందేహము లేకుండా కాఫీ దేవత ద్రావక రూపకమైన సైతానని తెలియవచ్చుచున్నది. నాకిప్పుడు 93 సంవత్సరములు నీకు 45 సం||లు. నీవుకాగితాలసంచియైనను యెత్తలేవు. మేడమీద కెక్కితే 10 నిముషములు అలసట తీర్చుకొనవలసినదే. రోజు విడిచి రోజు గుండె నొప్పితో భాధపడుచుందువు. నాసలహా గమనించి కాఫీవిడిచి పెట్టుము. నీపిల్లలనుకూడ పాడుచెయ్యకుము. పాలు, పెరుగు, వెన్న పుచ్చుకొనుము.

అయ్యం.-ఇదెఆధునిక పునర్జీవిత సూత్రము కాబోలు! ఏమండీ డాక్టరుగారూ! (తండ్రితో) మంచిది. మీరు లోపలకు వెళ్ళండి. నేను ఇప్పుడే కొన్ని నిముషములలో వచ్చెదను.

(తల్లి తండ్రి వెళ్ళెదరు)

నాయర్ :-మనకుకాఫీయందు నెంత ప్రేమ యున్నను,మీనాన్న గారు చెప్పిన విషయము నిజము.

అయ్యం:-ఏమి ! మీరుకూడ యీ ఆనాగరికులకు లొంగిపోవు చున్నారే!

నా:-అందులో నొక యుపయోగమున్న మన మెందుకు లొంగిపోకూడదు. కాఫీయందు కొన్ని ఉపయోగము లున్నవి. అది నల్లమందుకు విరుగుడు. అది డోకుకట్టుటకు ఒకరకపు మంచిమందు. మరియు అదికొన్ని రకముల తల నొప్పులకు ఔషధము ఒకవిధమైన విస్మయము (Shock) నకు నేను కాఫీవాడుదును. అది కొంతవరకు పనిచేయును.

అయ్యం:-సరే, అది వైద్యులతీర్పు. కాని మావంటివారు చెప్పవలసినవి చాలనున్నవి. రాత్రి 9 గంటలైన తరువాత గంటగంటకు కాఫీ తీసికొనిన అర్థరాత్రివరకు పనిచేయ వచ్చును. అది బుద్ధిసూక్ష్మత గలిగించును. కాఫీ విషయమై నాలుగు పేజీల గ్రంథము వ్రాయగలను. ధ్యానమునకు కూడ నుపయోగకారియని నొక వేదాంతి నాకు చెప్పి నట్లు జ్ఞాపకము.

నా:-జపమునకు, కీర్తనకు ఉత్తేజము కలిగించునని చెప్పు వేదాంతి యొక మొద్దబ్బాయియై యుండవలెను. కాఫీలో కలుగు ఉత్తేజము క్షణికము. స్వాభావికము కాదు. అది క్రమశః ప్రమాదమునకు కారణమగును. కాఫీగింజలు వేయించునపుడు నొక రకమైన 'కాఫియన్' అను నూనె బయలుదేరును. అది రక్తనాళములను వదులుచేసి నెత్తు రెక్కువ తొందరగ పారుటకు కారణమగును. అందువల్ల

హృదయము కొందరగ పనిచేయును. అది రక్తనాళముల నెక్కువ బిగువు చేయును. మరియు బ్రహ్మాదండికి కూడ నుత్తేజము గలిగించును. కాఫీ త్వరగా పనిచేయును గాని మొదట మనకు చురుకుదనము కలిగినను, అది స్వల్ప కాలముండును. తరువాత నరముల పటుత్వము పూర్తిగ తగ్గిపోవును. ఇందుకు మీకు దృష్టాంతము చూపెదను. ఇప్పుడు మీరు కాఫీకప్పు ఎత్తి కొంతసేపు చేయి అట్లుంచుడు. చేయి వణకును. అది కాఫీ చేయుపని. మీ తండ్రి అంతవయస్సు కలవారైనను నీకున్న నరముల దుర్బరత్వము వారికి లేదు.

అయ్యం:-కాని కొందరు డాక్టర్లు కాఫీ బాగా శక్తిజనక పదార్థ మని చెప్పుదురు.

నా:- ఆ సంగతి నేను చెప్పితినిగదా! కాఫీ క్వినైను (Quinnine) వలె త్రాగిన నరముల పటుత్వమునకు మంచిదే. మనలో కొంత నత్రజని పదార్థము ఖర్చగు చుండును. అది యెక్కువగ ఖర్చుకాకుండ ఆ ఖర్చును కాఫీ కొంత మందగింపు చేయును. కాని కాఫీ మందుగా త్రాగు వారెవరుందురు? మూడవ కప్పుఅలవాటగు సరికి అదియొక విడవలేని అలవాటగును. కొంతమంది కాఫీ వాసన యుండినగాని నిద్రనుండి లేవరు. కృత్రిమ ఉత్తేజము నరముల బలము లాగివేయును. మనము క్రమశః కాఫీ కప్పులు వృద్ధిచేయుచుందుము. అందువల్ల దాని చెడుఫలితములు నెమ్మదిగా మనలను బాధించును.

అయ్యం:-మీరు కాఫీని ఖండించుట నాకు చాల ఆశ్చర్యముగ నున్నది.

నా:- కాఫీయొక్క చెడుగుణములు నాకు ముందుగ తెలిసిన నేను దానిని అభ్యసించక యుండెడివాడను. ఇప్పుడుకూడ నేను చాల జాగ్రత్తగా నుంటాను. నేను యింటివద్ద కాఫీ త్రాగను.

అయ్యం:- అయితే టీ త్రాగుదురు కాబోలు.

నా:-ప్రతిదినము అదియును త్రాగను. ఎవరైనను అతిథులు వచ్చినప్పుడు తప్పదు. టీ, కాఫీవలెనే చెడుగుణములు కలది దీనియందు కాఫీయందుండెడి ఉత్తేజిత గుణము కూడ అంత లేదు. టీ పొట్లములు కట్టువారు ఆ వాసనకు జబ్బుపడుచుందురు. అనేకమందికి ప్రమాదకరమైనను, అది నేను పుచ్చుకొనుట అనగా అహింసాతత్త్వమును భంగపరచుటయే కదా! టీ మంచిచెడ్డలు విభజించువారు అది రుచిచూచెదరే గాని మింగరు. ఐనను అట్టివారుకూడ అనేకమంది కొద్దికాలములో నరముల దుర్బలత్వము పొందుచున్నారు. కాఫీ త్రాగువారివలెనే టీ త్రాగువారికి కూడ కొన్ని బాధలున్నవి. ఆకలి మందగించుట. తిండి తిన్న తరువాత నొక విధమైన తలనొప్పి, అప్పుడప్పుడు తల తిరుగుట, మొద్దుబారుట, జరుగును.

అయ్యం:-ఇవి అన్నియు చెప్పకండి. నాకు సరిగాలేదు. (గుండెల మీద రెండుచేతులు వేసికొని) తిరిగి గుండెజబ్బు అని ముందుకు పడును )

నా:-(తక్షణం గుండెపరీక్ష చేయుయంత్రము (Stethoscope) తీయును. నవాసారము బుడ్డి తీయును. పడిన ధ్వని విని అయ్యంగారి తలిదండ్రులు వచ్చెదరు. తల్లి యేడ్చును)

నా:- ఏమియు లేదండి ఒక నిముషములో అతడు సరిగా నుండును. (నవాసారము బుడ్డి అయ్యంగారు ముక్కువద్ద పెట్టును)

అయ్యం:-(లేచును) డాక్టరుగారు ధన్యవాదములు. మీరిప్పుడు దగ్గరనుండుట మంచిదైనది. ఈ రోజున మామూలుకంటె హెచ్చుగా వచ్చినది.

నా:-దీనిని 'పొగాకు గుండెకాయ' అందురు,

అయ్యం:-నే నెన్నడును పొగాకు పీల్చుటగాని పొగాకు నము లుట గాని యెఱుగను.

నా:-అటులైన నిది కాఫీయొక్క పనియే. కాఫీకూడ యిట్టి ప్రమాదమును గలుగజేయును.

తం:-నే నెఱుగుదును. ఈ రోజు చాల మంచిరోజు ఈ రోజు నుండి కాఫీ త్రాగనని ఒట్టు పెట్టుకొనుము.

నా:-మీ తండ్రిగారి మాట వినుము.

అయ్యం:-మీ సలహామీద వినవలసి యున్నది.

(తల్లి లోనికి వెళ్ళి ఒక గ్లాసుతో వేడిపాలు తెచ్చి అయ్యంగారి కిచ్చును.)

తండ్రి:-ఇవి మంచి ఆవుపాలు. అమృతము వంటివి. ఇవి త్రాగుము. నీవు కుదుటపడెదవు.

నాయర్:-అయ్యంగారుగారు పాలు మంచి ఆహారము. అందు అన్నిరకముల పోషకపదార్థము లుండును. కాఫీ, టీలు మనుజుని తక్షణం చంపకపోవుటకు కారణ మేమనగా

వాటిలో కొన్ని పాలు కలియును. అవి రోగులకు కూడ మంచి ఆహారము. ఆరోగ్యవంతులకు టానిక్కు వంటివి. బుద్ధిని వృద్ధి చేయును. సత్త్వగుణము కలది. యోగులకు మహాత్ములకు అవియెక్కువగా ఇష్టము. కాఫీ టీలు అనవసరముగు ఉత్తేజములు కలుగజేసి బాధలకు కారణమగును. కాబట్టి మనకప్పులలో నిలిచియున్న కాఫీ నిప్పులలో పారపోయుదము. ఇది మంచి తరుణము. ఆ అగ్ని యెదుటనే నిక త్రాగనని శపథము చేయుదము. (ఆ ప్రకారము నిల్వ యున్న కాఫీ పొయిలో పోసి యిద్దరును యికముందు అవి త్రాగమని శఫథము చేయుదురు)

**తండ్రి తల్లి:**-మీరు చిరంజీవులై ఆరోగ్యవంతులగుదురుగాక



# V. పాలు, మాంసము

(కలకత్తాలో న్యూమార్కెట్టులో ఒకస్టాల్ అందులో ఒకవైపున మాంసము అమ్ము దుకాణము రెండవవైపున పాలు అమ్ముషాపు ఉండును. రెండు చోట్లను సరుకులు అమ్ము నౌకర్లుందురు. టప్ అని ధ్వనితో పాలబుడ్డి మూత పైకిపోవును. అందుండి యొక మనుష్యుడు వచ్చును. మాంసపు ప్యాకెట్టు యొకటి విడిపోగా అందుండి యొక మనుష్యుడు వచ్చును. వీరిద్దరకు యీ దిగువ సంభాషణ జరుగును)

మాంసం:-ఓ పాలా! నీకు ముగ్గురు నౌకర్లు యిచ్చినారు. నాకు వక్కరినే యిచ్చినారు. ఇంత పక్షపాతము ఎందుకు?

పాలు:-(నవ్వుచు) అవును అవును. వారు సరిగానే ఆలోచించి నారు. ప్రధాన మంత్రివద్ద అనేక నౌకర్లుందురు. కొద్ది అధికారిక్రింద ఒక్కడే ఉండును. (బిగ్గరగా నవ్వెను.)

మాం:-ఓ పాలా! నేను నీకంటె అధికురాలను. ఎందువల్ల ననగా నాలో ప్రోటీనుసీకం ఆల్ బూమిన్‌లు గ్రాముకు 5 97 ఉన్నవి. నీలో ప్రోటీన్‌లాక్టల్‌బూంమిన్‌లు గ్రాముకు .94 మాత్రమే ఉన్నవి.

పా:-ప్రోటీనులు తక్కువ వున్నంతమాత్రమున నీవు నాకంటె అధికురాలవు కానేరవు. వస్తువు చాల ఉన్నంతమాత్ర మున దాని ఉపయోగము లేదు. నీ ప్రోటీను బెల్లమువలె నుండును. నాలో బాగుపరచిన పంచారవలె నుండును. అది శాకరీన్‌వలె పూర్ణమైన సారము. దానియందు చాల శక్తి గలదు.

మాం:-(కోపముతో) గొప్పగొప్ప ప్రభువులు పశ్చిమదేశ నివాసులు రాజులు నన్ను మర్యాద చేయుదురు.

పా:-ఓ, ఇంతేనా, నన్ను ఋషులు, మునులు, యోగులు, పావనపురుషులు హిందూదేశమందు మర్యాదచేయుదురు నేను యజ్ఞములయందు అలంకరింప బడుదును. నేను మనుజుల హృదయములు పవిత్రత చేయుదును. నేను పంచకవ్యములలో నొక భాగమును. నాకు సాత్విక గుణము కలదు. నీకు రాజసగుణము కలదు.

మాం:-నేను యుద్ధములో సిపాయిలయందును, సేనానాయకులయందును క్రొత్త యుద్రేకము కలిగించుదును.

పా:-ఇది సరియైన ఊహ కాదు. అది బీర్ అను సారాయి త్రాగువారియొక్క పిచ్చి యూహ. అది ఉద్రేకము మాత్రము కలిగించును. నిజమైన సైన్యాధికార్లందరు నన్నే ఆదరింతురు. వారు పాలరసమే పుచ్చుకొందురు.

మాం:-నా అనుయాయులు యీ ప్రపంచమందు చాలమంది యున్నారు. అన్నిచోట్ల నాకు మర్యాద యిచ్చెదరు.

పాలు:-సైతానుకు కూడ చాలమంది అనుచరు లుందురు.

మాం.-(కోపముతో) ఛీ! నన్ను సైతాను అనెదవా?

పా:-సైతానుకంటె యింకను నీచమైనదానవే. గొప్ప ప్రకృతి శాస్త్రజ్ఞులు యిప్పుడు నిన్ను విడిచిపెట్టి నన్నే ఆశ్రయించుచున్నారు.

మాం:-నేను జనుల ఆలోచనలు వృద్ధిచేయుచున్నాను.

పా:-అదియు అబద్ధమే. గొప్పగొప్ప తత్త్వశాస్త్రజ్ఞులగు పైథాగరీస్, ప్లేటో, అరిస్టాటిల్, సోక్రటీసు అనువారు శాఖాహారులే. బర్నార్డు షా, సర్ ఐస్టాఫర్డుకిప్సు, మహా

త్మా గాంధి మొదలగువారు పాలే పుచ్చుకొనిరి. మాం
సము అనారోగ్యమైనది. అస్వాభావికమైనది. అది అనవ
సరము. దానివల్ల నారి కురుపు యింకను వివిధమైన పురు
గులు సంబంధమైన జబ్బులు తటస్థమగును.

మా:-దానివల్ల వాతరోగము కీళ్ళు నెప్పులు కలుగును. నేను
నీకంటె యెక్కువ బలముచేయు పదార్థమును. డాక్టర్లు
రోగులకు మాంస రసము యిప్పింతురు,

పా:-అదియు అబద్ధమే. నేను జబ్బుగా యుండువారికి, జబ్బు
నుండి క్రొత్తగా ఆరోగ్యము పొందినవారికి, పిల్లలకు ఆహా
రముగా ఉపయోగపడెదను. పూర్వకాలపు రాక్షస గుణ
ములుగల డాక్టర్లు మాత్రమే మాంస రసమును పుచ్చుకొన
మని చెప్పుచుండెడివారు. జ్ఞానముగల ఆధునిక డాక్టర్లు
మాంసాహారము విడిచిపెట్టమనియే చెప్పుదురు. డాక్టరు
జోషియా ఓల్డుఫీల్డు, డాక్టరు సర్ హెన్రీ థామ్సన్, యర్
డియల్ ఆర్సన్ అనువారలు వ్రాసిన రిపోర్టులు చదువుడు.
అవి చదివిన నేను చెప్పిన విషయముల నిజస్థితి నీకు తెలి
యును.

మా:-యూరపు ఖండములో ఫలహార శాలలయందు భోజన
శాలలందును అనేక ఆహారపదార్థములు తయారుచేయు
చుందురు. వారందరు నన్ను చాల ప్రేమతో చూచెదరు.

పా:-నీవు బెంగాలు హిందూస్థానమునకు వెళ్లలేదు. అక్కడ
నాతో హల్వాలు మొదలగు 1001 పదార్థములు తయారు
చేయుదురు. నీకు ఆశ్చర్యముగానున్నది. నా వెంటరమ్ము.
నేను నీకు చూపించెదను. రబ్బడీలు, పేడాలు, సలదేష్,

రసగుల్లా, కలకండ మొదలగు అనేక రకముల మిఠాయిలు చేసెదరు. ఆపదార్థములు పేళ్లుకూడ చాల ఆకర్షణీయ ముగ నుండును. అవి జనుల రుచి ఆకర్షణ చేయును. బెంగాలులో యూరోపియనులు కూడ రసగుల్లలతోను, నలందేశులతోను పొట్టలు నింపుకొనెదరు.

మాం:-నాస్నేహితుడగు పాలా! నే నోడిపోతిని. నీవు ధన్యవాదములు. నీతో నింక పోరాడను. నాకు ముసలితనము వచ్చినది. నాఅధికారము నేను వదలుకొన్నాను. పూర్వ కాలమందు నేను అందరికి సేవ చేసినాను. గనుక నాకు కొద్దిగా ఉపకారం వేతనమైనను యివ్వండి. నాపేరు పూర్తిగ తుడిచివేయవద్దు. రాననుని పేరువలెనే నాపేరు కూడ కొంచెము జ్ఞాపకములో నుండనిమ్ము. నమస్తే.

(తిరిగి పాలసీసామీద బిరడా పడిపోవును) మేనేజరు సాహెబుగారు నవుకర్లుయజమానులు ఆశ్చర్యముగా విన్నారా!

మే:- గులామ్! ఆశ్చర్యమైన యీ సంభాషణ విన్నాను. ఈ రోజున హైటుహాలులో మాంసము అమ్మవద్దు. మాంసము యిచట అమ్మబడదని బైట బోర్డు కట్టుము. ఇంకను యెక్కువగా పాలుతీసి మిఠాయి పదార్థములు మాత్రము యేర్పాటు చేయుము.



# VI నాలుగు ఉత్తరములు

పూర్వము ప్రజలు యెట్టిభాధలు లేకుండ నుండెడివారు. కాని తరువాత మనుష్యులకు చావు కల్పించి జననమరణముల నేర్పరచి చావు తరుణము తెలిసికొని ఆ సమయమునకు భూమి యందలి ప్రజలను రప్పించుటకు భూమి యందలి తెలివిగల మనుజుని అందుకు అధికారిగా అనగా యమునిగా యేర్పాటు చేసిరి.

## 1వ రంగము

(ప్రాతఃకాలము ఇద్దరు మనుష్యులు సంభాషించుచుందురు. అందులో నొకడు భూలోకమునకు చెందినవాడు. రెండవ వ్యక్తి యమలోక నివాసి)

మనుష్యుడు:-నీవు ఇప్పుడు బాగా నున్నావే. నిన్ను చూచి చాల కాలమైనది. నీవు కాశీ వెళ్లినావా ?

యముడు:-నేను కాశి వెళ్ళలేదు. నేను యమలోకమునుండి వచ్చినాను.

మ:-వేళాకోళము మానండి.

య:-నామాట నీవునమ్మకపోతే నాశరీరము తాకి చూడుము. మీావలెనాకు స్థూలశరీరములేదు. సూక్ష్మ శరీరమున్నది. నేను యిప్పుడు మనుజులను వారికి సరియైన కాలము సమీాపించి నప్పుడు వారు చేసిన కర్మముల ప్రకారముఅనుభవించుటకు చిత్రగుప్తుని వద్దకు వారిని తీసుకువెళ్లుటకు నియమింప బడినాను.

మ:-అనగా మనుష్య జీవితము అంతముచేసి మీాలోకమునకు తీసికొని వెళ్లెదవా ? ఈఅధికారము నీకెవరిచ్చినారు ?

య:-కొంతకాలము క్రిందట దేవతలు సభచేసి మృత్యుచట్టము తయారుచేసి అది మనుజులు అనుభవించునట్లు యేర్పరచి నన్ను ఆ ఉద్యోగమునకు నియమించిరి.

మ:-ఇది చాల అన్యాయము. చావులేకుండెడి మనుజులకు యిట్టి గొప్ప అన్యాయము చేసినారు. మనుష్యులు సౌఖ్య పడుట వారు సహించలేకపోయిరి. వారిప్పుడధికారములో నున్నారు గనుక వారికి యెదుట మాట్లాడలేము. కాని మిమ్ములను నొకకోరిక కోరుచున్నాను. అది దయచేయుడు. మే మెప్పుడు చనిపోయేది ముందుగా మాకు తెలియపరచిన మేము ప్రయాణమునకు పూర్వము గృహమందలి చిక్కులన్నియు తీర్చుకొనుటకు వీలుండును.

య:-ఇది సులభమైన మార్గమే. ఆ ప్రకారమే చేసెదను. నేను మీకు కబురుచేసిన వెంటనే మీరు తగిన యేర్పాట్లు చేసికొని సిద్ధముగా నుండుము.

(మృత్యుదేవత వెళ్ళును)

మ:-ఆహా! మృత్యువు విషయమై యిదివరలో నెవరును తగిన శ్రద్ధ తీసికొనలేదు. మన ఋషులు మునులు కొంతవరకు తెలియ పరచిరి. కాని దానివిషయమై సరియైన శ్రద్ధ వహించి యుండలేదు. ఇప్పుడు వలలో చిక్కుకున్నాము. కాని నేను అదృష్టవంతుడను. యముడు నా స్నేహితుడు. అతడు ముందుగా నాకు కబురుచేయును. వాని ఉత్తరము వచ్చినప్పుడు నేను నా వ్యవహారము లన్నియు చక్కపెట్టుకొనుటకు వీలుండును. మనుష్యునకుఅమరత్వము పోయినది

## 2 వ రంగము మొదటి ఉత్తరము

మనుజుడు అద్దముముందర కూర్చుని తలదువ్వుట ప్రారంభించును. తలలో తెల్లవెంట్రుకలు కనుపించును, అదిరిపడి ఆలోచనామగ్నుడగును.

(స్నేహితుడు వచ్చును.)

స్నేహితుడు:–స్నేహితుడా ! ఏమి యీ రోజున తలకు కొంత అలంకారము చేయుచున్నావు.

మ:–(కుర్చీవేసి) కూర్చుండుడు. స్నేహితుడా, నన్ను ఎందుకు పరిహాసము చేసెదవు? చూడండి వెంట్రుకలు తెల్లపడు చున్నవి. నేనింక ముసలివాడనగు చున్నాను. ఈ లోకము నుంచి ప్రయాణమునకు సిద్ధముగ నుండవలెను.

స్నే:–ఏమి! మీరు ఆశ్చర్యముగ మాట్లాడుచున్నారు. మీకే మైన పిచ్చిపట్టినదా? కొన్ని వెంట్రుకలు తెల్లపడినంత మాత్రమున ప్రమాదమేమి? ఈ రోజులలో చిన్నవారికే వెంట్రుకలు తెల్లపడుట మీకు తెలియదా! ఇప్పుడు మీకు ఆదుర్దా ఎందులకు? సమయము వచ్చినప్పుడు ఆలోచించవచ్చును.

మ:–మీరేమి చెప్పినను నా రోజులు దగ్గరకు వచ్చుచున్నవని నాకు తోచుచున్నది. నా ఆలోచనలన్నియు మట్టిపాలు కావలసినదే.

స్నే:–(నవ్వుచు) మీరు ఎట్లు మారిపోయినారు! ఈ ఆలోచన విడిచిపెట్టండి. చావుకు ఎందుకు భయపడవలెను? అదిగాక మీకు ముందుగ ఉత్తరము వచ్చునని చెప్పినారు గదా. ఇంతవరకు ఉత్తరమేమియు లేదుగదా, పుష్కల

షముగా తిని త్రాగి నాట్యముచేసి సుఖింపుడు. అనవసర మైన ఆలోచనలతో పనిలేదు.

మ:-అవును. మీరు చెప్పినమాట నిజమే నాకు యింకను వారు ఉత్తరము వ్రాయలేదు. సరే యీ రోజు కార్యక్రమమేది?

స్నే:-కార్యక్రమము మనకెందుకు? సమయమునకు ఏది సందర్భపడితే అది అనుభవించుటయే. (ఈ ప్రకారము మనుజుడు యింద్రియ లోలుడై జబ్బులు బాధలు లెక్క చేయక యుండును. జాగ్రత్తగా నుండుమని ఆదేశము వచ్చినను దానిని లక్ష్యముచేయక వెంట్రుకలకు నల్లరంగు పూసుకొని ఇంద్రియ సుఖములు అనుభవించు చుండును.)

రెండవ ఉత్తరము 3 వ రంగము

(రెండు సంవత్సరముల తరువాత మనుష్యునకు పండ్లూడి పోవును. సరిగా మాట్లాడలేడు అన్నము వగైరాలు సరిగా నమలలేడు)

చిన్న కుమారుడు:-నాన్నా! మీపండ్లు అన్నియు ఊడిపోవు చున్న వే. ఇప్పుడు మీ రేమితి నెదరు.

తండ్రి:-పాలు, హల్వా

కు:-ఆహా హల్వా తినుటకు మీపండ్లు పోగొట్టు కొంటిరా?

తం:-కాదు. అందరకు కొంత వయస్సువచ్చు సరికి పండ్లూడి పోవును హల్వా తినుటకు ఎవరును పండ్లూడ కొట్టుకొనరు

కు:-అట్లైన నా పండ్లు యెందుకు ఊడ లేదు.

తం:-నీవు చిన్నవాడవు గనుక

కు:-మీరు మాత్రము పిల్లవారు కారా?

తం:-నేను ముసలివాడను. మనుజుడు ముసలివాడుగానైనప్పుడు వానిపండ్లు ఊడును.

(భార్య వచ్చును)

తం:-ప్రియురాలా! నాపండ్లు అన్నియు ఊడిపోయినవి. నాచావు దగ్గరకు వచ్చినది.

భార్య:-అటువంటి మాటలు మాట్లాడకండి అట్టి, అపశకునపు మాటలు మాట్లాడ వద్దనిమిమ్ములను ప్రార్థించుచున్నాను. మీరు ఆ ప్రకారము మాట్లాడితే నాకు భయమగుచున్నది. ధైర్యముతో ఉండండి. ఆశను విడువకూడదు. విజ్ఞాన శాస్త్రమువల్ల వయస్సు పరిమితిని గెలువ వచ్చును.

తండ్రి లేక మనుష్యుడు:- ప్రియురాలా! ఈశరీరము ఎప్పుడో నొకప్పుడు శిథిలము కావలసిన దే. ఈశరీరమునమ్ముట భోగపుసానిని నమ్ముకొనుటయే. అడవిలో ఎలుకలు చెట్టుయొక్క వేళ్ళు నేలలోకొరుకగా కొంత కాలమునకు చెట్టు ఎట్లు పడిపోవునో ఆప్రకారము కాలము మనలను తొలిచివేయును. అంత్యకాలము మనకు తెలియకుండగనే వచ్చును. యుద్ధములో నెన్నడును భంగము నొందనియోధులు కొండగుహాలలో దాగియుండువారు అందరు మృత్యుదేవతకు లొంగవలసినదే. మంచి మొగ్గను పాడు చేయునట్లు మేఘములు గాలివల్ల చెదరిపోయినట్లు, మిక్కుటమైనప్రవాహము దాని యొడ్డుననుండు చెట్లుకూల్చికొనిపోవునట్లు ముసలితనమున మృత్యుదేవత మనుజులను నాశనముచేయును. పడుచుతనము పుష్పమువలె త్వరలో

వాడిపోవును. జీవితము గారడివాని గారడివలె భ్రమ సంతోషము సౌఖ్యము నొకనిమేషమాత్రములో అదృశ్య మగును. ప్రియురాలా ! నేనుయిట్టిస్థితి భరింపజాలను

భా:-ఇదంతాబాగుగనున్నది. ఇట్టిపరిస్థితిలో మీరు పెండ్లి ఎందుకుచేసికొని యీ సంసారబాధ కలుగజేసికొన్నారు. మీరు వెంటనే సన్యసించిన ఈ చిక్కులుయేమియునుండక పోవును. ఇప్పుడుమీరు యిట్టిఆలోచనలోనుండుట సరియైనదికాదు. పెండ్లికావలసిన పిల్లలున్నారు. పెద్దపిల్లకు వయస్సువచ్చినది. జనులందరు అనేకవిధములుగా చెప్పుకొనుచున్నారు. ఇంతవరకుదానికి సరియైన సంబంధము కుదిర్చినారుకారు. నా మాటలు వినండి.

మ:- నిజమే నీవు చెప్పిన దంతయు జరగవలసినదే. కాని యీ స్థితి నేను భరింపజాలను. హల్వా పాలు పుచ్చుకొనుటయే. ఏమి తినుటకు నోచుకొన లేదుగదా!

భా:-ఇదియేమీ ఆలోచన. తిరిగి మంచిపళ్ళు కట్టించుకోండి. అవి బాగా యుండును. మీకు కావలసినది తిని అనుభవించవచ్చును.

మను:-మంచిసలహా యిచ్చినావు. నాకు యిది తోచలేదు. నేను డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి పళ్లు కట్టుకొనెదను. (ఆప్రకారము చేయును. తదుపరి అన్నివస్తువులు తినును)

## మూడవ ఉత్తరం 4వ రంగము

వ:- (తరువాత ఇంకొ రెండు సంవత్సరములు గడపవలెను.)
గిరీషు అను స్నేహితుడు వచ్చును.

మ:-రండి, లోపలకురండి.

గిరీషు:-ఏమి! మీరు నన్ను గు ర్తించ లేదా?

మ:-సోదరుడా! నా దృష్టి నుంచగించినది. కళ్ళకు పొరలు వచ్చినవి. ఓ మీరు గిరీశులా! దగ్గర కూర్చుండుడు. స్నేహితుడా చూడుము. నా వెంట్రుకలు నెరసినవి. నా పళ్ళు ఊడిపోయినవి. నా చూపు తగ్గిపోయినది.

గి:-పండిత్ జీ! ఈ ప్రకారము మీ రేల నిరుత్సాహ పడెదరు. సంసార మొక నాటక రంగము. జీవులు వారివారి కర్మలు అనుభవించుటకు పుట్టెదరు. జీవితమున్నంతవరకు యేదో నొక విధముగ గడుపుదుము. మన మెన్న డును నిరుత్సాహ పడకూడదు. శ క్తి 'అంతయు మనలోపలనే నున్నది. మీ దృష్టి మీకు త్వరలో రావచ్చును.

మ:-పోయిన దృష్టి యెటుల వచ్చును. ఆ మార్గమును తెలుపుము.

స్నే:-పండిత్ జ! ఆదుర్దా పడవద్దు. నేను మీకు తగిన సహాయముచేసి నీదృష్టి నీకు వచ్చునట్లు చేసెదను.

మ:- ప్రియమైన స్నేహితుడా, నీకు చాల కృతజ్ఞుడను. నీకు యావజ్జీవము సేవచేసెదను.

గి :- స రే 2 గంటలకు సిద్ధముగా నుండుము. (వెళ్ళిపోవును.)

మ:- (ఒక వీధిలోనుండి వెళ్ళి, కలంకి ఆసుపత్రి యెదుట నుండెను. ఆ ఆసుపత్రిలోనికివెళ్ళి, కండ్లు బాగుచేయించు కొని అద్దములు పెట్టుకొని) చాలబాగున్నది అనుకొనెను.

## నాల్గవ ఉత్తరము 5 వ రంగము

(ఇప్పుడు మనుష్యుడు ఆఖరు దశలో నున్నాడు. పక్షవాతమువల్ల చేతులు కదలుటలేదు అప్పుడు వీధిలో ముసలివాడొకడు పాటపాడగా వినును. (పాటయొక్క సారము) నీవు జీవితము అనుభవింపలేదు. జీవితమే నిన్ను అనుభవించినది. ఆశపోలేదు. నీనుదుటను ముఖమున ముడతలు కానుపించుచున్నవి తలమీద వెంట్రుకలు నెరసినవి నీవు అంత్యకాలమునకు వచ్చినను నీ ఆసక్తులు నిన్ను విడువలేదు. నీ జీవితమంతయు వృధాయైనది. లాభములేదు అంతయునష్టమే కాని ఓ మనుష్యుడా ఇప్పుడైనను పుణ్యక్షేత్రమునకు పొమ్ము.)

మ:- (పిల్లవానిని పిలుచును) అబ్బాయీ! ఆ పాటపాడినది యెవరో కనుగొని వానిని పిలువుము.

(పరివ్రాజకుడు వచ్చును)

పరి:- నన్ను ఎందుకు పిలిచినారు ?

మ:- పూజ్యులైన పావనపురుషుడా ? నీ యొక్క పాట నా చెవిలో పడినది. నా హృదయమునకు అంటినది. నా కండ్లు తెరువబడినవి.

పరి:-మీరు మీ కర్తవ్యము చేయుడు. (అని వెళ్లును. భార్య వచ్చును.)

భార్య:-ఆ మోటు గ్రామస్తుడెవరు ?

మ:-ఆ పవిత్రవంతుని ఆ ప్రకారము నిరసించరాదు. వారు ఆశీర్వదించిరి.

భా:-ఎట్టి మంచి దీవనలు మీకు యిచ్చిరి ?

మ:-మృత్యు దేవతదగ్గరకు వచ్చినది. ఇంక నీ యింద్రియ లోలత్వము విడిచి నీమనస్సు భగవంతునివైపు త్రిప్పుకొనమని చెప్పిరి.

భార్య:-మంచిది. మీ పావనపురుషుడు జ్యోతిష్కుడు కాబోలును. ఈ సాధులు ఊరుఊరు తిరిగి కనుపించు వస్తువులు సంగ్రహించు చుందురు. మీకు యింకను ఒక ఉత్తరమైనను రాలేదుగదా! ఈ పురుషులు సాధారణముగ బాల్యమున చనిపోరు. వారు వారి జీవితములకు అంటుకొని యుండెదరు. త్వరగా చావరు.

(ముసలివాడు ఆ మాటలు విని చెవులు మూసికొనెను.)

భార్య:-మీకు యింతవరకు ఉత్తరము రాలేదుకదా! ఇక ముందు పిల్లలను మీరు యేమిచేయదలచుకొంటిరి. ప్రతి వారిని యీప్రకారము బాధ పెట్టుచున్నారు. మీరు వెళ్ళితే నాగతి యేమికావలెను. నేను మెడకు రాయి కట్టుకొని యేనదిలోనో దూకవలసినదే. (అని వెళ్ళును.)

మ:-(తిరిగి మాయలోపడి) నీవు అటుల ఏడ్వవద్దు. నే నెక్కడకు వెళ్ళుటలేదు.

(దగ్గు తిరిగి వచ్చును.)

6 వ రంగ ము

(మనుష్యునకు ఉదయం దగ్గు ఎక్కువగును. యముడు పాశముతో వచ్చును.)

మ:-(వణుకుచు) మీరు మీ మాటప్రకారము నడచుకొనలేదు. మీరు రాకపూర్వము నాకు ఉత్తరము వ్రాయుచు

మని చెప్పిరి. ఆ ప్రకారము చేసినారు కారు ఈ ప్రకారము మీా భయంకరరూపము చూపుచున్నారు. మీాలు మీా స్నేహితుని యీా ప్రకారము మోసపుచ్చుటకు మీాకు సిగ్గు లేదా?

య:-ఓ మనుజుడా! నీవు ఘోరపాపివి. జీవితమంతయు ఇంద్రియలోలు పత్యములో గడిపితివి. దుర్మార్గపు విషయ సౌఖ్యములలో మునిగి యుంటివి ధర్మము న్యాయము ఆక్షేపించు మన్నావు. ఇంద్రియ సౌఖ్యములలో మునిగి యున్న నీకు ఉత్తరముల స్పృహ యెట్లుండును. నేను నాల్గు ఉత్తరములు వ్రాసితిని. దౌర్జన్యతవల్ల వాటిని నిర్లక్ష్యము చేసితివి. ఈ రోజున నన్ను అమర్యాద చేయ బూనితివి.

మ:-నాల్గు ఉత్తరములా! అవి నాకు రాలేదు. పోస్టుజవాను వాటిని యేమిచేసెనో నాకు తెలియదు. కనుగొనవలెను.

య:-(నవ్వుచు) ఓ బుద్ధిహీనుడా! నీకు రేపువరకు అవకాశము లేదు. నేను శిరా కలము తీసికొని నీకు ఉత్తరములు వ్రాసితి ననుకొంటివా! వినుము. కాలమే నా దూత. అతడే నీకు ఉత్తరములు తెచ్చెను. అవి నీవు లక్ష్యము చేయలేదు. నీశరీరమునే నమ్మియుంటివి.

మ:-నాకు నిజముగ ఉత్తరములు వచ్చినవా? నేను అవి పెట్టెలో పారవేసితినా?

య:-నీశరీరమే ఉత్తరముల పెట్టె. అవి అపవిత్రమైన కోరికలతో నిండియుండును. కొన్ని సంవత్సరముల క్రిందట నీ వెంట్రుకలు నెరిసినవి. అదియే నా మొదటి ఉత్తరము.

నా హెచ్చరిక (Warning). వెంట్రుకలకు రంగువేసికొని దిరిగితివి. తరువాత రెండవ ఉత్తరము నీ పళ్లు ఊడిపోవుట. అదియును నీవు లెక్కచేయక కృత్రిమపు పంక్తి పెట్టించు కొంటివి. అప్పటికిని నిన్ను క్షమించి మూడవ ఉత్తరము పంపితిని. నీకండ్లదృష్టి పోగొట్టబడెను. నీవు గర్వమువల్ల స్నేహితుల సహాయము తీసికొని కండ్లజోడు తగిలించుకొని మామూలు యింద్రియసుఖములు అనుభవించు చుంటివి. తరువాత నొక సన్యాసిని పంపి నీకర్తవ్యము తెలియపరచి తిని. అప్పుడైనను తెలివి తెచ్చుకొనక యథాప్రకారము నడిచితివి. నేను యిప్పుడు నిన్ను నిందించుటకు రాలేదు. నీ జీవితము సమాప్తి అగుటవలన నిన్ను తీసికొని వెళ్లుటకు వచ్చినాను.

మ:-నేను తప్పుచేసినాను. నన్ను క్షమించండి. నేను యింకొక సారి మీాదయ కోరుచున్నాను,

య:-ఆప్రకారము వేచియుండుటకు వీలులేదు. అనేక సంవత్సరములనుండి ఓపికపట్టినది చాలును. నేను నీకు యిచ్చిన అవకాశము ఉపయోగించు కొనక త్రాగుడు మొదలగు దుర్వ్యసనములలో మునిగి జీవితము పాడుచేసి కొంటివి. ఇప్పుడు యింకను కాలము కోరుచున్నావు. ఎందులకు?

మ:- ఓ స్నేహితుడా! మన పూర్వస్నేహము జ్ఞప్తి యందుంచుకొని నాకు కొంత సావకాశమిమ్ము.

య:- ఆ స్నేహము పూర్వకాలము నాటిది. నే నిప్పుడు నీ స్నేహితునిగా యిచ్చటకు రాలేదు. నేను స్థిరమైనచట్టము అమలులో పెట్టుచున్నాను. న్యాయమనునది ప్రేమకు

స్నేహమునకు అతీతమైనది. చట్టమే న్యాయము. బహు మతులు లంచములు తీసికొని కర్తవ్యము తప్పించు మను జునివలె వ్యవహరించువాడను కాను. నా ఆజ్ఞకు అందరు లోబడవలసినదే. అందుకు తిరుగు లేదు. (పాశము వేయును మనుష్యునకు ఊపిరి సలపక యుండును) ఈ శరీరమందు ఆశవదలి భగవంతుని ప్రార్థించుము. (మనుజుడు భార్య పిల్లలను ఆఖరుసారి పలుకరించుటకు ప్రయత్నించెను గాని నోటినుండి మాటలు రాలేదు (మనుజుడు చనిపోయెను) భార్య తేనీరు తెచ్చి భర్తనుచూచి ఆ పాత్ర క్రింద పార వైచి భర్త కళేబరము కౌగలించుకొని నేడ్వ ప్రారంభించెను.

భార్య:- ఓ భగవానుడా నా భర్త చనిపోయినారా!

(తెర పడును)



# VII వైరాగ్యము - సరస్వతి-లక్ష్మి

(ఒక ఆశ్రమములో అనేకమంది సాధువులుందురు. వారందరు కాషాయరంగు బట్టలు ధరించి యుందురు. వారియొక్క స్థితిగతులు చూడగా మంచి ఐశ్వర్యముతో తులతూగుచు ప్రపంచ వ్యవహారములలో పాల్గొను చున్నట్టు కనుపించు చుండెను. బయట నొక చిన్నగదిలో నొక ముసలి సన్యాసి కూర్చుండును వానియొక్క శరీరము శుష్కించి యున్నను బ్రహ్మ వర్చస్సుతో కూడియుండెను. వీనియందు ధనసంపదలతో సంబంధించిన సూచన లేమియు కనుపించవు. ఆగదియందు సరస్వతి పటము మాత్ర మున్నది. సన్యాసి ధ్యానమగ్నుడై యుండెను. లక్ష్మి విలువగల దుస్తులు ఆభరణములు ధరించి సదాశివుడను పేరుగల ఆ ముసలి సన్యాసియున్న గదియొద్దకు వచ్చును.)

లక్ష్మి:-(కోపముతో సన్యాసిని సరస్వతి పటమును చూచును) సరస్వతీ! అప్పుడు సరస్వతి పటములోనుండి వచ్చును. ఆమె తెల్లబట్టలు ధరించి చేతిలో వీణపుచ్చుకుని నిర్మల మైన శాంతస్వభావముతో కనుపించును )

సర:-(అణకువతో) ఏమమ్మా !

ల:-నీ పద్ధతి నాకెంతమాత్రము నచ్చుటలేదు. సదాశివుని చూడుము. అతనికి ఎముకలు చర్మముతప్ప యేమియు లేవు. శరీరమెట్లు శిథిలమైయున్నదో చూడు. వానిని పాటలు పాడుటకు ప్రోత్సహింతువుగాని వానిని సరిగా చూచు చుండుటలేదు. ఎంతబుద్ధి హీనురాలవు!

స:-అమ్మా నేను—

ల:-నోరుమూయుము. అతడు మొదట యిక్కడకు వచ్చి నప్పు డేస్థితిలో నుండెనో నీకు జ్ఞాపకమున్నదా? చేతిలో

నొక్క పైసాయైనను లేదు. తినుటకు తిండి లేదు. చింకి గుడ్డలతో నుండెను. ఒకపూరింట్లోనుండెను. నీ యొక్క భక్తులను యీ ప్రకారము చూచెదవా ?- ఇప్పుడు చూడు ఒక గొప్ప ఆశ్రమము. నిజముగా అది స్వర్గమే.అందు వీని శిష్యులు ఎట్లు పంచ భక్ష్య పరమాన్నములతో విందులు ఆరగించుచు అన్ని సౌఖ్యములతో ఆరోగ్యముగా నున్నారో చూడుము. నా కుమారుడు నీ భర్తయగు బ్రహ్మకూడ యిటులనే యున్నాడు. అతడు సృష్టిచేయునుగాని అతని సృష్టి అంతయు నా భర్తయే పోషించవలెను. ఆహా మీరెట్టి దంపతులు ! (అని హేళనగా నవ్వును)

సర:- నా భక్తుల విషయమై నాకు గలిగిన కటాక్షము నీవు ఏమి గ్రహించినావు? ఈ సదాశివుడు నా యొక్క కటాక్షము వల్ల అన్ని విద్యలు నేర్చుకొని ప్రపంచ మంతటిలో వన్నెకెక్కిన గొప్పకవి అయ్యెను. వానిని వరకవియని పిలిచెదరు. ఒక రెప్పపాటులో కవిత్వము చెప్పగలడు. నీ ధనము వాని కెందుకు ? (హేళనగా) నీ యొక్క మాయలో ఆయన పడువాడు కాడు. (శాంతముతో) అతడు నీయొక్క ప్రలోభములు లెక్కచేయడు. ఎందువల్లననగా అవి బుద్బుద ప్రాయములు. శాశ్వతముగా నుండినను నా యొక్క ఆశీర్వచనములకు లోబడియుండును. చూడుడు అతడు కాలమంతయు నారూపమందే లగ్నమై ఎట్లు ధ్యానమగ్నుడై యున్నాడో.

లక్ష్మి : మంచిది. నా సహాయము లేనిది అతడు చలించలేడు

సర:-అది కాదు నా సహాయము లేనిదిఅతడు చలించడు. అట్టి యోగపురుషునకు నేనే ప్రాణము. ఎందువల్ల ననగా నేను

వానికి పూర్ణమైన జ్ఞానమిచ్చెదను. మరియు ఓ అత్తగారూ ! నేనున్న చోట నీవు నా భక్తులను అనేక ప్రలోభములతో వారి తల తిరుగునట్లు చేయుచున్నను వారి పరిస్థితులు మార్పజాలవు. నేను నాభక్తులను వారి జీవితమునకు ఎంత కావలయునో అంతమాత్రమే నీవల్ల పొందమని ప్రోత్స హించుటచేత శరీరధారణకు అవసరమగు వస్తువులే నీవద్ద నుండి పొంది నిన్ను నిరశించెదరు.

ల:-(కోపముతో) ఏమి నన్ను గురించి యింత నిర్లక్ష్యమా !

స:-(కోపముతో) అవును నిజమే. నీవు నిజము మార్పజాలవు.

ల:-కాని సదాశివుడు ——

స:-(నెమ్మదిగా) నీకెట్లు తెలియును. మానసికముగ నీప్రలోభ ములకు అతడు లోబడుటలేదు. మరియు యీ ప్రకారము వానిని బాధపెట్టుచుండిన అతడు యిచ్చటనుండి లేచి వెళ్ళిపోవుటకు కూడ నూహించుచున్నాడు.

ల:-ఆహా ! (అని నవ్వి) నీవు ఒక కథ చెప్పుచున్నావే !

స:-కథకాదు. రుజువుపర్చెదను. (సదాశివునివంక చూచును. అతడు ధ్యానమునుండి చలించినవాడై కనులు తెరచి లేచును.) ఇప్పుడు వానిని ప్రశ్నించెదము. (వానివద్దకు యిద్దరును వెళ్ళుదురు.)

లక్ష్మి:-సదాశివా !

సదా:-(ప్రణామము చేయుచు) ఏమి తల్లీ, మీరు మాతల్లితో పోరాడుచుండిరి. ఇది ప్రపంచమందు స్వభావసిద్ధమే. కాని మీ ప్రస్తుతపు తగు వెట్టిది ?

లక్ష్మి:-నీవిషయమే -

సదా:-(ఆశ్చర్యముతో) నావిషయమా !

ల:-అవును. ఆమెతో నిన్ను ఎట్టిస్థితికి తెచ్చినదో ముచ్చటించు చున్నాను. మొదట యిచ్చటకు వచ్చినప్పుడు నీకు యెన్ని విధముల సౌఖ్యములు గలుగజేసితినో ఆలోచించుకొనుము. (నిర్లక్ష్యభావముతో) నిర్భాగ్యురాలైన నా కోడలుకన్న నేను గొప్పదానను కానా? కాని ఆమె నా ఆజ్ఞ నిరసించి నన్ను నిందించుచున్నది. నీకు నేను అక్కర లేదని చెప్పు చున్నది.

సదా:-(ఆలోచనాభావముతో) అవును ఆమె సరిగా చెప్పినది.

లక్ష్మి:-(ఆశ్చర్యముతో) ఏమి! ఆమె సరిగా చెప్పినదా.

సదా:-నమ్రతతో ఆమె చెప్పినది నిజమని చెప్పుచున్నాను. నిన్ను రమ్మని నేను పిలచితినా?

ల:- లేదు పిలువలేదు.

సదా:-అవును నీ అంతట నీవు వచ్చి ఆశ్రమము కట్టించి సదుపాయములన్నియు చేసినావు శిష్యులు వృద్ధియైనారు. వారిలో వారు సౌఖ్యములకు పోరాడుకొనుట ప్రారంభించినారు. నాకు అది అంతయు రుచించలేదు. నేను నాకు పూర్వము మందుండిన గుడియందే నివసించుటకు వచ్చుకొనియుంటిని. నన్ను యిప్పుడు నిర్మలముగ నుండనిండు.

లక్ష్మి:-(ఆశ్చర్యముతో) కాని!

సదా:-'కాని'కి యిచ్చట అవకాశము లేదు. మిమ్ములను కోరుటగాని మీవంక చూచుటగాని నేను ఇంతవరకు చేసి యుండలేదు. మిమ్ములను నేను లెక్కచేయలేదు. మీరు వెళ్ళవచ్చును లేదా మీరు యిచ్చట నుండవలెనని కోరిక గలిగిన ఉండుడు. నేనును సరస్వతియును యిక్కడ

నుండి యింకొక చోటికి పోయెదను. మీరు సన్యాసులకు విషమువంటివారు. వారిని మలినపరచి వారిని అధోగతి పాలు చేయుదురు. (బిగ్గరగా) వెళ్లుము. మిమ్ములను బ్రతి మాలు కొనెదను.

లక్ష్మి :- (విచారముతో తలుపువద్దకువెళ్ళి) వెళ్లెదను.

సదా:- మంచిది. (హేళనగా) నీ కోడలు లేనిచోట్లనే నీవు నివసింపుము నీవు నివసించుచోట్లు ఎట్టివనగా జూదపు శాలలు, సారా దుకాణాలు, క్లాకు మార్కెట్లు ఒకరి నొకరు మోసము చేసికొను చోట్లు. నీకు పావనపురుషులు, సన్యాసులు, ఋషులు, పండితులతో ప్రసక్తి లేదు.

సర:- (ఇంతవరకు వాని సంభాషణ శ్రద్ధగా వింటూ) సదాశివా నా మాట ఏమిటి ?

సదా:-(ఆమెకు సాష్టాంగ వందనముచేసి) తల్లీ నిన్ను పూజించెదను. చదువు లేని వానికి భాగ్యమెందుకు. విద్వాంసుడు అన్ని చోట్లను పూజింపబడును. పాండిత్యము లేని భాగ్యవంతుడు నడుచుచున్న పీనుగతో సమానము.

లక్ష్మి:- (ప్రార్థనా పూర్వకముగా) అయితే నీ వెట్లు జీవించెదవు ?

సదా:-నేను బీదవాని వలెనే జీవించెదను. రామాయణము రచించిన దక్షిణదేశపు అరవ కవికుటుంబము ఎఱుగవా ? పశ్చిమ దేశవాసులగు కవులలో గోల్డుస్మిత్, వాల్టర్ స్కాట్ లను ఎఱుగవా ? వారు చాల బీదవారు కారా ? వారిపేర్లు ప్రపంచమంతటను ప్రఖ్యాతి చెందలేదా ? శ్రీ శంకరాచార్యుల వారు చెప్పిన దేసున మొుల కొక

తుండుగుడ్డ మాత్రము కట్టుకొని యున్నవాడే ప్రపంచ మందు అందరిలోను సౌఖ్యవంతుడు, భాగ్యవంతుడు, అదృష్టవంతుడు. సరస్వతి మాకుకటాక్షించు ఆధ్యాత్మిక ధనము తరగనిది–ఏ బందిపోటు దొంగయు దానిని తీసికొన జాలడు. అట్టివాడెన్నడును దివాలా తీయడు విద్యయను నది ఎప్పుడును వానివద్ద తరగదు. సమృద్ధిగా నుండును. అది అమరత్వము గలుగజేయును. మీకు ప్రణామములు దయచేయుడు. (నమస్కరించును.) అయాచితముగ మీరు వచ్చి నన్ను కటాక్షించినందుకు మీకు ధన్యవాదములు. (అప్పుడు లక్ష్మి తాను ఓడిపోయినట్లు సరస్వతివంక చూచును.)

సర:–(లక్ష్మీవైపుకు తిరిగి ఆమెతో) తల్లీ! మీరు యీ విషయమై ఆదుర్దా పడవద్దు. ఇదివరలొ తమతోనుండు వారిపేర్లు చెప్పియున్నాను. తిరిగి యిప్పుడు చెప్పుచున్నాను మనము ఒక్కచోట నెన్నడును నివసించలేము. నేను నివసించుచోట నీకు విలువలేదు. నీవు వచ్చి నాభక్తులను లోబర్చుకొనిన నేను అక్కడనుండి తక్షణం వెళ్ళిపోదును. మన మన శక్తులలో మనకు పూర్తి అధికారము గలదు. నీకటాక్షము గలిగిన మనుజులకు వారు ధర్మాత్ములుగాను నిరాడంబరులుగాను, నిజాయితీగాను నుండునట్లు వారికి బోధించుము అప్పుడు వారు నాకటాక్షమునకు కూడ పాత్రులగుదురు. అట్టివారియందు మన మిద్దరము కలిసి యుండవచ్చును. ప్రస్తుతము శెలవు.

(లక్ష్మి నిష్క్రమించును.)

# VIII గురుతత్వము

## మొదటి రంగము

గంగానది ఒడ్డున - నలుగురు ముముక్షువులు ప్రపంచ విరక్తిగలిగి ఒక సమయమందున కలసికొనిరి అందులో ఒకడు బుద్ధకుమారుడు. ఇతడు గొప్ప కుటుంబములోపుట్టినను పూర్వ ఆధ్యాత్మ సంస్కృతివలనబాల్యముననే విరక్తికలిగి సద్గురువగు సేవానందునివద్ద శిష్యుడుగా చేరెను.

(బుద్ధకుమారుడును వానితో రామనాధం, క్రిష్ణస్వామి రామగుప్తా అనువారు ప్రవేశము)

సాధు బుద్ధకుమార్:-(స్నేహితులతో) మీకు కలుగు సందేహములు అనేకమంది సాధువులకు యీ రోజులలో గల్గు సందేహములే. అవి అన్నియు మహాత్ముల పాదసేవచేసిన వారు తీర్చెదరు. ఓం నమోనారాయణ (అని అతడు వెళ్ళిపోవును.)

(స్వత సిద్ధానంద ప్రవేశము-ముగ్గురును వాని కాళ్ళకు నమస్కరింతురు)

ఆనంద:-ఓం ఓం ఓం మంచిది నా ప్రియమైన స్నేహితులారా, మీరు యిచ్చటికి యెందుకు వచ్చినారు?

రామ:-స్వామిజీ, మాకు ప్రపంచ జీవితమందు అయిష్టత గలిగినది, వైరాగ్యమార్గము అవలంభింప దలచుకొన్నాము. మేము గురువుకొరకు వెదకుచున్నాము.

ఆనంద:-నీముఖవర్చస్సు చూడగా నీవు సూక్ష్మబుద్ధిగలవాడవుగా కనుపించు చున్నావు. ఓ స్నేహితుడా! మనుష్యుడు

వానికివాడేగురువు. నీలోపలనే అఖండచైతన్యమున్నది. దానినిగురించి నిరంతరము మననచేయుము. గురువుల కొరకు పరుగెత్తకుము. స్వతంత్రత వహింపుము. తర్కము, ఆత్మశక్తి యీరెంటి సహాయముతో అమరత్వము పొందుము.

రామ:-స్వామిజీ! మీబోధ నాకు బాగానచ్చినది. నేనుమీకు శిష్యుడు నయ్యెదను. మీ సేవ చేసెదను. (అని మిగతా యిద్దరు స్నేహితులవంక చూచెను. వారలు ఒప్పుకొని నట్లుగా సూచించిరి.)

ఆనం:-నీవుమంచి నిశ్చయమునకు వచ్చినావు. నేనునిన్ను యీదృశ్య ప్రపంచము అను సముద్రము యొక్క అవతలి ఒడ్డుకుచేర్చెదను. (అని తనకమండలము అతనిచేతికిచ్చెను. రామనాథం వానితో వెళ్ళును)

రామగుప్తా:-ఎవరికిని శిష్యుడుగా వుండవద్దనిచెప్పి వానిని తన శిష్యుడుగా తీసికొనెను. చాలాఆశ్చర్యముగా వున్నది.

క్రిష్ణ:-వానియందునాకు నమ్మకంలేదు.

రామగుప్తా:-మనకర్తవ్యము విషయమైమనకు కలవరము గలిగి నప్పుడు అనేక సందర్భములు కనుపించును. మనసూక్ష్మ బుద్దియే మనకు మార్గదర్శిగా తీసుకొనేయడల అర్జునుడు యుద్ధరంగముచుండి పారిపోవలసినదే. మహాభారత కథ యింకొకవిధముగా వ్రాయవలసివచ్చును. ఓహో! ఆ తప స్వినిచూడుడు. ఆశ్చర్యముగా నున్నది. అతడు తప్పక గొప్పయోగి కావచ్చును. (యోగిసిద్ధిప్రకాస్ పరమహంస వచ్చును) యిద్దరువాని కాళ్లకు మ్రొక్కుదురు.

సిద్ధప్రకాస్.-ఓంశక్తి,ఓంశక్తి, స్నేతులారా! మీమీయుద్దేశము తెలిసికొంటిని. మీ మనస్సు దేవాలయమువలె నాకు కనుపించుచున్నది. నాతోరండి మిమ్ములను గొప్ప యోగులను చేసెదను. నేను నాస్పర్శవల్ల మీకు సమాధి కలుగజేయగలను. కొన్నిక్రియలు మీరు అభ్యసించిన కొన్ని గొప్ప సిద్ధులు మీకు కలుగును.

కృష్ణ:- మీ దివ్యస్వరూపముయెదుట నేను మాట్లాడలేక యున్నాను. మీరుచెప్పుమాటలు నిజామేనా. నేను కూడ యోగినికాగలనా?

సిద్ధప్రకాస్:-సందేహమేల ? ఓంశక్తి, నేను యీ యోగము గొప్పమహారాజులకు జమీందారులకు నేర్పితిని. నాశిష్యులు గొప్ప గవర్నమెంటు ఉద్యోగస్తులు. ఆలస్యము చేయకుము. కాలము చాలా విలువ.

కృష్ణస్వామి:-(రామగుప్తతో) మనము వారితో వెళ్ళుదమా ?

రామగుప్త:-నేను కొంతకాలము గంగానది యొడ్డున వంటరిగా నుండకోరెదను.

సిద్ధిప్రకాస్:-మంచిది. వానిని అక్కడ నుండనిమ్ము. అతను తరువాత మనలను కలుసుకొనును. (రామునితో) చూడు అక్కడ పెద్ద భవనము కనుపించుచున్నది. అది నాదే. నీవు వచ్చినయెడల లోపలికి నిన్ను రానివ్వమని అక్కడ నుండు నా బంట్రోతులతో చెప్పెదను. (కృష్ణస్వామి సిద్ధిప్రకాస్‌తో వెళ్ళును.)

రామగుప్తా:-(స్వగతము) కాదు కాదు. సిద్ధులు స్వల్పలాభులు. నాకు బంగళాలు, నవుకర్లు కావలసినయెడల నేను

ప్రపంచము విడిచిపెట్టకనే యుండెడివాడను. నేను మోటారుకార్లు, నవుకర్లతో గొప్ప డాక్టరుపని చేయుచుండెడివాడను. యోగసాధనలకుగాని, జబ్బులు కుదుర్చుశక్తులకుగాని వీనితో నెళ్ళుట అనవసరము ఇంతకంటె అమానుషప్రక్రియలు శక్తివిద్యవల్ల చేయవచ్చును. ప్రపంచము త్యజించుట ఎందులకు? నేను అమెరికానెళ్ళిన మొదడు, శస్త్రవైద్యము, ప్లాస్టిక్సువైద్యము నేర్చుకొనగలను. నేను ప్రపంచము విడుచుటలో నా యుద్దేశము ఉపనిషత్తు మొదలగు పవిత్ర గ్రంధములలోనుండు జ్ఞానము గ్రహించుకొనుటకై యున్నది.

(సేవానందుడు బుద్ధకుమారునితో ప్రవేశము)

**సేవానంద:**-(రామగుప్త వాని సామానుతో గంగానది ఒడ్డున కూర్చుండుట చూచి) ఓం నమోనారాయణ, ప్రియమైన ఆత్మస్వరూపా! చాలా ప్రొద్దుపోయినది. మీరు యీ ప్రాంతములకు క్రొత్తవారుగా కనుపించుచున్నారు. ఇక్కడ చాలా చలిగా నుండును. మరియు మీరు యింకను భోజనము చేసినట్లు కనుపించదు. నేను మీకు సేవచేయుటకు దయయుంచి యొప్పుకొనెదరా. మీరు యీ రాత్రి నా కుటీరములో గడుపవచ్చును. నాకున్న దానిలో మీకు కూడ వాడ్కొనవచ్చును.

**రామగుప్త:**-(ఆశ్చర్యముతో స్వగతముగా) ఎట్టి ప్రకాశమైన రూపము. యెంత అణకువ. నేను వారి పాదములు పట్టుకొనుటకు కుతూహలముగానున్నది. వాని (కాళ్ళముల పైబడి)గురు దేవా! నన్ను మీ శిష్యునిగా గైకొనుము. మీరు దైవస్వరూపులని నాకు తెలిసినది.

శివశంకర్.-(రామునికి ప్రణామము చేయుచు) మహాత్మా! నేను అనామకుడను. భగవంతునియొక్క సేవకుడు పరిచారకు డను. నేను మీకు చెప్పుకొనను. మహాపురుషా సన్నుతిచునే. మీరు ప్రపంచము విడిచి వైరాగ్యమార్గము అవలంభించ కోరుచున్నట్లు నాకు తోచుచున్నది. కాని. మీవంటి మహా త్ములయొక్క సత్సంగము కలుగును. సత్సంగము, ధ్యానము, సంకీర్తన, జపములవల్ల మీరు త్వరలో సిద్ధిచెందగలరు బుద్ధికుమార్! వారి బిచానా (పరుపు పక్కా) పుచ్చు కొనుము. నేను వారి సూట్ కేసు (పెట్టె) తీసికొనెదను. (రామునితో) రండి వెళ్ళుదము. ఈ కుఱ్ఱవానిని చూడండి. ఇతనుకూడ ప్రపంచమందు విరక్తి గలిగి వచ్చినాడు. ఇతడొక గొప్ప జమీందారుని కుమారుడు. బాగా చదువు కున్నవాడు. వానికి మంచి దైవిక గుణములు గలవు. అత డొక ఆభరణము వంటివాడు. మీరును అట్టివారే. భగ వంతుడు మిమ్ములను కటాక్షించి వాని పాదపద్మములకు చేర్చుకొనును.

2 వ రంగము – దృశ్యము మొదటిసీను

(ఒక అడవిలో నొక నిర్మానుష్యమైన మార్గము ఒక ముసలివాడు వాని భార్య మెల్లగా నడచి పోవుచుందురు.)

ముసలివాడు.-(ఆయాసముతో) నేనింక నడువలేను. తలతిరుగు చున్నది. (అనిపడిపోవును.)

స్త్రీ:-(బిగ్గరగా ఏడ్చును) ఓ భగవంతుడా! నేనేమి చేయను. ఓ భగవంతుడా! రక్షింపుము. ఆహా! అక్కడ నొక భవనము కనుపించుచున్నది. అక్కడకు వెళ్ళి వైద్య సహా

యము యేమైనా దొరుకునేమో చూచెదను (తాను తెచ్చిన వస్తువులను అక్కడ పారవైచి పరుగెత్తెను.)

(రామనాథం వచ్చును)

రామనాథం:-ఇదియేమి! (నీరునీరు అని ముసలివాడు యేడ్చు చుండును.) ఈ ముసలివాడు యెందుకు తీర్థయాత్రకు బయలుదేరవలెను.

ముసలివాడు:-దయచేసి నీరు యివ్వండి.

రా:-ఓ ముసలివాడా! ప్రతిమనుజునకు వానియొక్క మార్గదర్శి వాడే. ప్రతివాడు స్వతంత్రుడు. నీరు యివ్వమని నన్ను అడుగుటకు నీవు యెవరు? నేను నీకు నవుకరునుకాను. (ముసలివాడు యేడ్చుచు మూర్ఛపోవును. స్వగతముగా) ప్రతివాడు వానికర్మ వాడు అనుభవించవలసినదే. బాధ, సంతోషము అనునవి భ్రమరూపములు. నాకున్న ఆత్మ, శక్తి, వివేకము వీనికిలేదు. ఉన్నయెడల యీప్రకారము బాధపడడు. ఈ ముసలివానికి డబ్బు యెందుకు? ఇతడు యేనిమిషమో చనిపోవును. నాకు సొమ్ము అవుసరము. (అని వాని సొమ్మునంచి తీసికొనును.) అందరిలో నుండునది నాకే ఆత్మ. నేనేవాడు. ఒకవస్తువు అవసరమున్న చోటనే ఆవస్తువుండవలెను నీవు యిప్పుడు యిక్కడ చనిపోయినను యీకాలమున జీవించియుండి సొమ్ము అవసరమగు ఒక వ్యక్తికి ఉపయోగపడుచున్నదని అనుకొనుము. (వెళ్ళును.)

(స్త్రీ, డాక్టరుతో ప్రవేశము)

డా:-(ముసలివాని నాడి పరీక్షచేసి) ఇది అతిమూత్రమువలన వచ్చిన జబ్బు కోమా అందురు. నేను యింజక్షను యిచ్చె-

దను. ఇతడు ఒక అరగంటలో బాగుపడును. నా ఫీజు, 5 రూపాయిలు ఇంజక్షనుకు, 10 రూపాయిలు యిక్కడకు వచ్చినందుకు. ఇంజక్షను యివ్వనా?

స్త్రీ:-(ఏడుస్తూ) ఇవ్వండి డాక్టరుగారూ.

డా:-డబ్బు ఏది? (స్త్రీ భర్తజేబు తడవి చూచును. సొమ్ము కనుపించదు.)

స్త్రీ:-అయ్యా! సొమ్ముకూడ పోయినది.

డా:-అయితే మీవద్ద సొమ్ము లేదు. (వెళ్ళిపోవును.)

స్త్రీ:- ఇంజక్షను యివ్వండి. కొంతసొమ్ము నా వద్ద ఉన్నది. (15 రూపాయిలు తీసియిచ్చును.) (డాక్టరు యింజక్షను యిచ్చును.)

డా :- అరగంటలో నితడు స్వస్థత చెందును. సరిగా లేని యెడల తిరిగి నా వద్దకురమ్ము. నేను మందు చెప్పెదను.

(అని వెళ్ళి పోవును.)

(కృష్ణస్వామి వచ్చును.)

కృ :- చెల్లెలా! మీ రెందుకు నేడ్చుచున్నారు? మీ భర్త గారికి యేమి జరిగినది?

స్త్రీ :- వీరు స్పృహ తప్పి పడిపోయినారు. డాక్టరుగారు యింజక్షను యిచ్చినారు. నేను యేమి చేయవలెనో నాకు తోచుటలేదు. మాది దక్షిణాది నెల్లూరు ప్రాంతము.

కృష్ణ:-(ఇటు అటు చూచి ఆడమనిషి వంకజూచి) భయపడకండి. నావద్దయోగశక్తి ఉన్నది. నేనెవరి జబ్బైననుకుదర్చ గలను. (ఆడమనిషి ముఖముపై పౌడరు చల్లును) ఆమె

స్మృహతప్పి పడిపోవును. (తనలోతాను) ఈ ముసలవానికి నేను తెలివి తెప్పించిన డాక్టరుమందు పని చేసినదని ఊహించెదరు. మూఢుకాళ్ళ ముదసరి చనిపోవును. ఈస్త్రీ విధవకాగలదు. ఆమె నగలు యిప్పుడే సంగ్రహించెదను. (నగలు తీయును) నేను వెళ్ళెదను. మంత్రము 10 నిముషములు పనిచేయును. ఈలోపుగా నేను కుటీరము చేర వచ్చును. (వెళ్ళును)

స్త్రీ:- (తెలివివచ్చి) ఇదేమి! నాఆభరణములు దొంగిలించినాడే, ఎట్టి దురదృష్టము. ఓభగవానుడా! నన్ను యీ ప్రకారము బాధపెట్టి తిప్పలుపెట్టు చున్నావు. నీకు యింత క్రూరత్వమెందులకు, ఇప్పుడు వచ్చిన సాధువేమయ్యెను. అతడొక గారడివాడు దారిదోపు దొంగయై యుండును.

(రామగుప్త వచ్చును)

రా:-అమ్మా మీకు ఏమి జరిగినది. మీరు జబ్బుగానున్నారా? మీకు నేనేమి సేవచేయగలను.

స్త్రీ:-నా భర్త జబ్బుగా నున్నారు. యోగివేషముతో నొక దుర్మార్గుడు వచ్చి నాముఖముపై కొంత బూడిదచల్లినాడు. నాకు స్మృహతప్పినది. నా నగలన్నియు దొంగిలించి పారిపోయినాడు. నాసొమ్ము,నగలుకూడ పోయినవి. నా భర్తను కూడ కోలుపోవుటకు సిద్ధముగా నున్నాను. ఆ యింటిలోనున్న డాక్టరు వచ్చి యింజక్షను యిచ్చినాడు. ఒక అర గంటలో నెమ్మదించకపోతే తిరిగి తనవద్దకు రమ్మనమని చెప్పినారు. డబ్బులేనందున అతడు మందుయివ్వడు. నా వద్ద సొమ్మేమియు లేదు, ఓ భగవంతుడా యిట్టి యిబ్బందిలో నన్నెవరు రక్షించెదరు?

రా:-అమ్మా ఊరడిల్లుము. భగవంతుడు నీకు తప్పక సహాయము చేయును. అతడు దయాళుడు. పాపము (అని ముసలివాని పాదములు నెమ్మదిగ నొక్కుచుండును) ఓహో బుద్ధకుమార మహారాజా, దయచేయుడు. భగవంతుని దూతవలె వచ్చినారు (బుద్ధకుమారుడు వచ్చును.)

బుద్ధకుమార్.-ఆహా! ఇదేమిటి. నా కమండలములో కొద్దినీరు యున్నది.(కూర్చుని)మృత్యుంజయ మంత్రము జపించును.) 'ఓం త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం ఊర్వారుకమివ బంధనాత్ మృత్యోర్ముక్షీయ మామృతాత్॥'. అమ్మా మీరుకూడ యీమంత్రము జపించండి. (అందరు జపింతురు) 'గురుమహారాజుకు జై. పరబ్రహ్మకు జై. సేవానంద సద్గురువునకును జై. గురుదేవుని దయవలన నీ భర్తకు ఆరోగ్యము కలుగును. మీరు విచారపడవలదు. భగవంతుని నామము స్మరణచేయుడు. గురుదేవుడు మీకు తెల్పిన దేమన మీరు, భగవంతుని పాదములే మనము పట్టుచున్నామని అనుకొనుము. గురుకృప మనకు గలుగును. (ముసలివాడు మూర్ఛనుండి లేచును)

(సాధువులందరు సద్గురుమహారాజుకు జై అని ధ్వనిచేసిరి. స్త్రీ ఆనందభాష్పితురాలయ్యెను.)

బు॥కు:-భగవాన్! మీకు యిప్పుడు ఖులాసాగా ఉన్నదా? ఇది అంతయు మా గురుదేవుని కటాక్షము. దయచేసి మా ఆశ్రమమునకువచ్చి కొలదిరోజులు మాఆశ్రమములో నుండగోరెదము. మీకు మేము తగుసేవ చేసెదము. మీకు బాగా ఖులాసా చిక్కినతరువాత యాత్రకు వెళ్ళవచ్చును.

స్త్రీ:-(బుద్ధకుమారునికి సాష్టాంగపడును.) మీరు మమ్ములను రక్షించితిరి. నా నగలు, సొమ్ము దొంగిలించబడెను. నా భర్త మీ అమానుషశక్తివలన జీవించినాడు. మీరు దయాస్వరూపులు. నేను యింటికి తంతివార్తపంపి సొమ్ము తెప్పించెదను.

బు॥కు:-తల్లీ! మీరు అట్టి ఆదుర్దా పడవలదు. భగవంతుని దయవలన మావద్ద కావలసినంత ధన మున్నది. మన మందరము నొక తండ్రి బిడ్డలము. మావద్దనున్నది మన మందరము పంచుకొనవచ్చును. ఇదియే మా స్వాముల వారు మాకు చేసిన బోధ.

ము:-మేము యీ రోజున మీవల్ల ముక్తిపొందితిమి. మహా రాజా, మమ్ములను మీ గురుమహారాజుగారి పాదపద్మముల సన్నిధికి తీసికొని వెళ్ళుడు.

బు॥కు:-మంచిది. రండు (అందరు వెళ్ళెదరు.)

## 2 వ రంగము _ 2 వ సీను.

(గంగానది ఒడ్డున రామగుప్త వాని తండ్రితోను నొక పిల్లతోను మాట్లాడు చుండును)

తండ్రి:-నీవు యీ విధముగ జీవితము పాడుచేసికొనుచుంటివి. భగవంతుడు నీకు భాగ్యము, సంఘములో మర్యాదగలస్థితి యిచ్చెను. రాజకుమారునివలె జీవించు చుంటివి. భగవంతుడు కలుగజేసినవన్నియు త్రోసిపుచ్చితివి. ప్రేమలత నిన్నుతప్ప యింకెవరిని వివాహము చేసికొనననని చెప్పు చున్నది. ఇంతవరకు ఆ మాటమీదనే నిలిచి యున్నది.

ఆ పిల్ల హృదయము ఛేదించుట మంచిదా? అది అహింసయా? నీ తల్లి జబ్బుతో బాధపడుచున్నది. ఎప్పుడో ఆమె మరణించును. ఆమెయొక్క ఆఖరు ఆశయము నీవు ప్రేమలతను పెండ్లియాడి మామూలుగ జీవనము గడుపుకొనమని. ఆమె కోరిక తీర్చుట నీకు కర్తవ్యముకాదా? నాతో రా వెళ్ళుదము.

రా:-నేను ఆలోచించుకొనుటకు కొంత సామకాశమిమ్ము. ఒక నిముషము నన్ను విడువుము. నా మనస్సు బాగుండలేదు.

తం:-మంచిది.నీవు సూక్ష్మబుద్ధిగల పిల్లవాడవు. నేను బజారుకు వెళ్ళి తిరిగి వచ్చెదను. ఆలోచించుకొనుము. (తండ్రి వెళ్ళిపోవును. పిల్ల రామునివంక చూచి నవ్వి తండ్రితో వెళ్లును)

రా:-(స్వగతమున) వారిపై ఉద్దేశ్యము, నేనుకూడ వారితో వెళ్ళి ఊరుచూపించమని. కాని అంతర్యముగ నన్ను తీసికొని వెళ్లుటకు వచ్చినారు. నేనిప్పుడేమి చేయవలెను? ప్రేమలత చాల మంచిపిల్ల. నామనస్సు దానిని పెండ్లిచేసికొనమని చెప్పుచున్నది. ఆధ్యాత్మిక మార్గము చాల కఠినమైనది. గురుదేవుని సహాయము లేనియెడల నేను అనేకసార్లు తప్పుడు త్రోవలు త్రొక్కియుందును. ఓగురుదేవా! నేనిప్పుడేమి చెయ్యను? మీరు దగ్గరుండిన సందేహము నొక నిముషములో తీర్చివేసి యుందురు. ఇప్పుడు నేను ఏమిచెయ్యను. (బుద్ధకుమారుడు ప్రవేశించును)

బుద్ధకుమార్:-ఓం నమోనారాయణాయ. రాంజీ. వారు వెళ్ళినారా? నీవు వారికి ఊరు చూపించినావా? మనము ఆశ్రమమునకు తిరిగి వెళ్లెదమా?

రా:-ఓం నమోనారాయణాయ! స్వామిజీ, నీవు నా సోదరుని వలె సమయమునకు భగవంతుడు నావద్దకు పంపినాడు. నీ సలహా నాకు కావలెను. నా తండ్రి నన్ను యింటికి రావలసినదనిన్ని, ప్రేమలతను పెండ్లిచేసికొనమనిన్ని చెప్పు చున్నాడు. వారితో వచ్చిన పిల్లయే ప్రేమలత.

బు:-మన గురుదేవుడు సర్వజ్ఞుడు. ఒక తుండుగుడ్డ తీసికొని రావలసినదిగా నన్ను బస్తీకిపంపి మిమ్ములను తీసికొని ఆశ్రమమునకు రావలసినదిగా చెప్పినారు. వారు తప్పక మన రక్షకులు. సోదరుడా! మనము యీ జన్మమందే తరించవలెను. మనము భగవంతుని తెలిసికొనినపిమ్మట అన్ని విషయములు వాటంతట అవియే తెలియును. మనము విడిగా నుండుటకు కారణము మనకు భగవంతు డిచ్చిన బుద్ధిద్వారా భగవంతుని తెలిసికొనుటకే. అంతరాత్మవినని వాడు నిజముగా చెవిటివాడని చెప్పవలయును. భగవంతుని మరచిపోయి మన జీవితగమ్యముమరచి తిరుగువాడు అద్దములతో నింపబడిన హాలునందు చీకటిలో తిరుగుచు తన తలను అద్దములకు కొట్టుకొనునట్లుండును. అయినను నేను యిది యంతయు చెప్పుట యెందులకు? మనము ఆశ్రమమునకు వెళ్ళుదము రమ్ము.

రా:-సోదరుడా! నీవు సరియైన సమయమునకు వచ్చినావు. నా సందేహములన్నియు తీరినవి. వారు బజారునుండి రాక పూర్వమే మనము ఆశ్రమమునకు పోవుదము.

బు:-ఇది అంతయు దేవుని ఆశీర్వాదము. అది మనలను చెడు పద్ధతులనుండి తప్పించును.

(గురుభక్తిగీతములు పాడుదురు.)

## మూడవరంగము

(గంగ యొడ్డున కుటీరములో స్వామి సేవానంద కూర్చుని ఉత్తరములు వ్రాయుచుండును. రామగుప్త, బుద్ధకుమారుడు మైపుచేయుచుండురు)

సేవా:-మీ స్నేహితుడు కృష్ణస్వామి యెప్పుడు వచ్చెను?

రా:-స్వామిజీ! ఈ రోజుననే వచ్చెను.

సేవా:-అతడు తనభార్యతో కూడ వచ్చెనా?

రా:-లేదు, స్వామిజీ!

సేవా:-అతనికి పెండ్లైనదా? అదియొక గొప్పయోగి అనుకొంటిని. నేను అతని యిక్కడ లోగడ నొకసారి కలిసికొనినప్పుడు మన మనస్సునందలి ఊహాలు తెలిసికొనుట దూరశ్రవణము తాత్కాలిక సమాధిలో నుండుట మొదలగు ఆశ్చర్యకరమైె సిద్ధులు గలిగినట్లు ప్రచారపరచినట్లు జ్ఞాపకం.

రా:-అవును. అవియే వానికి వలలోపడుటకు కారణమైనవి. అతడు పెండ్లి చేసికొనెను.

సేవా:-అతని గురువుకూడ పెండ్లిచేసికొనెను. ఒకవ్యక్తి తన గురువును యేరుకొనునప్పుడు చాల జాగ్రత్తగా నుండవలెను. కాని నీకు నిజమైన శ్రద్ధయుండి బ్రహ్మసాక్షాత్కారమునకు తగిన నిజమైన శ్రద్ధగలిగిన భగవంతుడే నిన్ను సరియైన గురువువద్దకు తీసికొనివెళ్లును.

రా.-స్వామిజీ! కృష్ణస్వామి ప్రపంచమందు కొన్ని కష్టములు గలుగుటవల్ల ప్రపంచము త్యజించెను. యోగి వానికి కొన్ని యోగక్రియలయందు ప్రబోధము కలిగించెను. అతడు దానిలో పడెను.

సే:-వానికి యిప్పుడు తనకోరిక లభించెను. సరియైన వివేక పురుషునకు అది సరిపడదు. ఆత్మజ్ఞానము ముందర సిద్ధులు రిద్ధులు దొంగతళుకు వంటివి.

(అదుగో కృష్ణస్వామి వచ్చుచున్నాడు వానితో రామనాధంకూడ నున్నాడు)

సే:-ఓం నమో నారాయణాయ! స్వాగతము. మీరు క్షేమముగ నున్నారా?

కృ:-మీ ఆశీర్వచనమువల్ల బాగానే ఉన్నాము. నాభార్య కూడ రావలెనని అనుకున్నది కాని మడమనొప్పులవల్ల రాలేకపోయినది.

(సంకీర్తనవిషయమై కొన్ని పుస్తకములు సేవానంద వానికి యిచ్చెను.)

కృ:- నేను చాలకాలమునుండి యోగాభ్యాసము చేయుచున్నాను. కాని కొన్ని ఆధ్యాత్మికశక్తులు గలుగుటకంటె నా మనస్సునకు శాంతిగాని, ఆనందముగాని కలుగలేదు. నేనొకసారి మీ శిష్యులు సత్సంగము చేయుచుండగా అచ్చటకు వెళ్ళుట తటస్థించెను. అప్పుడు నాకు శాంతి, ఆనందము కలిగెను.

సేవా:-భగవంతుని నామమునందు శాంతి, ఆనందము గలదు. మనము పాడుదము. హరేరామ హరేరామ రామరామ హరేహరే। హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే॥

రా:-నాకు చాల ఆనందము కలుగుచున్నది. నేను భగవంతుని యెదుట నున్నట్లు ఊహించుచున్నాను.

కృ:-స్వామిజీ! ఇతడు స్వేచ్ఛావిచారపరుడు (Freethinker) స్వతస్సిద్ధానందశిష్యుడు. వానికి చాలనికృష్టఅనుభవములు కలిగినవి.

రా:-నేను పూర్తిగా పాడైతిని. ఇంక వారిని చూచుటకుకూడ యిష్టము లేదు. రామగుప్తుడు మీవద్ద సౌఖ్యముగా నున్నాడు. నేను చాల విచారస్థితిలో నున్నాను. నాకు యిప్పుడు బుద్ధి కుదిరినది. మీకాళ్ళకు మ్రొక్కుచున్నాను. నన్ను మీ శిష్యునిగా గ్రహింపగోరుచున్నాను. నేను మీకు సేవచేసెదను. నన్ను సరియైన మార్గమున నడిపించి రక్షింపుడు.

సే:-ఇప్పుడు నీకు గురువు అవసరము నిజముగా కనుపించు చున్నది. మతగ్రంథములలో చెప్పనది యేమన 'ఆచార్యం పురుషో వేద' అనగా గురువుగలవాడు నిజము తెలిసికొనును. ఇంకను నొకచోట 'ఆచార్య దేవోభవ' అనగా గురువే దేముడు. ఈ బోధలు అబద్ధములుకావు. ఎవరు గురువు ద్వారాగాక బ్రహ్మవిద్య వారంతట వారే నేర్చుకొనలేరు. నేర్చుకొనుటకు యింకొకరి సహాయము కావలెను. తెలుగు విజ్ఞానశాస్త్రము నేర్చుకొనుటకు యింకొక గురువు కావలెను. వృక్షశాస్త్రము గురువులేనిది నేర్చుకొనలేము. అట్టి పరిస్థితులలో బ్రహ్మవిద్య గురుసహాయము లేకుండ నేర్చుకొనబడదు. కొంతమంది గురువు లేకుండ బ్రహ్మజ్ఞానము పొందినవారుండిరని అందురు. కాని వారు పూర్వజన్మ యొకటి యున్నదని తెలిసిన తరువాత ఆ ప్రకార మూహించరు. అట్టివారు పూర్వజన్మములయందు సాధన చేసి అనేక మెట్లెక్కి ఈ జన్మలో శుకమహర్షి వలె పుట్టుక

యందే జ్ఞానముతో పుట్టుదురు. ఆధ్యాత్మిక మార్గము చాల కష్టమార్గము. ఒకప్పుడు చీకటిలో అడవిలో కండ్లు గంతలు కట్టుకొని నడవ వచ్చును. అప్పుడు గురువుతప్ప మరియెవరును తప్పుడు మార్గమునుండి తప్పించలేరు. గురువు యొక్క చర్య అందరు ఆమోదించులాగున నుండవలెను. అతడు పూర్తిగా వైరాగ్యము గలిగినవాడు, గొప్పజ్ఞాని యైన వాడే నిన్ను గమ్యస్థానమునకు తీసికొనిపోగలడు. అట్టి గురువుకొఱకు ప్రతిరోజు నీవు వెదకి కాలము వ్యయ పర్చుకొన నవసరము లేదు. ఎలిమెంటరీ స్కూలులో మెట్రిక్యులేషను ప్యాసు అయినవాడు నీకు చదువు చెప్ప గలడు. నీవు కాలేజిలో చేరిన పిమ్మట మీ మాస్టరు ఎం.ఏ పి. హెచ్.డి ప్యాసైనవాడు నీ ప్రొఫెసరుగానుండును. నీవు ఎల్లప్పుడు బ్రహ్మసాక్షాత్కారము పొందవలెననే యూహ గలిగియుండవలెను. అప్పుడు భగవంతుడే నీకు సరియైన గురువును, సరియైన కాలమునకు కనపర్చును. మరియు నీవు సరియైన గురువునకు సరియైన శిష్యుడనై యుండవలెను. అప్పుడే దివ్యశక్తి నీకు గలుగుటకు వీలుం డును. ఆ బుద్ధకుమారుని చూడుము. నేను అట్టి జ్ఞానము గలవానిని యిదివరలో చూచియుండలేదు. అతడు మొదటి రకం సాధకుడు. అతడు తన గమ్యమును విడిచిపెట్టడు. ఎన్ని ఆటంకములు వచ్చినను లెక్కచేయడు. ఎల్లప్పుడు నిర్మలముగ, శాంతముగ, సంతోషముగనుండును. సాధన విడువకుండ చేయును. కుష్ఠురోగులకు, కుక్కలకు కూడ సేవచేయును. అతడు పక్షులకు, మృగములకు స్నేహితుడు. అతడు చిన్నవయస్సునందే పరమపురుషుడయ్యెను. శుక

మహర్షి వలె పుట్టుకయందే అతడు జ్ఞానిగా నుండెను. నేను వానికి గురుపూర్ణిమ రోజున సన్న్యాసదీక్ష యిచ్చితిని. అతనిని చిదానందుడని పేరిడితిని. అటువంటి సాధకులు చాల అరుదు.

రా:-కాని మావంటివారియొక్క గతియేమి?

సే:-అట్టి సంస్కారములు నీకు లేనియెడల వాటిని పొందుటకు యిప్పుడు ప్రయత్నించవలెను. నీవొక గురువును చేరి వారికి శ్రద్ధతో భక్తితో శుశ్రూష చేయవలెను. 'తద్విద్ధి ప్రణిపాతేన' పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినః తత్త్వదర్శినః అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీత యందు చెప్పెను. అనగా మహాపురుషులు జ్ఞానులైన వారి వద్ద చేరి వారికి సేవచేయుము. వారికి సాష్టాంగపడుము. వారిని ప్రశ్నింపుము. వారు నీకు ఆత్మజ్ఞానము బోధించెదరు. ఆత్మజ్ఞానము సులభమైన విషయముకాదు. అది బజారులో కొనుటకు వీలైన సరుకుకాదు. చాలకాలము సాధన సేవ చేయుటచే భగవంతుని కృపవలన లోనకల్గు సంస్కృతి. గురువునకు పూర్తిగా శరణాగతుడు కావలెను. వాని ఆజ్ఞ ప్రకారము నడుచుకొనవలెను. గురువునందు భగవంతుని చూడవలెను. అప్పుడు వాని కటాక్షము నీకు కలుగును. నీకు దివ్యజీవనము కలుగును. నీవు ఆత్మజ్ఞానము పొందె దవు. నీ బాధ్యత అంతయు నీ గురువు చూచుకొనును. నీ త్రోవలోనున్న అడ్డంకులు వారు తొలగింతురు. గమ్య స్థానము చేరువరకు నిన్ను నడిపించి తీసికొని పోవును.

రామగుప్తుడు యీ మార్గము అవలంభించెను. రామనాథం నీవు ప్రపంచ కార్యముల అస్థిరత్వము గ్రహించితివి. నీకెంత తెలివితేటలున్నను నీవు సంసారబంధములు వృద్ధి చేసికొని గర్వము అహము గలిగియుంటివి. ఇప్పుడు దివ్య జీవనము ప్రారంభమైనది. సరియైన సాధన చేయుము. 'నేను భగవంతుని యీ జన్మమందే సాక్షాత్కారము చేసికొనవలెను' అను నిశ్చయము గలిగి సాధన చేయుము. నీవు నీ గమ్యమును చేరగలవు. భగవంతుడు నీకు ఆరోగ్యము దీర్ఘాయువు శాంతి సంపదకైవల్యము యిచ్చుగాక.

పాట : (గురుగుజన్నా అవుర్ సత్ స్వప్న)

గురుమహారాజ్ గురుమహారాజ్ గురుమహారాజ్ పాహిమాన్
పరబ్రహ్మ సద్గురు మహారాజ్ సద్గురు మహారాజ్ రక్షమాన్
హరేరామ హరేరామ రామరామ హరేహరే హరేకృష్ణ
హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

సద్గురునాధ శ్రీ గురునాధ ఓం గురునాధా
సద్గురునాధా రామగురునాధ కృష్ణగురునాధ
దత్త గురునాధా దత్తాత్రయ గురునాధా

ఓం త్రయంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం
ఊర్వారు కమివబంధనాత్ మృత్యో ర్ముక్షీయమామృతాత్

ఓంసర్వేషాం శాంతిభవతి.
ఓం సర్వేషాం మంగళం భవతి
సర్వే భద్రాణి పశ్యంతి
మాకశ్చిత్ దుఃఖ భాగ్భవేత్
ఓం శాంతిః శాంతిః శాంతిః॥

---

# IX క్రొత్త భవనము - పాత వాయిద్యము

శివుడు అనుకూలుడు, మంగళకరుడు, భక్తులయెడ చాల దయాళుడు, భక్తులు కోరిన కోర్కెలొసంగువాడు. ఆ కోర్కె లెట్టివియైనను విచారించక వరము లొసంగువాడు. వారిదయ సంపాదించుట అతిసులభము. శివుడు తన భక్తులకు సులభముగా వరములిచ్చునను విషయము తెలుపుటకై యీ కథ వ్రాయడమైనది.

శివుడు వాని భార్య పార్వతి కైలాసపర్వతములో నివసింతురు. ఆ పర్వతము యెక్కువ మంచుతో కప్పబడియుండును. శివుడు పార్వతికి దేవరహస్యము ప్రతిదినము చెప్పుచుండును. అది వినుటకు దేవలోకమునుండి దేవతలు వారి భార్యలతోను, అప్సరసలతోను అక్కడకు వచ్చెదరు. వారు మంచుతోకూడి చాల శీతలముగానుండు ఆ పర్వతశిఖరమున నుండలేక చాల కష్టపడుచుండురు. తమయొక్క బాధ నొకదినం శివునితో చెప్పుకొని చలి నుండి యెక్కువ బాధ కలుగకుండ నొక కుటీరము యేర్పరచుమని కోరిరి. అతడు తపస్సులో నిమగ్నమైయుండి యీ విషయము గమనించలేదు. తల్లి పార్వతితో చెప్పుకొనిరి అటుపైన పార్వతి శివునితో వారి కోర్కె తీర్చవలసినదన కోరెను. అప్పుడు,

శి:-ప్రియమైనపార్వతి! మనము విరక్తులము. మనకు భవనము లెందుకు? నాకేమియు అవసరములేదు. ఏదైన నున్నను అది త్వరలో నావద్దనుండి జారిపోవును. నేను ఆ స్తిని నిలుపుకొనలేను. ఒకానొకప్పుడు నీవుకూడ నావద్దనుండి పోవుటకు సిద్ధమైనది. కాని అప్పుడు దేవఋషి నారదుడువచ్చి సలహాయిచ్చి ఆ గండమును తప్పించెను.

పా:-చూడండి. అందరికి గొప్ప భవనములున్నవి. వైకుంఠము బ్రహ్మము మనము చూడలేదా? మనము యీ అడవిలో నున్నాము. ఒక మిద్దెయైనను యేర్పాటు చెయ్యండి.

శి:-ప్రియురాలా! కుటీరమైననేమి భవనమైననేమి. అది నావద్ద నుండునదికాదు. అది యెవరోయొకరు తీసికొని పోవుదురు. మనపూర్వపు అనుభూతము నీకుజ్ఞాపకము లేదా? అందమైన లంక మనముండుటకు తయారుచేసికొంటిమి. జిత్తులమారి బ్రాహ్మణుడగు రావణుడు నన్ను మోసపుచ్చి అదివానికి యిచ్చునట్లుచేసెను. మనముఅందుప్రవేశించు గృహప్రవేశ సందర్భమున అతడుపురోహితుడుగానుండి ఆపని చేయించి నందుకు బహుమతిగా డబ్బుబదులు లంక తీసికొనెను.

పా:-పాపము దేవతలుచలివలన బాధపడుచున్నారు

శి:-కానిమ్ము వారుఅందులకు అలవాటు పడెదరు.

పా:-కాని వారియొక్క సున్నితమైన భార్యపిల్లలు ఆ బాధ సహింపజాలరు.

శి:-అటులైన వారు వారి పిల్లలను భార్యలను యింటివద్ద విడిచి రమ్మనమని చెప్పవలెను. వారందరు యిచ్చటకు వచ్చుట కిది దసరా పండుగగాని, హోలీపండుగగాని కాదుగదా.

పా:-వారిని విడిచి దేవతలుండలేరు. గనుక వారిని పంపివేయుట కిష్టములేదు.

శి:-అయితే అందరు వెళ్ళవచ్చును. వారు రానవసరములేదు. వారివల్ల నీవుకూడ చాల పరధ్యానముగ నుంటూన్నావు. శివసంహితలో కొన్ని విషయములు నీకు అయిదు ఆరు నాళ్లు చెప్పవలసి వచ్చుచున్నది.

పా:-స్వామి! దేవతలు మీ ఉపన్యాసములు వినుటకు చాల కుతూహలపడు చున్నారు. కాన దయచేసి యింకొక

విధముగ చెప్పక వారుండుటచే యేదైన ఆధారము కల్పించ కోరుచున్నాను.

శి:-అట్లైన యేదో యొకటి చూచెదను. (శివుడు అనుజ్ఞ యిచ్చిన వెంటనే పార్వతి దయామతల్లి గనుక శివునితో) తమరు తయారు చేయు గృహము గొప్ప భవనము చేయండి.

శి:-మంచిది. కాని అది మనకు ఉండునదికాదు.

(తెల్లవారుసరికి గొప్ప భవనము తయారయ్యెను. దేవతలు ఆశ్చర్యముతో ఆ భవనము చూచుచుండిరి. బృహస్పతి అక్కడకు వచ్చి పార్వతితో)

బృ:-అంతా బాగానేయున్నది కాని మంచి ముహూర్తమున యీభవనము కట్టబడియుండలేదు. శని యిందుకు అనుకూలుడుకాడు. వీనిద్వారా యిది అగ్నికి ఆహుతియగును.

(మరుదినము ఉదయము)

పా:-(శివునితో) బృహస్పతి నన్ను చాల నిరుత్సాహపరచినాడు. అది యెట్లు జరుగును. అది జరుగకుండ చేయవలెను.

శి:-నేను మొట్టమొదటనే నీతో చెప్పియున్నాను. ఇల్లుకట్టుట వగైరాలు చేయక మనము మామూలుగా కేవలము కైలాసశిఖరముమీదనే నుండుట మంచిదని చెప్పితిని. అంతటితో నీవు తృప్తిపడవలసి యుండెను.

పా:-నేను నష్టమునకు విచారపడుచుండుటలేదు. ఇందులో నొక విశేష మున్నది, అందులకు నాకు కష్టము కలుగు చున్నది.

శి:-అది ఎట్టిది ?

పా:-శని తమ శిష్యుడు ఈ భవనము మీరు కట్టించిరి. అది శని తగులబెట్టుచుండగా మీ రూరక కూర్చుండిన జను లేమి అనుకొనెదరు. అది మీకు అవమానకరముగాదా ?

శి:-అవును ఆ విషయమై నేను ఆలోచించలేదు.

పా:-కాబట్టి మీరు శనివద్దకు వెళ్ళి నిజస్థితి వానిని కనుక్కొని అట్టిపని అతడు చేయదలచుకొనిన చేయకూడదని చెప్ప లేరా ?

శి:-కావలసిన పనులను ఎవరు మార్చగలరు. శని నామాటలు వినకపోవచ్చును. నేను వానికి లంచమిచ్చుట గాని భయ పెట్టుటకుగాని వీలులేదు. ఎందువల్లననగా అతడు వాని కర్తవ్యము చేయకతప్పదు.

పా:-అతడు మీరు చెప్పినప్రకారము విననియెడల మనంతట మనమే భవనము తగులబెట్టుకొనుట మంచిది. మన భవనము ఆ కుంటివాడు తగులబెట్టినాడనే నామర్దామాట రాకుండ నుండును.

శి:-నీ యిష్టప్రకారము చేయుము. (తనలో) మొదటినుండి చివరవరకు నీ యిష్టప్రకారమే జరుగనిమ్ము.

పా:-మీ శిష్యుడు మూర్ఖుడు కాడు. మంచి తెలివిగలవాడు. ఈ విషయము మీకు తెలిసినదని గ్రహించినవెంటనే చేయవలసినపనియేదో యొకవిధముగ చేయుటకు ప్రయత్నించును. అతడు మీ యిష్టప్రకారము ఒప్పుకొననియెడల నాకు

తక్షణం తెలియపర్చిన నేను ఆ భవనము తగులపెట్టెదను.

శి:-అయితే నీకు నేను యెట్టిగుర్తు యివ్వవలెను?

పా:-(ఒక నిముషము ఆలోచించి) మీ డమరు వాయించవలెను. అతడు మీకు వ్యతిరిక్తము చెప్పెయెడల మీరు తక్షణం డమరు ప్రయోగించిన నేనే భవనము దగ్ధము చేసెదను. డమరుధ్వని నాకు వినబడనియెడల భవనము యధాప్రకారముగ నుండును.

(శివుడు పార్వతి చెప్పిన విషయమునకు అంగీకరించి శనివద్దకు వెళ్ళెను.)

శివు:-(శనితో) నీవు మేము నూతనముగా కట్టిన భవనము దగ్ధము చేయుదువని బృహస్పతి చెప్పియున్నాడు.

శని:-(తెల్లబోయి) ఓ స్వామి! అట్టిపని నేను కలలోనైనను తలపలేదు. మీరు నాయొక్క గురువు. నేను మీ బానిసను. నేను మీ యాజ్ఞలకు లోబడియుండువాడను.

శి:-అయితే నీవు మా భవనము దగ్ధము చేయవుకదా.

శ:-నేను దానిని ముట్టను. నేను అట్టి వాగ్దానము చేయుచున్నాను.

శి:-(సంతోషముతో) నా ప్రియమైన శనీ, నీయొక్క భక్తికి చాల ప్రసన్నుడనైతిని. నీయిష్టమైన వరము కోరుము. నేను యిచ్చెదను.

శ:-నేను తమ తాండవనృత్యముయొక్క ఆధిక్యత విన్నాను. చాల కాలమునుండి చూడవలెనని కోరిక గలదు. కాని సందర్భపడలేదు. స్వామీ! ఒక్కసారి తమ తాండవ నృత్యమును నాకు కనపరచెదరా?

(శివుడు తాను వచ్చినపని సుఖముగా జరిగెనను సంతోషము గలవాడై తన భక్తుని కోర్కెప్రకారము తాండవము చేయసాగెను. తాండవముయొక్క ఆవేశమువల్ల ఒడలు తెలియక తన డమరుకూడ ప్రమోగించెను. శని చాల సంతోషించెను. నృత్యము సమాప్తమయ్యెను. తిరిగి కైలాసమునకు ప్రయాణమయ్యెను. అచ్చట పార్వతి డమరు ధ్వనిని విని తన భర్త వెళ్లినపని సానుకూలము కానందున డమరు ప్రమోగించె నని ఊహించి క్రొత్తభవనము తగలపెట్టుచుండెను.)

శి:-(పార్వతితో) ఈ పనియేమి?

పా:-నేను వానిని తిరస్కరించితిని.

శి:-ఎవరిని?

పా:-శనిని.

శి:-నీ యుద్దేశమేమి?

పా:-ఏమున్నది మీరు డమరు ప్రమోగించిరి. ఆ ధ్వనిని విని నేను నా పని చేసితిని.

శి:-నీవు యేమి విన్నావు గుర్తుఏది?

పా:-మీరుడమరు వాయించినారుగదా!

శి:-అయ్యో! అదిగుర్తుకాదు. శని నేను చెప్పినప్రకారమొప్పు కొనెను. నేను సంతోషించి వరము కోరుమనగా నాతాం డవము చూడకోర్కె తెలిపెను. నేను తాండవము చేసి తిని. నా సంతోషములో డమరు ప్రయోగించితిని కాబోలు (పార్వతి మారుమాటాడ లేదు)

శి:-నేను మొట్టమొదటనే నీతో చెప్పితిని గదా! మనకు యీ భవనము అనవసరమని అవి మనకు ఉండవని. మనము మామూలుప్రకారము మంచుకొండలమీదబాహ్యప్రదేశ మందే యుండెదము. నేను మమూలు ప్రకారము నాభక్తు లకు వరము లిచ్చుచుందును. నాభక్తుల కోర్కెలు నేను నిరాకరింప జాలను:—

(కాబట్టి అందరు ఆ సాంబశివుని ప్రార్థింపుడు. నొక మారేడుదళమిచ్చినను నీళ్ళు యిచ్చినను అతడు సంతోషిం చును. సాంబశివుడు మిమ్ములనందరిని దీవించి మీకు ఆశీర్వ చనము లిచ్చుగాక.)



# X మార్కండేయ

మృకుండు 1 గౌరీశంకర్ గౌరీశంకర గౌరీ శంకర్ గౌరీ శంకర్ గౌరీ గౌరీ
గంగ శంకర్ గంగా శంకర్ శంకర్ శంకర్ గంగా గంగా।
శంభో శంకర శంభో శంకర శంకర్ శంకర్ శంభో శంభో।
ఉమా శంకర్ ఉమా శంకర్ శంకర్ శంకర్ ఉమా ఉమా !

మహాప్రభూ ! ఈ రోజున ఏలనోమూర్తి అతిదీప్త వంతముగా నున్నది. ఇప్పుడు నాకు జ్ఞప్తికి వచ్చినది. నేను యిక్కడకు వచ్చి స్వామిప్రార్థన ప్రారంభించి ఒక్క సంవత్సరమైనది. యీ సంవత్సరము కాలము ఎంతతొందరగా గడచినది. నాకు సంతానములేక పున్నామ నరకమునుండి నన్ను రక్షించుటకు ఒక కుమారుని నాకు దయచేయమని భగవంతుని ప్రార్థించు చుంటినిగదా. ఓస్వామీ, నాకోరిక తీర్చరా ?
(ప్రణమిల్లును)

(ఒక గొప్ప ధ్వని వినబడును. పెద్ద వెలుతురు కనబడును. సాంబశివుడు ప్రత్యక్షమగును. మృకుండుడు సంతోషముతో లేచి)

మృ:-జయజయ శంకర హరహర శంకర శివశివ శంకర
నమామి శంకర

శి:-ఓ మృడుడ, మేము నీయొక్క తపస్సుకు ఎడతెగని భక్తికి సంతోషించితిమి. నీ విప్పుడు నీ కోరిక తెలుపవచ్చును.

మృ:-మహాప్రభూ, దయాస్వరూపా నాకు పిల్లలు లేరు. నా వంశము నిలుపుటకు ఒక కుమారుని దయచేయుమని నా ప్రార్థన.

శి:-(నవ్వుచు) ఓ మునీ! నేను చెప్పబోవు యిద్దరిలో నీకు యెట్టివాడు కావలెను. మొదటివాడు చిన్నప్పటినుండియు జబ్బులతో నుండును. చెడు బుద్ధులుగలవాడు. వాని ఆయుర్దాయము 100 సంవత్సరములు. రెండవవాడు మంచి గుణములు గలవాడు. ఆరోగ్యవంతుడు నాయందు భక్తి కలిగి యుండును. వాని కాలపరిమితి 16 సంవత్సరములు మాత్రమే.

మృ:-ఓ సర్వవ్యాపకుడవగు భగవానుడా! నీయందు భక్తి గలిగి మంచిగుణములు కలవాడు కొద్ది ఆయుర్దాయము కలవాడైనను వానినే దయచేయవలెను.

సరిగానే కోరినావు. నీకోరికప్రకారము జరుగును.

(మృకండుడు శివునికి ప్రణామము చేయును. శివుడు వానిని దీవించి అంతర్ధానమగును.)

## 2 వ రంగము

మార్కండేయుని గృహము 16 వ సంవత్సర జన్మదినము. ఇంట్లో తలిదండ్రులు పూజాగృహమందు శివునికి పూజ చేయుచుందరు. వారు విచారముతో కన్నీరు కార్చుచుందురు.

మృ -(బయట) ఓ బ్రాహ్మణుడా! ఈ రోజున నా జన్మదినము త్వరగా రా. మనము బాగా భోజనము చేసెదము. నీకు నిరుటి ఉత్సవము జ్ఞాపకములేదా! (మార్కండేయులు

లోనకువచ్చి తల్లిదండ్రులను చూచి వారు విచారముగ నుండుటకు ఆశ్చర్యపోవును.)

మా:- నాన్న, అమ్మ, మీరెందు కేడ్చుచున్నారు? ఈ రోజున నేమి జరిగినది. నిరుడు యీ దినమందు చాల సంతోషముతో నున్నారు. ఈ దినము మీరు విచారముగ నుండుటకు కారణమేమి? అమ్మా! మీకు బాధ గలుగజేయుచున్న విషయము నాతో చెప్పరాదా మీరు ఆప్రకారము విచారపడుచుండిన నేను భరింపజాలను.

మరుద్వతి:- తండ్రీ! నాదగ్గరకు రమ్ము. (మరల ఏడ్చుట ప్రారంభించును.)

మార్క:- అమ్మా! ఈ విచారమునకు కారణము నాకు చెప్పవా?

మరుద్:- నాయనా! ఈ రోజున నీయొక్క 16 వ సంవత్సర జన్మదినము.

మా:- అయితే మీరు సంతోషముతో నుండవలసినరోజుగదా ఎందుకు ఏడ్చుచున్నారు?

మ:- మేము నీకొరకై ఒక సంవత్సరము తపస్సుచేసితిమి. నీవు పుట్టితివి. కాని శివుడు నీకు 16 సంవత్సరములు మాత్రమే ఆయుర్దాయము యిచ్చినాడు. నీ జీవితముయొక్క అంతిమ సంవత్సరము ఈ రోజున ప్రారంభము గనుక చాల విచారము గలిగినది.

మా:- ఇంతేనా! ఇందుకు విచారమెందులకు? నేను నా గురువు గారివద్ద వేదములు ఆగమములు పురాణములు చదివితిని.

అవిఅన్నియు భగవంతుడు దయాళుడనియు సర్వశక్తి మంతుడనియు చెప్పుచున్నవి. అట్టి పరమ దయాళుడగు భగవంతుని నేను ప్రతిదినము పూజించుచున్నాను. అతడు ఘటనాఘటన సమర్థుడు. అతడు భక్తుల కోర్కెలు తీర్చు వాడు. అట్టి మహామహుడు అమరత్వము యిచ్చుటకు కూడ సమర్థుడు. ఇట్టి స్వల్పవిషయములో ఆయన మనకు సహాయము చేయడా? అమ్మా! నాన్నా! మీరు భయ పడకుడు. నేను దేవాలయమునకు వెళ్ళెదను. రాత్రి పగళ్లు శివుని ఆరాధించెదను. అతడే నన్ను రక్షించును.

(అప్పుడు తలిదండ్రులు మార్కండేయుని కౌగలించు కొనెదరు. మార్కండేయులు పూజా సామగ్రితో దేవాలయ మునకు వెళ్ళును.)

మృ:- మార్కండేయ! భగవానుడు నీకు అమరత్వము అను గ్రహించుగాక. నీవు హనుమంతునివలెను, ధృవునివలెను చిరంజీవి వగుదువుగాక. —

## మూ డ వ ర ం గ ము

మా:- ఓం నమశ్శివాయ, ఓం నమశ్శివాయ, ఓం నమశ్శి వాయ, ఓం నమశ్శివాయ (ఒక శివలింగము స్థాపించి) మూడులోకములకు కర్తయు, త్రిపురములను హుంకార ముతో సంహారము చేయువాడును, మంగళప్రదుడును అగు ఆ భగవానుడు సుస్థిరుడగుగాక. నేను సమర్పించిన వస్తువులు స్వీకరించుగాక. అతడు నేను చేయు పనికి సంతో షించి నన్ను ఆశీర్వదించుగాక. నేను యిచ్చటనే తీవ్రమైన

తపస్సు చేసెదను. మనస్సు, యింద్రియములు స్వాధీన పఱ్చుకొని ఏకాగ్రతతో రాత్రింబగళ్ళు 24 గంటలును తపస్సు చేసెదను. స్వామి విశ్వనాథా! నేను నీకు పూర్ణ శరణాగతుడను. నాది అంతయు నీదే. ఓ భగవానుడా! నన్ను రక్షింపుము. కాపాడుము. (తరువాత కొద్దిరోజులకు శివుడు మార్కండేయులకు ప్రత్యక్షమగును.)

శి:-ఓ పిల్లవాడా! నీయొక్క భక్తికి చాల సంతోషించినాను. నీ శరీరము, నీ శరీరసౌఖ్యములను లక్ష్యమంమంచుకొనక నీవు తపస్సుచేయుచుంటివి. నీకేమికావలెనో కోరుకొనుము వానిని యిచ్చెదను.

మా:- ఓ సర్వాంతర్యామీ! లోకము లన్నింటికిని మీరు తండ్రులు. నేను పూర్తిగ శరణాగతుడనైతిని. యముడు నన్ను తీసికొనివెళ్ళుటకు వచ్చినప్పుడు వాని బారినుండి నన్ను రక్షింపుము.

శి:-నీవు మృత్యువు విషయమై భయపడవద్దు. నేను నిన్ను రక్షించెదను. (ఆ ప్రకారము చెప్పుచు తన పాదము మార్కండేయుని తలపై పెట్టెను. మార్కండేయులు ప్రణమిల్లును. శివుడు అంతర్ధానమగును,

మా:-నేను ధన్యుడనైతిని. కాని 16 సం॥ పూర్తియగువరకు నేను శివుని ఆరాధించుచు యిచ్చటనే కాలముగడిపెదను.

4 వ రంగము (యముడు వాని అనుచరులు ప్రవేశము)

అనుచరులు:-మేము మార్కండేయుల ఆయుర్దాయము పూర్తియైనందున వానిని తీసికొని వచ్చుటకు వెళ్ళితిమి. అత

డెల్లప్పుడు శివుని ధ్యానించుచు శివుని పూజించును. తన శరీరమందలి ధ్యాసవిడిచి యున్నాడు. వాని మనస్సు యింద్రియములు వాని స్వాధీనములో నున్నది. కామము, క్రోధము మోహము మొదలగు దుర్గుణములు వాని దరిని జేరుట లేదు. ఇప్పుడీతడు కాశీక్షేత్రములో నున్నాడు. శివుని సంరక్షణలో నున్నాడు. మాకువానిని చేరుటకు శక్తి లేదు. కాబట్టి యీ విషయము మీరే ఆలోచించవలెను.

య:-చిత్రగుప్తుని రమ్మనమని చెప్పుడు (అనుచరుల వెళ్ళెదరు చిత్రగుప్తుడు వచ్చును)

య:-చిత్రగుప్తా! మార్కండేయుని జీవితము విషయమై ఏమి జరిగినది. తెల్పుము

చి:-స్వామీ! శివుడు ఆపిల్లవాని తండ్రికి వరమిచ్చు నప్పుడు 16 యేండ్ల ఆయుర్దాయముగల కొడుకును నిచ్చునట్లు చెప్పిరి. ఆ గడువైపోయినది. ఆపిల్లవాడు గొప్ప శివభక్తుడు ఎట్టి తపస్వినులైనను మృత్యువునకు లొంగవలసినదే. అటుల జరగకుండుట ఎచ్చటను వినియుండలేదు. వారు చేసినమంచి కార్యములనుబట్టి వారు నరకవాసము లేకుండా స్వర్గమనుభవించెదరు.

య:-కందా! నీవువెళ్లి ఆపిల్లవానిని తీసికొనిరమ్ము. (కందా చిత్తమని వెళ్లును) (కంద తిరిగి వచ్చును)

కం: నేనుకాశీకి వెళ్ళితిని. వానితో అతడుచేసిన గొప్ప తపస్సు వలన వానికి యింద్రలోక ప్రాప్తి గలుగుననియు అక్కడ సుఖభోగములు అనుభవించ వచ్చుననియు చెప్పి

తిని. కాని నా ప్రలోభములకు అతను లొంగలేదు. రానని చెప్పినాడు.

య:-(కోపముతో) అటులనా! సరే నేనే వెళ్ళి వానిని యీడ్చుకొనివచ్చెదను. నా వాహనము సిద్ధపరుపుము. (వెళ్ళును)

## 5 వ రంగము

(యముడు పాశము వగైరాలతో తపస్సులో నున్న మార్కండేయుల వద్దకు వచ్చును)

మా:-(యమును జూచి) ఓభగవానుడా! యముడు వచ్చినాడు. నేను శివలింగమునే ధ్యానముచేయు చుందును. నన్ను యముడేమి చేయగలడు.

య:-ఓపిల్లవాడా! శివునిఆజ్ఞయు నీప్రారబ్ధము పూర్తి అయినది. నీవుమృత్యువు నెట్లుతప్పించు కొనగలవు ? నీవు సముద్రపు ఒడ్డుననుండుఇసుక రేణువులు లెక్కపెట్ట నెంచిన లెక్కపెట్ట వచ్చును ఆకాశమందున నక్షత్రములైనను లెక్కపెట్ట వచ్చును. కాని నాచేతిలో పడిన జీవులసంఖ్యను లెక్కింపలేవు. మూడులోకముల ప్రభువులు అడ్డము వచ్చిననునిన్ను నేను తీసికొని పోగలను.

మా:-సాంబశివుని ఆరాధించువారికి మృత్యువులేదు. కోరికలకు అతీతులైన వారికి వారు తపస్సు చేయుచున్నను, లేక గృహస్థులుగా నున్నను వారు పంచభూతములకు అతీతులు. అట్టివారికి బ్రహ్మ లెక్కలేదు. ఇంద్రలోక వాసులు వారికి నొక లెక్కలోని వారుకారు. ఇంద్రునికి లెక్కచేయరు.

శివుడు వేసు అతని భక్తులు వేసు అనితలచు వారిని వారుఅజ్ఞానులని ఎంచెదరు. ఆప్రకారము వేదముల యందు చెప్పబడి యుండలేదా! భక్తులయొక్క ఆధిక్యత ఎవరు శ్లాఘించగలరు. వారు అహము మమతలు లేనివారు. మీరు భగవంతునియెడల భక్తునికిగల పార వశ్యము వైరాగ్యము తెలియక వానినొక సామాన్య మనుజునివలె నెంచి వచ్చినారు. నేను చేసిన తీక్షణమైన తపస్సంతయు వృథాఁగునని మీ అభిప్రాయము? అట్టి దురభిప్రాయము మీరు పడవలదు. ఇట్టి పవిత్రస్థలమున మీరు నిలుచుటకు అర్హత లేదు. మీ త్రైలోకాధిపత్యము నష్టమగును. కాన మీరు తక్షణం యిచ్చటనుండి తొలగి పొండు. లేనియెడల మీకు ప్రమాదము తటస్థించును

యము:-అటులనా? (మృత్యువునుండి నీవు యెట్లు తప్పించు కొనెదవో చూచెదను అని పాశము మార్కండేయునకు లింగమునకు కలిపివేసి లాగ ప్రయత్నించెను.)

మా:-(నిర్భయముగా) ఓమృత్యుంజయా! ఓమృత్యుంజయా! నీవు నన్ను యిట్టి విషమస్థితినుండి తప్పించెదనని వాగ్దానము చేసియున్నావు. రమ్ము! రమ్ము యముడు నన్ను లాగు చున్నాడు. (మార్కండేయులు ఎక్కువ భక్తితో శివలింగ మును కౌగలించుకొనును. ధ్యాననిమగ్నుడగును. అప్పుడు గొప్ప ధ్వనితో లింగమునుండి శివుడు ప్రత్యక్షమగును.)

శి:-(మార్కండేయునితో) ఓ భక్తశేఖరా! నిన్ను రక్షించు టకునేనున్నాను. భయపడవలదు. (యమునివైపు మూడవ కన్ను తెఱచి) నాభక్తునిప్రాణము తీయుటకు నీవు యెందుకు

ప్రయత్నించుచున్నావు. నీ గర్వమువల్ల, నన్ను పూజ చేయుచున్న నా భక్తుని నీవు పాశము వేసితివి. నీకు నీతి బోధించుటకై నేను వచ్చితిని. ఇప్పుడైనను నీతప్పు నీవు తెలిసికొనుము. (ఎడమకాలుతో తన్నును. యముడు క్రిందపడి బొబ్బపెట్టి చనిపోవును. మార్కండేయులు ఆశ్చర్యముతో చూచును.)

శి:-బిడ్డా! దుష్టులుపోవు మార్గమున యముడు వెళ్ళినాడు వాని అనుచరులు వానినే అనుసరించినారు.విచలితముగాని నీభక్తికి పురస్కారముగా నీవు ఎల్లప్పుడు 16 సంవత్సర ముల వయస్సు గలవాడవై జీవింపుము. (శివుడు అదృశ్యు మగును)

మా:-నమస్తే నమస్తే విభో విశ్వమూర్తే। నమస్తే నమస్తే చిదానందమూర్తే। నమస్తే నమస్తే తపోయోగ గమ్యా నమస్తే నమస్తే స్మృతిజ్ఞానగమ్యా॥

6 వ రంగము - (శివుడు కైలాస్)

విష్ణు, బ్రహ్మ, ఇంద్ర, భూదేవి వత్తురు. అందరు కలిసి పాడుదురు.

'నమామి శంకర భవాని శంకర భవాని శంకర గౌరీశంకర శంభోశంకర తవశరణం'

శి:-మీరందరు యిచ్చటకు వచ్చినపనియేమి?

విష్ణువు:-మే మందరము మాకు నియమించిన పనులు మేము చేయుచుంటిమి. ఓ జగత్ సృష్టికర్తా! భూదేవి భారము భరింపజాలకున్నది. మీరు యముని చంపుటవలన ఆపనులు

చేయువారు యిప్పు డెవరునులేరు. అన్నిలోకములు భరింప శక్తిగల భూదేవియే అటుల బాధపడుచుండిన వారందరిని పోషించుటకు నాకెట్లు శక్తిగల్గును. ఓ స్వామి మీరు మాయందు దయగలిగి యముని తిరిగి బ్రతికించ కోరు చున్నాము. (ప్రణమిల్లుదురు.)

శి:-ఓ యమా! లెమ్ము. (యముడు లేచును.)

య:-శంకర శంకర జయమహాదేవ। శంకర జయ సదాశివ శంకర శంకర జయ పరమేశ్వర శంకరశివ హర హర హరహర! ఓ దయాస్వరూపుడగు భగవానుడా! నా పాపములు మన్నింపుము. నేను అజ్ఞానముతో చేసిన కార్య మునకు నన్ను క్షమింపుము. మీ పాదస్పర్శవల్ల నా అజ్ఞా నము నశించినది. తమ ఎడమపాద స్పర్శవల్ల నేను నిజ ముగా ధన్యుడనైతిని.

శివుడు:-ఓయమా! నేనుచెప్పు ఆజ్ఞలను శ్రద్ధగా మన్నింపుము. నీ గర్వము విడిచి పెట్టుము. పవిత్రమగు రుద్రాక్షవిభూతి ధరించు నాభక్తుల వద్దకు వెళ్ళకుము. నాభక్తులై నాద్వారా మోక్షము పొందగోరు వారిని మమూలు మనుష్యులవలె చూడక వారిని గౌరవింపుము. మర్యాదతో నమ్రతతో వారిని చేరుము. చెడుమనస్సు గలిగి యింద్రియలోలురై మంచి చెడ్డలకులోనై సంసార చక్రమునందు పట్టుబడిన వారియందు నీఅధికారము చూపింపుము. వారినిస్వర్గమున కో నరకమునకో పంపుచుండుము. ఇంకనీపని మీాద నీవు ఉండుము.

యమ:-చిత్తము. మహాప్రభూ! తమ ఉత్తర్వుల ప్రకారము నడచెదను.

(అందరు నిష్క్రమింతురు)

# XI పావనపురుషుడు, ఆలవందర్

## 1 వ రంగము 1 వ సీను

(వీరమణిరాజు దర్బారు)

మంత్రి వివేక స్వరూపుడు—రామ్ (బంట్రోతు) సంకీర్తన చేయువారిని పిలిపింపుము. రాజుగారు యిప్పుడు సంకీర్తన సలిపెదరు.

రామ్:-చిత్తము మహాప్రభూ. (వెళ్ళి తిరిగి సంకీర్తన చేయువారితో ప్రవేశము.) మహారాజా! సంకీర్తన చేయువారు వచ్చిరి.

సంకీర్తన చేయువారు: హరేరామ హరేరామ రామరామ హరేహరే హరేకృష్ణ కృష్ణ కృష్ణహరే హరే!

(ఇంకొక పాటకూడ పాడుదురు)

వీరమణి:-వివేకస్వరూపా! ఈ భక్తులకు మంచి బహుమానము యిచ్చి పంపివేయము?

వివేక:-ఆలాగుననే మహారాజా! (నిష్క్రమింతురు)

## 2 వ సీను

(మఱి రాజగము. ఒకపాఠశాల. ఉపాధ్యాయులు భాష్యాచార్యులు ముగ్గురు బాలుర - ఉపాధ్యాయుడు వేషములు ... మాటాడుచు)

భాష్యా:-ప్రియమైన పిల్లలారా! నేను లోగడ చెప్పిన పాఠములు వ్రాసినారా!

పిల్లలు:-వ్రాసినాము ఇవిగో మా పుస్తకములు (పుస్తకములు చూపుదురు)

భాష్యా:-మీరు యీ పుస్తకములో రెండవ పాఠము వ్రాయుడు. నరేశం, నీవు పిల్లలను జాగ్రత్తగా చూచుచుండుము. నాకు యింకొకచోట తొందర పని యున్నది. తిరిగి ఒకగంటలో వచ్చెదను. ఎవరైన అల్లరి చేసిన వారిపేర్లు వ్రాసి నాకు చూపుము.

శ్రీనివాస్.-పిల్లి వెళ్ళిపోతే ఎలుకలు సంతోషించును. ఆహాహా (నవ్వును) అరే యమునాచార్యా శంకరశాస్త్రి వచ్చుచున్నాడు.

యమున:-ఎవడతడు?

శ్రీని:-నీవు యెరుగవా? వానిని వాని యజమాని కోలాహలుని ఎఱుగని వారెవరు? క్రొత్త పండితుడు కోలాహలునకు యితడు ఏజంట

య:-అట్లనా? నేను కోలాహలుని పేరు విన్నాను అతడు రాజు గారికి గొప్ప మిత్రుడని విన్నాను. పండితులందరు వానినిచూచి భయపడుదురని అతడు పండితులందరి నుండి

కొంతడబ్బు లంచముగా పుచ్చుకుంటాడట. చాలక్రూరుడు రాజుగారి వద్ద మిక్కుటమైన డబ్బు సంపాదించువాడు. బీద పండితులవద్ద ఎందుకు డబ్బు తీసికొనవలెను ?

శ్రీనివాస్:- అవునవును. వీడు పండితులందరకు ప్రక్కలో బల్లెమువంటివాడు. చాల గర్వపోతు. బయటకు వెళ్ళు నప్పుడు పల్లకిమీద నే వెళ్ళును.

య:-అరే శ్రీని, వాడిక్కడి కెందుకు వచ్చుచున్నాడురా ?

శ్రీ:-బహుశా మన ఆచార్యులవారు డబ్బు చెల్లించలేదను కుంటాను.

నరే:-ఈ గొడవంతా మన కెందుకురా ? మీరు యీ ప్రకారము అల్లరిచేస్తే పేర్లువ్రాసి ఆచార్యులవారికి చూపిస్తాను. నిశ్శబ్దం. (బల్ల గుద్దును.)

య:-ఓ ప్రియమానిటరుగారూ ! కొన్ని నిముషములు మమ్ము లను క్షమింపవలెను. పిల్లలారా ! నేను యీ వచ్చే మనుష్యుడు వెళ్ళేవరకు నేనుమీకుమానిటరుగానుంటాను. నేను చెప్పినప్రకారము మీరు చేయుడు. నేను వానితో మాట్లాడెదను. నేను చప్పట్లు కొట్టుచున్నప్పుడు మీరు చప్పట్లుకొట్టి వెక్కిరించవలెను. (పిల్లలు నవ్వుదురు.)

(చేతిలో కర్రతో లావుపాటి శాస్త్రి తమలపాకులు నమలుచు వచ్చును )

శంక:-చూడండి అబ్బాయిలూ ! మీ మాష్టరుగారు ఏరి ?

య:-ఆ, అతడా ! చూస్తాను ఉండండి. (డస్కుక్రింద, టిఫిన్

బొక్సులో చూచును ) అరే ! ఇప్పుడే యిక్కడ ఉన్నాడే. ఇంతలో మాయమైనాడు. అయ్యో, కాని శాస్త్రిగారు మా మాస్టరుతో చెప్పవలసినమాట యేమైన నున్న యెడల నాతో చెప్పండి. నేను వారితో చెప్పుతాను.

శాస్త్రి:-(కర్ర నేలమీద కొట్టును) ఓ అల్లరిపిల్లవాడా ! నేను యెవరినో నీకు తెలియునా? నేను శంకరశాస్త్రిని. మహా మహోపాధ్యాయ కోలాహలుని ఏజంటును.

య:-(మర్యాద నటించును) అలాగండి. మీరుకూడ అంతే వారే కాబోలును.

శాస్త్రి:-అవును. సందేహము లేకుండా. ఓ తెలివితక్కువ వాడా ! వినుము. మీఆచార్యులు కోలాహలు గారికి యివ్వవలసిన నెలసరిమామూలు యివ్వలేదు. కోలాహలుని గారికి చాల కోపము వచ్చింది. తక్షణం సొమ్ము పంపించ వలసినదని చెప్పు. ఈరోజున రాజభవనమునకు రాని యెడల చాల ప్రమాదము జరుగును.

య:-ఫూ, ఇంతేనా ! ఆచార్యుల వారి తరపున నేనుచెప్పే జవాబు కోలాహలుని గారికి అందజేయుము. మా మాస్టరు గారు అటువంటి గర్వపోతులకు ఒక్క పైసకూడ యివ్వరు. పో, వెళ్ళిపో. ఆప్రకారము చెప్పు (చప్పట్లు కొట్టును. అందరుకూడ అల్లరి చేయుదురు) చలో చలో చలో చలో చలో శాస్త్రి జల్ది చలో జల్ది చలో జల్ది చలో॥
ఆగొప్ప మూర్ఖునకు మేము ఒక్క పైనాకూడ యివ్వము. ఈ రోజున వాని గర్వము తగ్గించుటకు ఒక నీతి నేర్పెదము. (చప్పట్లు. కేకలు. నవ్వులు.)

శా స్త్రి:-ఓ మూర్ఖులైన పిల్లలారా! మీా పని పట్టించెదను. చూడుడు.

య:-నాకు తెలుసును. నీవు గొప్ప పౌరుషవంతుడవని నీవు ప్రతిదినము చాల ముద్దలు తినగలవు. అదియే నీ పౌరుషము (నవ్వెను) (శా స్త్రి వెళ్ళిపోవును)

(న టేశం యమునతో) యమునా! నీవు ఎంతపని చేసి నావు. మన ఆచార్యులు గారిని విషమ స్థితిలో పెట్టినావే. శా స్త్రి వెళ్ళి కోలాహలునితో చెప్పును. కోలాహలుడు రాజుకు కోపము తెప్పించును. ఆ తరువాత మన ఆచార్యులుగారికి యేమి జరుగునో!

య:-మానిటర్ సాహెబు భయపడకు. నేనంతయు సరిచేసె దను. పిల్లలారా! నెమ్మదిగా కూర్చుండుడు. ఆచార్యుల వారు వచ్చుచున్నారు. (ఆచార్యులు వచ్చును)

(వాని బుక్కు-చూచి దానియందేమియు వ్రాయకుం డుట కనిపెట్టి)

ఆ:-ఏమి నేను లేనప్పుడు ఆడుకొనుచున్నారా? నటేశం నేను లేనప్పుడు ఏమి జరిగినది తెల్పుము. (నటేశం యేదో చెప్పబోగా యమున వానిని ఆపి తాను యీా ప్రకారము చెప్పెను)

య:-అయ్యా మీారువెళ్లిన తరువాత కోలాహలుని యేజంటు వచ్చి కోలాహలుడు కోపంతో ఉన్నాడనియు మీారు యివ్వవలసిన సొమ్ము తక్షణం తీసికొని రావలసినదనియు చెప్పినాడు నేను, కోలాహలునివంటి క్రూరునకు గర్వ

పోతునకు ఆచార్యులుగారు యేమియు యివ్వరని చెప్పు అని చెప్పినాను. అతడు వెళ్ళిపోయినాడు.

ఆచా:-(విచారముతో) ఓ భగవంతుడా! (యమునతో) ఏం పని చేసినావు. నీవు కోలాహలుని అధికారము ఎఱుగవు. అతడు మహారాజుతో చెప్పి అనేక కష్టములు మనకు తెచ్చి కొని రాగలడు.

య:-అయ్యా! మీ రేమియు ఆదుర్దా పడవలదు. నేను ఆ కోలాహలునితో వాదించి వాదనలో వానిని సులభముగా ఓడించగలను. నాకు సెలవిప్పించండి. నేను తక్షణం అతని వద్దకు వెళ్ళి మీ తరపున వానితో వాదనకు దిగి వానిని ఓడించి అతడు సిగ్గుపడునట్లు చేసెదను.

ఆచా.-నీవు చిన్నపిల్లవాడవు ఆరితేరిన పండితుని యెదుట నీవు వోడిపోవుదువు.

య:-మాస్టరుగారూ! భగవంతుడే నాఆధారము. భగవంతుడే నాకు సహాయము చేయగలడు.

ఆ:-సరే! నా మనస్సు స్థిమితముగా లేదు. పిల్లలు మీయిండ్లకు వెళ్ళవచ్చును.

(ఆచార్యులు వెళ్ళును. పిల్లలుయమునా పాడును.)

జై సరస్వతి జై సరస్వతి, జై సరస్వతి, పాహి మాం! శ్రీ సరస్వతి, శ్రీ సరస్వతి, శ్రీసరస్వతి. పాహిమాం శరణం ఓం. ఓంశక్తి, ఓంశక్తి, ఓంశక్తి, పాహిమాం. ఓంశక్తి ఓంశక్తి, ఓంశక్తి, రక్షమాం (నిష్క్రమింతురు)

# 3 వ సీను రాజదర్బారు

(శంకరశాస్త్రి వచ్చును) ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ ఓం నమశ్శివాయ.

(శంకరుడు కోలాహలుని బైటకు తీసికొనిపోవును)

శంక :- నేను ఆచార్యుని యింటికి వెళ్ళినప్పుడు అచటనుండు పిల్లలు చాల మోటుగా ప్రవర్తించినారు. ఆచార్యులు అక్కడలేడు

కో:-చిన్నపిల్లల విషయమై మనమంత విచారించ నవసరము లేదు.

శం:-అటులకాదండి. ఒక సాహసముగల పిల్లవాడు మా మాష్టరుగారు గర్వముతో కూడిన మూర్ఖుడైన కోలాహలునకు ఒకపైసయైనను యివ్వరని చెప్పినాడు.

కో:-(గంభీర భావముతో) అటులైన భాష్యాచార్యులు ఈ ప్రకారము అతనితో చెప్పియుండ వచ్చును. అతనిదుర్మార్గమును నేను శిక్షించెదను. నీవు వెళ్ళుము

(శంకరుడు వెళ్ళును)

(కోలాహలుడు కోర్టులో కూర్చుండును)

కోలా :- రాజా! రెండు నిముషములు నేను మాట్లాడుటకు శెలవు యివ్వవలెను.

రా :- ఏమిటది కోలాహలా?

కోలా :- తమ దర్బారు పండితులను ఎందుకును పనికిరాని యొక పొగరుబోతు మనుష్యుడు నిందించినాడు. రాజు గాని పండితునియొక్క మర్యాద నిలుపుటకు నేను పండితులు అందరివద్ద కొద్దిసొమ్ము ఆసికొనుచున్నాను భాష్యాచార్యులు కొన్ని నెలలనుండి బాకీసొమ్ము యివ్వనందున నా ఏజంటును వానివద్దకు పంపగా వానిని చాల అమర్యాద పరచినారు. దేవరవారి పండితునకు అమర్యాద గలుగుట అనగా దేవర వారికి అమర్యాద చేయుటయే గదా! కాబట్టి ఆచారిని దర్బారుకు పిలిపించి వానికితగిన శిక్ష విధించ కోర్తాను.

(రాజు రాణియగు విద్యావతి వంకచూచును)

విద్యా:-కోలాహలా! మీరు రాజసభయొక్క పండితఅధికారముపొంది మీయొక్క విద్య యితరుల విద్యకంటె హెచ్చుగా నున్నదనే కారణమువల్లను అందరు పండితుల వద్ద కొంతసొమ్ము వసూలు చేయుచున్నారు. ఇప్పుడు భాష్యాచార్యులవారు సొమ్ము యిచ్చుటకు నిరాకరించి యున్నారు. ఇట్టి సందర్భమందు మీరును వారికిని వాద వివాదములు జరుపుకొని అందులో వారు ఓడిపోయిన యెడల మీరు వారికి శిక్ష విధించవచ్చును. మీరు ఓడిపోయిన వారిని శిక్షించుట న్యాయముకాదు.

మంత్రులు:-శబాస్! ఇవి జ్ఞానముతో కూడిన మాటలు.

రాజు:-విద్యావతి, నీ తెలివిగల మాటలకు నేను సంతోషించితిని. అట్టి పండితురాలవు గనుకనే నీకు విద్యావతి యని

వేసు వచ్చినది. నీ సలహా ప్రకారము నేను నడిచెదను. ఇప్పుడే భాష్యాకారులకు కబురు చేసెదను.

రాజు:-మంత్రివంక చూచెను. (మంత్రి బంట్రోతు చెవులో చెప్పగా వాడు వెళ్ళును.)

రాజు:-ప్రియమైన విద్యా, నీవు గొప్ప విద్యావంతురాలవు గనుక ఈ రోజున రాబోవు వాద వివాదములు పరీక్షించుటకు నీవుకూడ యిచ్చట నుండవలెను.

(మంత్రివైపు జూచి) కొన్ని నిముషములు సంకీర్తన వినెదను. (సంకీర్తనచేయువారువచ్చి వారివారి సంకీర్తన చేయుచున్నారు)

(మంత్రి రాముని పిలిచి) సంకీర్తన చేయువారిని పిలువుము. సీతారాం హోరాధేశ్యాం హో। సీతారాం హోరాధే శ్యాం హో సీతారామ వినాసుఖ స్వప్ననహీ। రాధే శ్యామ్ వినాకోయీ ఆప్నానహీ॥ సీతారామ్ వినాసుఖ కౌన్ కరే। రాధేశ్యామ్ వినా దేరీజ్ నోలయిఫ్। సీతారాం వినాఉద్ధ హారనహీ రాధేశ్యామ్ వినాభేద భావనహీ। రాధేశ్యామ్ వినాధీరజ్‌నహీ రాధేశ్యామ్ వినాయూక నాట్ హియర్। సీతారామ్ వినాయూకనాట్ థింక్-రాధే శ్యామ్ వినాయూకనాట్ బ్రీత్—

(నిష్క్రమించును రాముడు ప్రవేశము)

రా:-మహారాజా! నేను పండిత్ భాష్యాచార్యుల వారి యింటికి వెళ్లి దేవరవారి ఆజ్ఞ తెలిపితిని. అప్పుడు యమున అనేపిల్ల వాడు బైటకువచ్చి ఆచార్యుల వారి బదులు వాదవివాదములతో తాను పాల్గొందునని తెల్పెను. అందుకు అతను

రెండు కారణములు తెల్పెను. మొదటిది ఆచార్యుల వారికి వాదవివాదములతో కోలాహలుడు పిలుచుట ఒక యెలుక పిల్ల ఏనుగపిల్లను పిలిచినట్లుగా నుండెను. రెండవ విషయ మేమన ఆచార్యులవారు ప్రస్తుతం ధ్యాననిమగ్నులై యున్నారు. రెండుగంటల వరకు వారికి తీరుబడి యుండదు. కాబట్టి నేను అచ్చటకు వచ్చుటకు రాజుగారు యిష్టపడే యెడల రాజుగారి దర్బారు మర్యాదల ప్రకారము పల్లకీ ఛత్ర చామరములు నాకుపంపవలెను. అప్పుడు యీ శాస్త్రవాదము తప్పక దేవరవారి ఉత్సవముల ప్రకారము జరుగును అని చెప్పినాడు.

రాజు:-(ఆశ్చర్యముతో) ఆపిల్లవాని ప్రేలుడు మనము లెక్క చేయనవసరము లేదు. నీవు తక్షణం తిరిగివెళ్లి ఆదుర్మార్గుడగు ఆచార్యులను బలవంతముగా యిచ్చటకు తీసికొని రావలెను.

విద్యా:-స్వామీ! కొంచెము ఓపిక పట్టుడు. న్యాయము విచారించు నప్పుడు మనుష్యుల యొక్క వయస్సుతో గాని, కులముతో గాని, రంగుతో గాని, మనకు సంబంధములేదు. మనము న్యాయము చేయవలసి యున్నది. ఆపిల్లవాడు గొప్ప పండితుడై యుండవచ్చును. మనము వానికి అవకాశ మెందుకివ్వకూడదు? ఆపిల్లవాడు అల్లరి పిల్లవాడని తేలిన అప్పుడు మనము శిక్ష విధించవచ్చును.

రాజు!-విద్యావతీ! ఆచిన్నపిల్లవాడు మన కోలాహలుని ఓడించ గలడనియా నీ అభిప్రాయము లేక కోలాహలునికి పిల్లవానికి జరుగు తమషా చూచుట నీఉద్దేశమా

విద్యా.-వారియొక్క హాస్యము వినుట నాఉద్దేశముకాదు. మనము చేయుపనివల్ల మన ప్రజ లెవ్వరికిని కష్టము గలిగించ కూడదు. పిల్లవాడు భాష్యాచార్యుని బదులు వాదమునకు వచ్చెదనని వర్తమానము పంపినాడు. పిల్లవాడే వివాదములో మన కోలాహలుని గెలిచిన యెడల వాని గురువు తప్పక గెలుచునని వేరే చెప్పనవసరము లేదు. కాబట్టి మనము పిల్లవానికి అవకాశ మివ్వవలెను.

రాజు:-మంత్రీ! నేను రాణిగారి సలహా ప్రకారము నడిచెదను. తక్షణం పల్లకీ బ్యాండు ఛత్రము పంపి యమునను మర్యాదగా కోర్టుకు పిలిపింపుము.

(రాజు, రాణి నిష్క్రమింతురు.)

(యమునాచార్యులు ప్రవేశము తరువాత రాజు, రాణి వచ్చెదరు.)

యమున:-(రాజుగారికి నమస్కారముచేసి) నాపేరు యమున నేను భాష్యా చార్యులవారి శిష్యుడను మహారాజా! మా ఆచార్యులవారిని కోలాహలునితో వాద వివాదములకు పిలుచుట ఒక పెద్దపులిని నక్క పిలుచుటవలెనుండును. నేను కోలాహల పండితునితో వాదము వేసికొని వానిని ఓడించగలను. కాబట్టి రాజా! ఆచార్యులవారి తరపున నేను కోలాహలునితో వాదవివాదములు చేయుటకు సెలవిమ్ము.

రాజు:-నీవు పిల్ల వాడవు, కోలాహలుడు, పండితులను జయించిన పండితుడు నీవు వానితో ఎట్లు వివాదముచేయగలవు.

విద్యా :- తెలివికి వయస్సుకు సంబంధములేదు. మన పురా

ణములందు కూడ చిన్నపిల్లలు గొప్ప ఆశ్చర్యకరమైన పనులు గావించినట్లు వినియున్నాము. కాబట్టి న్యాయ శాస్త్ర రీత్యా మనము పిల్లవానికి కోలాహలునితో వాద మునకు అనుజ్ఞ యీయవచ్చును

రాజు:-నీవు యిచట చాలకాలము కూర్చుండుటవల్ల అలసట జెంది యిట్లు మాట్లాడుచుంటివు లేమగదా!

రాణి:-లేదు, కోలాహలుడు యీ పిల్లవానిని జయించినయెడల నేను మీకు దాసినయ్యెదను.

(రాజు ఆశ్చర్యమును పొందును.)

రాణి:-స్వామీ! ఈ పిల్లవాడు జయించగలడని నా అంత రాత్మ నాకు చెప్పుచున్నది.

రాజు:- (మంత్రులవంకచూచి) ఈ పిల్లవాడు గెలిచిన యెడల నా రాజ్యములో అర్ధరాజ్యము వీనికిచ్చెదను. కోలాహలా! ఇంక వాదవివాదములు ప్రారంభింపుము.

కోలా:-ఓచిన్న పిల్లవాడా! నీకు అక్షర జ్ఞానమున్నదా! నీ పేరు నీవు సరిగా వ్రాయగలవా! నాతో సమానముగ గద్దెపై ఎందుకు కూర్చున్నావు. నేలమీద నిలబడి నేనడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పుము.

యమున:-ప్రియమైన పంతులుగారూ! ఒకచిన్న నిప్పురవ్వ ఒకపెద్ద గడ్డిమేటును మంట పెట్టగలదు. కాబట్టి గర్వము కొంత తగ్గించుకొని నన్ను మీకు వేయవలసిన ప్రశ్నలు వేయుడు. నన్ను ఓడించిన తరువాత నన్ను మీరు దూ షించవచ్చును

కోలా:-అయితే ప్రపంచ మంతటిలోను ఎక్కువ తీపి గల వస్తువేది ?

య:-కోలాహలా! ప్రపంచ మంతటిలోను తియ్యటి పదార్థము భగవంతుని యొక్క నామ సంకీర్తనయే. అంతకంటె యెక్కువ తీపి గల వస్తువేదియును లేదు.
హరేరామ హరేరామ రామ రామ హరే హరే
హరే కృష్ణా హరే కృష్ణా కృష్ణ కృష్ణ హరే హరే
ఓ పండితులు గారూ! చూడండి ఎంత తీపిగా నున్నదో!
(రాజు మంత్రులు యీ మహామంత్రమును సంకీర్తన చేయుదురు)

కోలాహలుడు:- (ఆశ్చర్యముతో) ప్రపంచ మంతటిలోను ఎక్కువ ఆశ్చర్యమైన వస్తువేది ?

యమున:-ఓ కోలాహలా! ప్రపంచ మంతటిలో ఎక్కువ ఆశ్చర్యకరమైన వస్తువు మాయ. ఈ ఆశ్చర్యమైన శక్తివలన కొంతమంది జనులు వారు గొప్పవారమనియు శక్తిగల వారమనియు తలంచెదరు. మాయవలననే గర్వము పొగరుబోతుతనము, అహంకారము నీవంటి పండితులలో కలుగును. శృతులలో చెప్పినదేమన బ్రహ్మజ్ఞులుకూడ వారికేమియు తెలియదని ఊహించెదరు. (అప్పుడు రాణీ మంత్రులు-ఆహా! ఆహా॥ అని కేకలు వేయుదురు) కోలాహలుడు (తెల్లబోయి)నీవు నన్ను నేదైనను ప్రశ్న వేయుడు. జవాబు చెప్పెదను.

యమున:-ఓ కోలాహలా! నేను రెండు విషయములు తెల్పెదను. నీ శక్తియున్న వాటిని నిరాకరింపుము. (1) నీ తల్లి

గొడ్రాలు కాదు. (2) రాజుగారు సద్గుణము గలవారు. (3) రాణిగారు పతివ్రత ఇవి నీవు నీరాకరించగలవా? అప్పుడు రాజు మంత్రులు రాణి నొకరివంక నొకరు ఆశ్చర్యముతో చూచుకొందురు)

కోలాహలుడు:-(తనలో తాను ఈ విషయములు స్థిరమైనవిగా కనుపించుచున్నవి. నన్ను నా తల్లి కన్నది. కాబట్టి నా తల్లి గొడ్రాలు కాదు. ఇక రాజుగారు సద్గుణములు లేనివాడని గాని రాణి పతివ్రత కాదనిగాని ఎట్లు చెప్పగలను. ఈ పిల్లవాడు నన్ను విషమ సంధిలో పెట్టినాడే. (మౌనము వహించును)

రాజు:-యమునా! కోలాహలుడు మౌనము దాల్చినాడు. కావున నీవు చెప్పిన విషయములు ఖండించుటకు నీవే తగిన కారణము చెప్పవలసియున్నది. అట్లు చెప్పిన నీవు యీ వాదములో గెలిచినట్లెంచబడును.

యమున:-మంచిది. ఒకచెట్టు తోట కానేరదు. ఆ ప్రకారమే ఒక స్త్రీ ఒక కుమారునే కనినయెడల ఆమె గొడ్రాలని చెప్పవలసి యున్నది. కోలాహలు పండితులు వారి తల్లికి ఒక్కడే కుమారుడు కాబట్టి అతని తల్లి గొడ్రాలు. రెండవ విషయమై శాస్త్రములలో చెప్పినదే. మన రాజు తన ప్రజలయొక్క పాపములన్నిటిలో భాగము పంచుకొనును. కాబట్టి రాజు అంతయు పూర్తిగా సద్గుణవంతుడని చెప్పుటకు వీలులేదు. ఇక మూడవ విషయమై చెప్పవలసి యున్నది. (రాణిగారి ముఖారవిందము చెమటతో కూడి కన్నులు మూతపడి మూర్ఛపొందిన ఆమెవలె నుండెను) ఓ రాజా ప్రతి స్త్రీని వివాహకాలమందు అగ్ని దేవునకు

వరుణునకు ఇంద్రునకు యిచ్చి తరువాత నొక మనుజుని భర్తగా నేర్పరచెదను. కాబట్టి ఆమె ఖచ్చితముగా పవిత్రురాలని చెప్పుటకు వీలులేదు. (సభాంతరాళములో చప్పట్లు. రాణి లేచి పిల్లవానిని కౌగిలించుకొనును.) 'హే అలవందర్! నీవు నిజముగ నన్ను రక్షించుటకు వచ్చినావు. (అప్పుడు కోలాహలుడు సిగ్గుతో తలవంచుకొనును)

రాజు:-యమునా! నీవు చిన్నపిల్లవానిగా కనిపించుచున్నను నీ బుద్ధికుశలత చాలపెద్దది. నా అర్ధరాజ్యమునకు రాజు అగుటకు తగినవాడవు. ఈ నిముషమునుండి నీవు రాజ్యము చేయుము. కోలాహలుడు నీకు బానిసయై యుండును.

(విద్యావతివైపుకు తిరిగి) ప్రియమైన విద్యా! ఈ పిల్లవానియొక్క తెలివితేటలు కనిపెట్టుటకు నీకు అంతరదృష్టియు మాత్ర దృష్టియు కల్గియున్నావు. నేను అజ్ఞానములోనున్నాను.

యమ:-పూజ్యులైన ఓరాజా! ఇది అంతయు ఆభగవంతుని యొక్కయు నాపూజ్య గురువగు భాష్యాచార్యుల యొక్కయు కటాక్షమువల్ల నేను యీ గర్వపోతగు కోలాహలునిపై జయము పొందగల్గితిని. ఇది అంతయు నాగురు కటాక్షమే. జయగురు శివగురు హరిగురు రాం। జగద్గురు పరమగురు సద్గురు శ్యాం। ఆదిగురు అద్వైతగురు ఆనందగురు ఓం। చిత్ గురు చిత్ ఘనగురు. చిన్మయగురురాజిఓంగురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుగురుదేవో మహేశ్వర గురుసాక్షాత్ పరబ్రహ్మతస్మైశ్రీ గురువేనమః॥ మూకంకరోతివాచాలం పంగుంలంఘయతే గిరిమ్. యత్కృపాత మహం వందే పర

మానంద మాధవం ॥ (యమున సింహాసనముపై కూర్చుం డును. అందరు వానికి నమస్కరించెదరు)

(కోలాహలుడు యమున కాళ్ళక్రింద మట్టి నెత్తిపై చల్లు కొనును. భాష్యాచార్యులువచ్చి యముననుకౌగిలించుకొనును)

భాష్యా:-ప్రియమైన యమునా! ఇక్కడ జరిగిన విషయమం తయు నదేశన్ విని నాతో చెప్పినాడు. అతడు నీవు ఓడి పోయి శిక్షింపబడుదువని అనుకొనెను. కాని ప్రియమైన పిల్లవాడా! నీవు మాఅందరివలెను పూజింపదగినవాడవు. నీవు కోలహాలుని బారినుండి అనేకమంది పండితులను రక్షించినావు. నీవుచిరంజీవివి అగుదువుగాక! నీవు ప్రపంచ సౌఖ్యము లన్నియు అనుభవించి చివరకు ఆత్మజ్ఞానము పొందుదువుగాక. భగవంతుడు నిన్ను ఆశీర్వదించుగాక.

యమున:-(గురువుకాళ్ళకు వందనము చేయును.) గురువర్యా! ఇదంతయు మీ కటాక్షముగదా! (నమస్కరించును.)

## 2 వ రంగము - 1 సీను

(రాజా అలవందరుకోర్టు. రాజు వచ్చి కృష్ణవిగ్రహమునకు ప్రణా మముచేసి కూర్చుండును.)

సంకీర్తన : రాధే గోవింద ఘనశ్యాం

రాధేరాధే గోవింద। రాధేగోవింద।రాధేగోవింద.

మంత్రి వివేకస్వరూప:-(రాజుగారివంక చూచి) తమరు ఆ ప్రకారముగా నున్నారు ఆరోగ్యము లేదా, దర్బారువైద్యుని కబురుచేయమనెదరా ?

రాజు:- వివేకా అక్కర లేదు. నేను బాగానే ఉన్నాను.

మం:-స్వామీ! మీ ముఖమునుబట్టి చూడగా మీకు కొన్ని రోజులనుండి కులాసాగా నున్నట్లు కనుపించుటలేదు. అది యేదియో నొక స్వల్ప అస్వస్థతయని మిమ్ములను ఆ విషయమై అడిగియుండలేదు.

అల:-భగవంతుని దయవలన నాఆరోగ్యము బాగుగానున్నది. మీకు ధన్యవాదములు.

మం:-మహారాజా! మేమందరము మీ నౌకర్లము. మీఆజ్ఞ ప్రకారము నడుచుకొనువారము. మీరు రాజ్యమునకు వచ్చిన తరువాత సుఖించుచున్నాము. తమ రాజ్యములో ప్రజలకు శాంతి గలదు. న్యాయవిచారణచేయు కోర్టులకు అవసరముకనిపించుటలేదు. కొన్ని హైకోర్టులు జిల్లాకోర్టులు తీసివేయుటకుకూడ శిఫార్సులు వచ్చియున్నవి. ఈ సంవత్సరముపంటలుకూడ సమృద్ధిగాపండినవి. పోలీసు సిబ్బంది కూడ తగ్గింప బడినది. కాని మహారాజా! దుర్మార్గుడగు నొకరాజు మనపై దండెత్త సూచన కనుపర్చినాడు దాని విషయమైన ధనము సేకరించుటకు ఆర్థికమంత్రిగారు తగు ప్రయత్నము చేయుచున్నారు.

అల:-వివేకస్వరూపా! నీవు ప్రజల సౌఖ్యము విషయమై చాల ప్రయత్నము చేయుచున్నావు. బయట శత్రువులతో యుద్ధము చేయవలసి వచ్చినదని నామనస్సు కొంత కించగా నున్నను అంతర శత్రువులతో పోరాడుటలో నామనస్సు చాల క్షోభ జెందుచున్నది. మన రాజ్యములో పూర్ణమైన శాంతియున్నను నా మనస్సుకు శాంతిలేదు. నా అంతర శత్రువుల యిష్టానిష్టములను నేను గెలువ

వలసియున్నది. నాకు యీ రాజ్యసౌఖ్యము లెందుకు? సుగంధగల పదార్థములు మెత్తని పరుపులు విధేయులగు నర్తకులు నాకు ఎందుకు? నాకు యీ మంత్రులు యేమి సహాయముచేసినారు? భగవంతుడే నాకు సహాయము. సరే ఇంక రాజ్యకారకనిర్వాహణవిషయమై విచారింతను.

మంత్రి:- కొంతకాలము తమకు సంగీతము వినుటకు కోరిక యున్నయెడల మధురముండి కీర్తన చేయువారు కొందరు వచ్చినారు. వారిని పిలిపించెదను.

అల:- మంచిదిమంత్రీ! నీవుచాలసూక్ష్మబుద్ధికలవాడవు తక్షణం వానిని పిలిపింపుము. (సంగీతపాటకులు వచ్చెదరు.)

అల:- భక్తులారా! మీరు సరియైన సమయమునకేవచ్చినారు. నా హృదయము ఆందోళన కలిగియున్నది. నాబాధ మీ భగవన్నామ సంకీర్తనతో కొంత ఉపశమింపచేయును)

సంకీర్తన . జయకృష్ణహరే జయరామహరే జయమురవధన ఘనశ్యామహరే

రామ హరే జయ రామ హరే శీతారామ హరే రఘురామహరే॥

(రాజుకండ్లవెంట నీరు కారును.)

అల - చాల ఆనందముగా నున్నది. వివేకా! వీరికి మంచి పారితోషికమిమ్ము. వారికి నాగదిప్రక్కనే ఉండుటకు బస యిమ్ము. వారి సౌఖ్యము లన్నియు చూడుము.

మం:- దేవరవారి ఆజ్ఞలప్రకారము నడిపించెదను. (ప్రణామము చేసి వెళ్లును.)

## 2 వ సీను – రాజుగారి భోజనశాల

(రాజుగారు భోజనము చేయుటకు కూర్చుండును. నవుకరు విసరు చుండును. వంట మనిషి భోజన పదార్థములు తీసికొని వచ్చును. లోపల సంకీర్తన)

సంకీర్తన:–ఓం నారాయణ ఓం నారాయణ లక్ష్మీనారాయణ

అల:– రామం (వంటమనిషి పేరు) ఈ కూర లోగడ చాల రుచిగా నుండెడిది. ఈ రోజున యేమియు రుచిలేదు. ఆ లోటు కూరలోనున్నదా ! నా నాలుకలో నున్నదా ?

రామ:–స్వామీ! ఒకముసలివాడు ప్రతిదినము ఒకదివ్యామృత వేరునాకిచ్చి అదికూరలోవేసి వండి పెట్టునట్లుగా చెప్పివెళ్లు చుండెను. ఈ ప్రకారము రెండు వారములునుండి జరుగు చుండెను. ఏకారణమువల్లనో యీ రోజునరా లేదు. చాల వరకుచూచినాను. ఇంకను వేచియున్న చాల ఆలస్యమగు నని యీ రోజున ఆ వేరు లేకుండ కూర పచనము చేసితిని.

అల:–ఆమనిషి ఎవరు ? నీవు వారపేరు అడిగితివా ?

రామ:–అతడు తనపేరు 'మనక్కాల్ నంబి' యనియు అతడు నివసించు స్థలముకూడ తెలిపెను.

అల:–నీ భోజనమైన వెంటనే తప్పక వానిని నావద్దకు తీసికొని రమ్ము

రామ:–చిత్తము (అని నమస్కరించి రామం వెళ్ళి పోవును)

అల:–ఓ భగవానుడా ! నాబాధ యెటులనున్నదో చెప్పలేను. సౌఖ్యముతో బాధ కూడా వృద్ధియగుచున్నది. సౌఖ్యము కంటె బాధ అనేకరెట్లు కనుపించుచున్నది. ఒక అణా

సౌఖ్యమునకు 15 అణాల బాధ కలిగియున్నది. భగవం తుని కటాక్షమువల్ల నేను రాజునైతిని. మంత్రులు ప్రజలు నౌకర్లు నన్ను ప్రేమించుచున్నారు. నా ఆజ్ఞలు తప్పక నెరవేర్చుచున్నారు. కాని నాకు మనశ్శాంతి కనుపించదు. ఆలోచించి చూస్తే నేను రాజుకాక పూర్వము వీధి బడిలో పిల్లవానిగా నున్నప్పుడే చాల సౌఖ్యముగా నున్నట్లు తోచుచున్నది. బాహ్యసౌఖ్యములు వృద్ధియైన కొలది మానసిక బాధలు ఆపుర్దాలు అశాంతి యెక్కువైనవి. నే నిప్పుడు రెండుయుద్ధములు చేయవలసి వచ్చినది. బయట శత్రువులతోను అంతర శత్రువులతోను, ఓ భగవంతుడా! నాకు మనశ్శాంతి ఎందుకు కల్గించవు. నన్ను రాజుచేసి ధనమువల్ల సంపదవల్ల సౌఖ్యము కలుగదని నీతి తెల్పితివి. ఓ దయాస్వరుపా! నాకు శాంతి మార్గమునకు త్రోవ చూపుము.

(రామం, పావనపురుషుడు ప్రవేశము)

(సంకీర్తన) శ్రీమన్నారాయణ నారాయణ నారాయణ లక్ష్మీనారాయణ నారాయణ నారాయణ.

రామ:- మహారాజా! ఆ బ్రాహ్మణుడు వచ్చి యున్నాడు. (రాజులేచి నమస్కరించి అతడు కూర్చున్న తరువాత తాను కూర్చుండును)

అల:- ఓ పావనపురుషా! ఇంతవరకు నేను మీ పరిచయము చేయలేక పోతిని. కాని రాముడు మీరు యిచ్చిన వేరుష యోగించుటవల్ల నాలుక తృప్తి గలుగుచుండెను. కాని ఆ బాహ్య రుచితోపాటు ఆత్మ వికాసముకూడ కలుగ

చుండెను. మీరు చేసిన ఉపకారమునకు ధన్యవాదములు నేను మీకు యెట్టి ప్రత్యుపకారము చేయవలయునో తెలియుట లేదు. మీ రేమి కోరిన అది నేను యిచ్చుటకు సిద్ధముగా నున్నాను.

నంబి :- నేను నీ వద్ద ధనము తీసికొనుటకు రాలేదు. నేను నీకు ధనమున్న ప్రదేశము చూపించుటకు వచ్చినాను. దానికి నీవు ముఖ్య వారసుడవు.

అల:-(ఆశ్చర్యముతో) ఏమి ! నేను ఆదనమునకువారసుడనా? ఎట్లు ఆధన మెచ్చట నున్నది? నాకిప్పుడు యుద్ధము చేయుటకు ధనము చాల అవసరము. మీరు తప్పక భగవంతుని వలన పంపబడినారు

నంబి:-శ్రద్ధగా వినుము. నాదమునియనుపేరుగల ఒకమహాత్ము డుండెడివాడు. అతడు పరమ భక్తుడు. అతడు నీ తాత. వాని శిష్యుడను నేను. నా పేరు మనక్కాల్ నంబి. అతడు చనిపోవునప్పుడు నన్ను దగ్గరకు పిలిచి ఈ ధనముయొక్క గొప్ప రహస్యము నాకు చెప్పెను. నీవు పెద్దవాడవైన తరువాత అది నీకు యివ్వమని చెప్పినాడు. ఇప్పుడు సమయము వచ్చినది. నీవుకూడ ఆ ధనము కొఱకు ఆదుర్దా పడుచున్నావు.

అల:-పూజ్యమైననంబీ. మీరుచాల దయాస్వరూపులు. ఆధనమెచ్చట నున్నది నాకు తెలియుపర్చుము.

నం:-ఓరాజా ! ఆధనము రెండునదుల మధ్యనున్నది. ఒకపెద్ద పాము దానిని కాపలాకాయు చున్నది. ఒక మంత్రమున్నది. అమంత్రముచ్ఛరించిన మీకు ఆ ధనము లభ్యమగును.

కాని మీతాతగారు చెప్పిన నొక షరతుగలదు. ఆధనము వద్దకు చేరక పూర్వము నీవు పవిత్రమైన హృదయము కలిగి ప్రేమతో ఆత్మశక్తితో నిండియుండవలెను. నీకు యీ గుణములు కలవా ?

అల.- ఏనంబీ! నీవు చెప్పినగుణములు నాయందున్నవి. త్వరగా వచ్చి ఆధనమునాకు చూపుము. నా ప్రియమైన తాతగారి కోరిక ప్రకారము నీవు చెప్పిన విధమున చేసెదను.

నంబి:-ప్రాపంచిక పదార్థములయందు ఆశవదులు కొనుము. నీ రాజ్యము వదిలి వేయుము. నీశరీరమున్నంత వరకు నీ మంత్రులు నీ నవుకర్లు నీవు చెప్పిన ప్రకారముఆడుదురు. నీ బొందినుండి ప్రాణము పోయినత రువాత శవము వంక చూడనైనచూడరు. అసహ్యించు కొనెదరు. నీవుజాగ్రత్తగా పెంచిన దేహము బూడిదపాలగును. మన్ను మన్నులో కలసిపోవును. అదిరాజునకునైనను, కూలీకైనను నొకటియే. ఈ సంగతి తెలిసికొనుము. భగవంతుని యందు శ్రద్ధ నమ్మకము లుంచుము. వాని పాదపద్మములకు నీ హృదయము సమర్పింపుము. తీవ్రమైన ఆవేదనతో భగవద్దర్శనము కోరుము. నావెంటరమ్ము. నీకిప్పుడు ఆధనము కనపర్చెదను.—

అల:-పూజ్యమైన గురుదేవా! నీవు బోధించిన జ్ఞానము గ్రహించితిని. ఇదిగో తమ వెంట వచ్చెదను. రామా! తక్షణం వివేకస్వరూపుని పిలువుము.

రా.-చిత్తము. (వెళ్ళి వివేకస్వరూపునితో ప్రవేశించును.)

వివే:-స్వామి! ఏమి ఆజ్ఞ.

అల:- నేను ముఖ్యమైన పనిమీద వెళ్లుచున్నాను. ఈ భక్తు నితో వెళ్ళుచున్నాను. నేను లేనిసమయమందు నీవు రాజ్యమునడుపుచుండుము. నీవు పాలనాపద్ధతులయందు తెలివిగలవాడవు. నాకు నీయందు నమ్మకమున్నది. రాజ్యమందు నొక్క వ్యక్తికికూడ అన్యాయము జరిగినదని బాధపడకుండ పాలింపుము. ఇదిగో నాముద్దర (అని రాజముద్దర యిచ్చును.)

వివే:- మహారాజా !

అల:- అన్నిసంగతులు తెలిసికొనెదవు. ఇప్పుడు వెళ్ళుము. (వివేకుడు ప్రణామముచేసి వెళ్ళును.)

అల:- ఓ నంబీ! నేను సిద్ధముగా నున్నాను.

సంకీర్తన : నారాయణం భజోనారాయణం లక్ష్మినారాయణ నారాయణం। భుక్తిముక్తిదాయకం నారాయణం జయసిద్ధి ప్రదాయకం నారాయణం। అజ్ఞాననాశనం నారాయణం భజోజ్ఞానసుభాస్కరం నారాయణం। పాపనివారణం భజో పతితపావన నారాయణం॥

3 - వ రంగము 1 - సీను

దక్షిణ ఇండియా మన్నారుగుడి దేవాలయము గుడి ముందర నంబి రాజు నుండురు.

(నంబి సంకీర్తన చేయును)

గోపాలా గోపాలా గోకులనందన గోపాలా గోపాలా గోపాల దేవకినందన గోపాలా యదుకుల తిలకా గోపాల

యాదవనందన గోపాల వేణువిలోల గోపాల విజయ గోపాలా గోపాల నవనీత చోర గోపాల గోపాల గోపాల గోకులనందన గోపాలా॥

నంబి:-(దేవాలయ గోపురము రాజుకు చూపును) అది మను జుడే కట్టినాడనియు అట్టి మనుజులచే నిండియున్న యీ ప్రపంచ మంతయు భగవంతుని సృష్టిలో ఒక అణుమాత్ర మని తెలిసికొనుము. మరియు మాయయొక్క శక్తి యెట్టి దనగా మనము యీ శరీరము గొప్పచేసి దానికి అవసర మైన పంచభక్ష్య పరమాన్నములు బెట్టి విలువగల దుస్తు లిచ్చి దానిని అలంకరించెదము (దేవాలయము లోనికి పోయి రాజ గోపాలుని దర్శించి గోపాలు నుద్దేశించి) గోబృందములకు రాజా! కాదు కాదు. నీవు గోపికల హృదయమునకు కూడ రాజువు. నేను ఎల్లప్పుడు నిన్ను నా హృదయ కమలమునందు దర్శింతును గాక. స్వామి! తమరు అర్జునునకు గీతద్వారా బోధించినది సరిగా అర్థము చేసికొని దాని భావము ప్రకారము నడుచుకొనుటకు నాకు శక్తి ప్రసాదించ కోరుచున్నాను. స్వామీ! నీకు అనేక ప్రణామములు చేసెదను నా మనవి యొకటి కలదు. నే నెప్పుడును నిన్ను మఱచిపోకుండ నాకు వరమిమ్ము.

(సాష్టాంగ ప్రణామము చేయును. రాజు ఆశ్చర్య నిమగ్ను డగును. కొన్ని ప్రదక్షిణములు చేసి సంకీర్తన చేయుదురు) శ్రీకృష్ణ గోవింద హరేమురారే హేనాథ నారాయణ వాసుదేవ। హరేరామ హరేరామ రామరామ హరేహరే హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే.

(తరువాత యిద్దరు నొకచోట కూర్చుందురు.)

నంబి:-ఇచ్చట మనము గీతాపారాయణ చేయుదము. గీత విలువ చెప్పవీలులేదు. ఓ రాజా శ్రీకృష్ణుడు నా తండ్రి. గీతనాతల్లి. ఆమె నా ఆత్మను పోషించును. శ్రద్ధగావినుము గీత చదువునప్పుడు మనము తదేక చిత్తముతో నుండవ లెను. చదివి నప్పుడెల్ల మన శరీరమందుగల పాత సంస్కారములన్నియు నశించుచుండును. చివరకు మనస్సు నిర్మల మగును. నేను యీ గీతను ప్రతిదినము చదువు చుందును. గీత ఎల్లప్పుడు నావద్ద నుండును వేదములు ఉపనిషత్తులు శాస్త్రములు వీటి అన్నిటి సారము. ఇది ఏడువందల శ్లోక ములలో నిమడ్చబడియున్నది. ఇది చదువుట సులభమే గాని అర్థము స్పష్టముగా కనుపించుచున్నను దాని యందు గూఢార్థము గలదు.

(గీత చదువును. రాజు తదేకనిష్టతో వింటూ కూర్చుండును)

రాజా ! నీవు గీత శ్రద్ధగా విన్నావా ?

రాజు:-గురుదేవా వింటిని. అమృత ప్రవాహమును గ్రోలితిని. తనివితీరలేదు ఇంకను త్రాగవలెననియే కోరుచున్నాను. దయచేసి గీతారహస్యములు నాకు తెలవిండు.

నంబి:- గీత కేవలము సామాన్య పుస్తకము కాదు. గీతకు అనేకవిధములుగా అనేక మంది మహాపురుషులు అనేక వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. గీత ఉపనిషత్తులను తరచితీసిన మీగడవంటిది. దానిలో ఆత్మ విషయమై అంతయు చెప్పబడినది. నీవు గీతయొక్క తత్వము బోధ పర్చు కొనవలెను.

రాజు -గురుదేవా ! మీరు నాకు గీతయొక్క తత్వము బోధ పర్చ కోరుచున్నాను.

రాజు గీతలోని నొక శ్లోకము చదువును

సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

నంబి.–ఇచ్చట భగవంతుడు వాని భక్తులకు గమ్యస్థానము చేరుటకు మార్గము తెల్పుచున్నాడు. వారిని మాత్రమే నమ్మి వారినే తలచువారికి పూర్తిగా క్షేమ మిచ్చెదనని చెప్పుచున్నారు. ఇక్కడ శ్రీకృష్ణుడు తనను చేరుటకు మార్గము చెప్పియున్నారు. అది పూర్ణమైన శరణాగతము. జాగ్రత్తగా వినుము. పూర్తి శరణాగతము. దీనినే ఆత్మనివేదనయని కూడ అందురు. ఇది పవిత్రునికేగాని శక్యము గానేరదు. మరియు పవిత్రతపొంది స్వల్పాభరహితుడై స్వామిసేవ చేయవలెను. పూర్తిశరణాగతము చాల కష్టము. అది భక్తిమార్గముయొక్క అంతిమదశ. ఈ ఆత్మనివేదన యోగికి కూడ కలదు. యోగి అందరిలోను ఆత్మస్వరూపమే నున్నదని వారికి సేవచేయును. అట్టి వ్యక్తి తాను పనిచేయుటలేదనియు అంతయు భగవంతుడే చేయుచున్నాడనియు తాను నిమిత్తమాత్రుడనియు యెంచును. అట్టివానియందు అహ ముండదు అతడు దివ్యకటాక్షము వల్ల కప్పబడును. ఎన్నడును అతడు సోమరిగానుండ లేడు. అతడు వచించు ప్రతిమాట చేయు ప్రతిపని యూహించు ప్రతియూహ సోదరులగు మానవులందరకును కల్యాణ కారణమగును. (రాజు వాని కాళ్ళపై బడును. తరువాత లేచి కదలక మెదలక శిలావిగ్రహమువలెనిలబడియుండును)

రాజు:-(తనలో తాను) ఈగీత చదివినతరువాత నా మోహము నశించినది. నేను భగవంతుని ప్రతిచోటను చూచు

చున్నాను. నా హృదయము పవిత్రమైనది. నాకు శాంతి తృప్తి కలిగినది. నా గురువుగారు నాకు క్రొత్తజీవిత మిచ్చి నారు. (స్వృహతప్పి పడిపోయి కొంతవడికి తెలివిపొంది నంబికాళ్ళపై బడును.) తమరు నాయందు కటాక్షము గలిగి నన్ను తమ శిష్యునిగా పరిగ్రహింపుడు. నాదంతయు భగవంతుని కర్పించెదను. వారిసేవ చేయుచు వారిని స్తోత్రము చేయుచు వారిని ధ్యానము చేయుదును. నేను యింక రాజ్య విషయమై తలపెట్టను. నన్ను ధనము లన్నిటికి ధనముగానుండుదాని యొద్దకు తీసికొని పొమ్ము.

నంబి:-ఓరాజా! నీ యొక్క భక్తికి వివేకమునకు ఏకాగ్రతకు సంతసించితిని. తప్పక ఆ ధనము నీకుచూపించెదను.

(సంకీర్తన)

కృష్ణంవందే జగద్గురు శ్రీకృష్ణంవందే జగద్గురు

## 3 వ రంగము 2 సీను

(శ్రీరంగము నంబి,రాజు కలిసి సంకీర్తన చేయుదురు)

హరినారాయణ హరినారాయణ హరినారాయణ హరి నారాయణ హరిభజ నారాయణ హరేరామ్ గోపాలం గోవిందం మమ జీవనం। హరేరామ గోపాలం గోవిందం మమ జీవనం హరేరామ గోపాలం గోవిందం మమ జీవనం

నంబి:-ఓరాజా! మనము ధనముండు చోటునకు వచ్చితిమి కాలము పరుగెత్తుచున్నది. భగవంతుని ప్రార్థించి వాని నామము పాడుము. (సంకీర్తన)

నేను చూపించు ధనమునకు అంతు లేదు. అది శాశ్వతము. తరుగునది కాదు. సంతోషము ఆనందము దానినుండి వచ్చును. అవిజ్ఞానమునకు శక్తికిని స్థానము. చూడుమదిగో కావేరినది. (రెండవవైపు చూపి) అదిగో కోలరూన్ నది. ఈ రెండు నదుల మధ్య ఆ ధనమున్నది.

రాజు:-ఆ దేవాలయ మెవరిది ?

నంబి:-రంగనాథునిది. స్వామి దర్శనమునకు, ప్రదక్షిణము చేసి వెళ్ళుదము.

(రాజు మూర్తినిచూసి మ్రొక్కును)

నంబి:-ఇదియే నే జెప్పిన ధనము. ఈ ధనమే రంగనాథుడు. నీ హృదయము పవిత్రమైనది. నీమనస్సు నిశ్చలమై యున్నది. ఇప్పుడు నీకు నొక రహస్యము చెప్పెదను. అది యొక మంత్రము 'ఓం నమో నారాయణాయ'. ఇది అష్టాక్షరీమంత్రము. ఇది నీవు ప్రతినిత్యము జపించిన ఆనందములో మునిగిపోదువు.

రాజు:-మీరు నాధనము చూపించిరి. ఇప్పుడు నా అంతరశత్రువులగు కామ క్రోధ లోభ మదమాత్సర్య దుఃఖ అహంకారము మొదలగునవి నానుండి తొలగిపోయినవి. నీ మంత్రోపదేశమువల్ల ఆశత్రువులను రూపుమాపగలిగితిని. ఇదియే కుండలిని. ఇది యిళాపింగళ మధ్యనుండును. ఓ రంగనాథా! నీవు తప్ప నా కెవరును కనిపించుట లేదు. నా అహం పోయినది. నేను నీవాడను. ఓం నమోనారాయణాయ ఓ నంబీ నీవు ఎక్కడ ఉన్నావు ?

(రాజు నంబికొఱకు వెదకును.)

సంబి:-(రాజుతో) ఇప్పుడు నీపేరు అలవందరు సార్థకమైనది. నీవిప్పుడు ప్రపంచమంతటికి ప్రభువవు.

రాజు:-(సంబికి సాష్టాంగపడును.) ఇదంతయు తమ కటాక్షము నే నింక రాజ్యమునకు రాను. నే నిచ్చటనే భగవంతుని సేవ చేయుచుందును.

(నంబి, రాజు సంకీర్తన చేయుదురు.)

హరిహరి బోల్ బోల్ హరిబోల్ । ముకుందమాధవగోవిందబోల్
హరిహరిబోల్ హరిహరిహరిబోల్ । కేశవమాధవ గోవిందబోల్ ॥

# XII దివ్య జీవ న ము

## 1 వ రంగము – 1 వ సీను

సంకీర్తన : రామహరే శియరామరామ్ । కృష్ణహరే రాధే
శ్యామ్‌శ్యామ్
శ్రీ గోకుల రహానేవాలే । జయజయ నందలాల్
మఖంమిస్రీఖానేవాలా । మోహన్ మురలీ బంసీ
వాలా॥

## దివ్యజీవనము 1 రంగము 2 వ సీను

(సంసారీనాథ్ అతని భార్య మోహిని ప్రవేశము)

మో:-ఈ నెలలో హరిద్వారంలో కుంభమేల జరుగుననియు అచ్చటకు చాల మంది వచ్చెదరనియు చెప్పెదురు. అప్పుడు గంగాస్నానము చేయుట మంచిదని పెద్దలు చెప్పుదురు. మనము కూడా అక్కడకు వెళ్ళకూడదా?

సం:-కుంభమేల 12 సంవత్సరముల కొకసారి జరుగును. లక్షల కొలది జనులు వచ్చెదరు. బసకు భోజనమునకు చాలా యిబ్బంది. మరియు యీ సమయమున అచ్చట కలరా మొదలగు అంటురోగములు ప్రబలును. మనము యింకొక సారి వెళ్ళెదము.

మో:-నిన్న నాస్నేహితురాలగు హరిదాసి తాను తన భర్తతో కూడా అక్కడకు వెళ్ళుచున్నామనియు అక్కడకు అనేకమంది మహాత్ములు వచ్చెదరనియు వారి దర్శనము చేసికొన వచ్చుననియు చెప్పినది. మనకు వారి మంచి సహాయము ఉండును. అదిగాక అట్టి మంచిపని చేసిన మనకు సంతానము కూడా కలుగవచ్చును.

సం:- మంజీత్ సింగును నేను బాగా ఎరుగుదును. అతడు తన భార్యతో వెళ్లుచుండిన మనము కూడా వెళ్లవచ్చును.

(మంజీత్ సింగు, హరిదాసి ప్రవేశము)

మ:-నమస్కారమండి. మీరు మీభార్యా సహితం వెళ్ళదలచు కున్నారని నాభార్య చెప్పినది. ఆ సంగతి నిజమైన మనము కలసి వెళ్ళవచ్చును.

సం:- దయచేయండి. మేము ఆవిషయమే మాట్లాడు చున్నాము. మనమంతా కలసి వెళ్లితే ఒకరి కొకరు సహాయముగా నుండవచ్చును.

(మోహన్ దాసితో)

సోదరీ మీరు వెళ్ళుచున్నారని తెలిసి మావారితో కూడ చెప్పి ఒప్పించినాను మంచిది. రేపుసాయింత్రము 6 గం

ఉల రైలుకు వెళ్ళెదము. అందరు స్టేషను వద్ద కలిసి కొనెదము.
సం:-మనము అక్కడ గొప్ప మహాత్ములను చూడవచ్చును.

3 - సీను రైలులో

(సంసార్ నాథ్ మోహిని, మంజీత్ సింగు హరిదాసిని ఒక బెంచిపైన కూర్చుందురు. ఎదుట బెంచిపై సుందరదాసు మాయవతి అను యింకొక దంపతుల జంట కూర్చుందురు)

(సంసారనాథ్ వగైరాలు కీర్తన చేయుదురు)

శ్రీకృష్ణ గోవింద హరే మురారే హేనాథ నారా యణ వాసుదేవ

సుందరదాస్ మాయవతి వారినిజూచి నవ్వుదురు.

సుందర:-మీ కీర్తన వల్ల మాచెవులు బొక్కలు పడచున్నవి. ఎందుకు మీరు యీ ప్రకారము తోటి బాటసార్లను బాధ పెట్టెదరు.

సంసా:- స్నేహితుడా! క్షమింపుము. మా సంకీర్తన వల్ల మీకు కష్టము గలిగినదా. సంకీర్తన చాల జబ్బులను పోగొట్టునని చెప్పుదురు. మరియు యాత్రలకు పోవువారు సాధారణముగా నామ సంకీర్తన చేయుచు పోయెదరు

మాయ:-సోదరుడా! మీరు భగవంతుడని చెప్పువాడు నిజముగ నున్నచో అది అమాయకుల నమ్మించి కొంత లబ్ధి పొందుటకు తెలివి గలవారు కల్పించినయుక్తి. నేను భగవంతుడున్నాడని నమ్మను.

హరి:- చెల్లెలా! మనము హిందువులై యుండి యిట్టి నిరీశ్వర వాదులగుట చాల శోచనీయము. మన పిల్లలుకూడ మన వలెనే తయారై పాడగుదురు.

మాయ:- చదువురాని పూర్వాచారపరాయణులు కొందరు యీ విధముగా దానముక్రింద చాలడబ్బు వృధాగా ఖర్చు పెట్టించుచున్నారు. నావంటి ఆధునిక స్త్రీలు ఎవరికంటికి కనుపించనట్టి విషయములు నెన్నటికిని నమ్మరు.

మో:-నీవు పంచదారతీపిగాని, మల్లెపువ్వుల సువాసనగాని సూదిమొక్క పోటుగాని యిట్టివని వర్ణన చేయగలవా ? ప్రాకృతిక అనుభవములే నీవు వర్ణన చేయలేనప్పుడు మనస్సు బుద్ధిమొక్క సూక్ష్మములు నీవు యెట్లు విమర్శించ గలవు. ఇవికూడ అనుభవములే. నీవు నీ భర్తను, సోదరిని, తండ్రిని వివిధరీతులుగా ప్రేమించెదవు ఆరీతులలో భేదము లున్నవి. ఆ భేదములు నీవు వర్ణింపగలవా ? అట్టి పరిస్థితిలో భగవంతుని నామము స్మరించునపుడు గలిగించు ఆనందము వర్ణించుట చాల కష్టము. (స్టేజను వచ్చును అందరు దిగుదురు.)

(హరిద్వారము)

2 వ రంగము - 1 వ సీను.

(సంసార నాథమోహిని నొకగదిలోనుండగా ఇద్దరు బ్రహ్మచారులు యోగానందుడు, జ్ఞానానందుడు అక్కడకు వచ్చెదరు.)

(నారాయణోహరి)

యోగ:-ఓ స్నేహితుడా ! మీరు యీ తీర్థయాత్రకు వచ్చుట చాల అదృష్టము. మేము తపోవన ఆశ్రమమువారము

మా గురుదేవుడు కొంతమంది శిష్యులతో ఆశ్రమములో నున్నారు. మేము మా ఆశ్రమవాసులకై భిక్షకొఱకై యిక్కడకు వచ్చినాము.

సం:-చాల సంతోషము. మీవంటి బ్రహ్మచారుల దర్శనము వల్ల మేము ధన్యులము. దయచేయుడు. మీరు చాల దూరమునుండి వచ్చినారు. మీరు యిక్కడ భిక్ష తీసికొన వచ్చును. మీ ఆశ్రమమునకు పిండి, పప్పు వగైరాలు తీసికొని వెళ్లవచ్చును. (భార్యతో) ఇద్దరు బ్రహ్మచారులకు త్వరగా భిక్ష పెట్టుము.

మో :- ఇప్పుడే పెట్టెదను.

సం:-(బ్రహ్మచారితో) మహరాజ్ హరిద్వారములో మేలాకు వచ్చుటకు మాకు యిదియే మొదటిసారి ఇచ్చటేమి చేయవలెనో సెలవిండు.

యో :- నీవు తీర్థయాత్రలకు వచ్చినప్పుడు అవసరమైన కొద్ది సామానులు మాత్రమే తీసికొని రావలెను. పాత్రలు, దీపము, పరుపులు అక్కడ సప్లయి అగునని అనుకొనవద్దు ఒక జపమాల, చదువుకొనుటకు భగవద్గీత, కొన్ని పుస్తకములు, జపము చేసికొనుటకు జింకచర్మము దగ్గర నుంచుకొనవలెను. అన్ని చోట్ల యిష్టమైన పదార్థము లన్నియు తినకూడదు. అనుష్ఠానము చేయవలెను. పుణ్యదినములందు ఎంత జపము చేసిన నంతఫల ముండును. అనుష్ఠాన దినములందు పండ్లు పాలు మాత్రము పుచ్చుకొనవలెను. ప్రతిదినము మహాత్ములతో ఒకటి రెండు గంటల కాలము సత్సంగము చేయుము. గీతలో కొన్ని

అధ్యాయములు పఠింపుము. రెండు మూడు గంటల కాలము మౌనముగ నుండుము. ఉదయము రాత్రి ధ్యానము, జపము, ధారణ ప్రార్థనలో గడుపుము. నామమంత్రము కీర్తన చేయుము. ప్రతి రోజు చేయు సాధన మానకూడదు. యాత్ర స్థలములలో యెక్కువ సాధన చేయవలెను. ఇటుఅటు వృధాగా తిరుగకూడదు. దానము ధర్మము పుష్కలముగా చేయుము. మహాత్ములకు, బీద వారికి రోగులకు సేవచేయుము. మహాత్ములను సాధువులను దర్శించి వారికి పండ్లు ఫలములు యిమ్ము. వారివద్ద నీవు ఆధ్యాత్మిక విషయములు నేర్చుకొనుము. వారియొక్క పూర్వ జీవితములు తెలిసికొను ఆసక్తిగలిగి యుండకుము. ఈ ప్రకారము చేసిన కొద్దికాలములో నీకు ఆధ్యాత్మిక వృద్ధి యగును.

సం:-ప్రయాణీకులలో కొంత మంది మతము, భగవంతుని అవ సరముల విషయమై కొన్ని సందేహములు నాకు గలుగ జేసిరి. ఆ సందేహములు నేను తీర్చుకొనవలసియున్నది. దయచేసి మీరు నన్ను మీగురువు వద్దకు తీసికొని వెళ్ళెదరా ?

జ్ఞానా.-తప్పక తీసికొని వెళ్ళెదము వారు మీసందేహము లన్నియు తీర్చెదరు.

(సుందరరావు వచ్చును)

సుం:-సంసారనాథ్ - ఈ జాబరా రంగుబట్టలు ధరించిన యీ పెద్దమనుష్యు లెవరు ?

సం:-ఒక స్వామిజీ ఆశ్రమములోనుండు బ్రహ్మచారులు. వారు ఆశ్రమవాసుల బిక్షకై వచ్చినారు

సుం:-సంసారనాథ్, నీవంటి చదువుకున్న వారు కూడ యిట్టి భిక్షుకుల వల్ల మోసపోవుట చాల విచారకరము.

యోగ:-లాలాజీ! సన్యాసులు, బ్రహ్మచారులు సంఘమునకు ముఖ్యమైన భాగము. వారు సంఘమునకు నిజమైన సేవ చేయుదురు. వారు ప్రపంచవృద్ధికి కల్యాణమునకు కారకులు. వారికి సేవచేసి వారియొక్క అవసరములు కనిపెట్టి చూచుట గృహస్థుల కర్తవ్యము.

సుం:-ఈ కరువు దినములలో మాసంసార జీవనోపాదికి కావలసిన సొమ్ముకు, మా అవసరములకు కావలసిన సొమ్ముకు యిబ్బందులు పడుచున్నప్పుడు మీ వంటివారికి భోజనము పెట్టుటకు తగినంత సొమ్ము దాసుధ్యము ఆధునిక ప్రపంచమందలి ప్రజల వద్ద లేదు. వారే జీవనోపాదికి కావలసిన సౌఖ్యములకు కావలసిన సొమ్ము సంపాదించుటకు వారి శక్తిసామర్థ్యములు ఉపయోగించుకొనవలయును.

యో:-మానవజీవితము క్షణభంగురము. ప్రపంచసౌఖ్యములు శాశ్వతములుకావు. విద్యుల్లతవలె చంచలమైనవి. జీవితమందలి బలము కొద్దికాలము మాత్రమే యుండును. ప్రపంచవస్తువు లన్నియు దుఃఖస్వరూపములు. వీటివల్ల బాధయేగాని సౌఖ్యములేదు. నీవు కోరు భాగ్యము క్షణభంగురము. ధనము భార్యయందుగల కోరిక నీకు బంధన కలుగజేయును. నీకు నొక నిముషమందు సౌఖ్యము గలుగజేయువస్తువు లుత్తరక్షణమందు అసహ్యముగా తోచును కావున మనుజుడు ఆత్మయందే మనసు నిలిపి పరమశాంతిని పొందవలయును.

సుం :- కాని మీవంటివారు ప్రపంచమునకు అవసరమగు ధనము సంపాదించక సోమరులుగా జవితము గడిపెదరు.

జ్ఞా:- మేము ప్రపంచమునకు ఆధ్యాత్మికధనము కూర్చెదము. నిజమైన యోగి కర్మ యేమియు చేయనట్లు పైకి కనుపించు చున్నను కర్మ చేయువాడే. వానియందు ధ్యానమువల్ల, శాంతియొక్క సంపదయొక్క కిరణపరంపరలు ప్రపంచము నకు వెదజల్లుచుందురు. అయ్యా మీరు సరియైన మహా త్ములను కలియలేదు కాబోలు, సరియైనవానిని తెలిసి కొనుట చాల కష్టము.

యోగ:- మీరు ఒక్కసారి మా గురువుగారివద్దకువచ్చిన వారు మీ సందేహములు తీర్చగలరు.

సుం:- మీ గురువు గొప్పవారు కావచ్చును. మీరు ఎంతవరకు పరిశ్రమ చేసినారు.

యోగ:- నేను హఠాయోగము అభ్యసించితిని. ఆసనములు ప్రాణాయామములు ముద్రలు బంధనలు వేయగలను ధ్యాన ధారణలు అభ్యసించితిని. ఇప్పుడు చక్రములు విప్పుట ప్రయిత్నించు చున్నాను. నేను 10 సంనుండి బ్రహ్మచర్య వ్రతము సలుపుచున్నాను.

జ్ఞాన:- నేను వేదములు, శిక్షకల్పము, వ్యాకరణము, నిరుక్తము, జ్యోతిషము, ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు మొదలగు వేదాంతగ్రంధము లన్నియు చదివినాను. నేను వేదాంత శాస్త్రముయొక్క ఆధిక్యత ఋజువు చేయగలను.

సుం:- అంతాబాగానే ఉన్నది. మీరెప్పుడైనను కలలోగాని

జాగ్రదవస్థలోగాని భగవంతుని చూచినారా ? ఐనను మీతోనాకు యీ వాదవివాదము లెందుకు ?

(వెళ్ళిపోవును)

సం:- ఈప్రపంచమంను ఈమానవజన్మయొక్క యుద్దేశ మేదియో తెలియకున్నది. ఆహారము తినుటయు, నిద్రపోవుటయు మాత్రమేనా ? ఇంతకంటె అధిక ఉపయోగమేమైన యున్నదా ? స్వామిజీ, ఈ విషయమై తగిన సమాధానము చెప్పుదురని నేను నమ్మెదను.

మోహి :- స్వామిజీవద్దకు వెళ్ళిన వారు మన సందేహము లన్నియు తీర్చెదరు.

సంసా:- మీరు శ్రమయని తలపక మధ్యాహ్నము యిక్కడకు వచ్చి మమ్ములను స్వామివారి వద్దకు తీసికొని వెళ్ళుడు.

జ్ఞా:- తప్పక వచ్చెదము 'శెలవు' ఓంనమోనారాయణాయ

2 వ రంగము 2 వ సీను

(స్వామిజి ఆశ్రమము - స్వామిజీ దుప్పి చర్మముమీద - కూర్చుండును ఆత్మానందుడుండును)

స్వామిజీ:- ఆత్మానంద, జ్ఞానానందుని యోగానందుని హరి ద్వారము కుంభ మేలకు భిక్ష నిమిత్తం పంపినాను. అచ్చటకు వారిని పంపుటలో నా ముఖ్యోద్దేశము అక్కడ దివ్యజీవన పద్ధతి అభ్యసించుటకు ఆసక్తి గల గృహస్థులెవరైన నున్న యెడల అట్టివారిని కలుసుకొని నివృత్తి మార్గము వారికి బోధ చేయుటయే. ఇదియే సన్యాసులు చేయవలసిన కర్తవ్యము.

ఆత్మా:-స్వామి, ఈ రోజులలో అట్టివారు దొరుకుట బహు అరుదు. మేలాకు వచ్చువారు సాధారణముగ అచ్చట సంతోషముతో కాలము గడుపుటకు వత్తురుగాని జ్ఞానము సంపాదించుటకు వచ్చువారుండరు. జ్ఞానానందములు యోగానందుల పని చాలకష్టమైన పనియే.

స్వామీజీ:-నిజమే కాని లక్షల కొలది జనములో ఏ కొద్దిమందియైన మంచిసంస్కారములు గలవారుండకపోరు.

ఆత్మా:-స్వామిజీ! సరియైన అధికారికి నుండవలసిన లక్షణము లేవి?

స్వామి :- తల్లిదండ్రులందు భక్తి గలిగియుండవలెను. శాంతమైన మనస్సున జితేంద్రియత్వము, ఏకాగ్రతగల మనస్సు సాత్త్విక గుణములు గలిగి చతుర్విధ లక్షణములు గలిగియుండవలెను. నిరంతరము నిష్కామ కర్మచేయుచు ఉపాసన జపము పూజ సంకీర్తనవల్ల మనోవికారమును పోగొట్టుకొనవలెను. అన్నిటికంటె ముఖ్యమైనది బ్రహ్మశ్రోత్రియుడు బ్రహ్మనిష్ఠగల గురువుయొక్క సేవ చేయుటకు తత్పరుడై యుండవలెను. (జ్ఞానానంద యోగానందులు వచ్చి గురువుకు ప్రణామము చేయుదురు.)

యో :- ఓం నమోనారాయణాయ. స్వామిజీ మహారాజ్, మేము గృహస్థాశ్రమములో నుండి మంచి సంస్కారములు గల దంపతులను తీసికొని వచ్చితిమి. వారు మీ వల్ల కొన్ని సందేహములు తీర్చుకొనుటకు కోరుచున్నారు.

స్వామి:-మంచిది. వారిని తప్పక శ్రద్ధతో చూచెదను. అట్టివారికి సేవ చేయుటయే నా జీవితకర్తవ్యము. మంచిది

వారినిలోన ప్రవేశ పెట్టుము. (సంసారినాధ్ మోహిని వచ్చి స్వామి వారికి సాష్టాంగపడి వారి ఉత్తరువుల ప్రకారము కూర్చుందురు)

స్వామీజీ:-పిల్లలారా! స్వాగతము. యోగానందుడు మీ విషయమై చెప్పియున్నాడు. మీ సందేహములను తీర్చెదను. చెప్పుడు.

సంసా:-మనుజునకు యీజీవితముతో మాత్రమే సంబంధము గలదా లేక వానికి పూర్వ పరజన్మము లేవైనా ఉన్న వా? అట్టివి ఉన్నయెడల అవి వానికి యెందుకు తెలియవు?

స్వామి:-మనుష్య జీవితము అనేక జన్మలతో కూడియున్నది. అది శాశ్వతమైనది. ఈ జీవితములో బాల్యము యౌవ్వనము ముసలితనము యెటుల వివిధ భాగములుగా నుండునో ఆప్రకారమే చావు, పుట్టుక జీవితములో మార్పులై యున్నవి. మొదటి మూడును ప్రకృతి సంబంధమైనవి గనుక యింద్రియములకు తెలియబడుచున్నవి. చివర రెండును సూక్ష్మము గనుక యింద్రియములకు తెలియబడునవికావు. సూక్ష్మమైన పవిత్రమైన స్థిరమైన మనస్సుగల యోగిసంస్కారములు లేక చిత్తము యొక్క సంయమ అభ్యాసమువలన తనయొక్క పూర్వ జన్మలు యితరుల పూర్వ జన్మలు తెలిసికొనగలడు. కాబట్టి జీవితము అంతు లేకుండా నుండును. మనకు ముందు గల్గు జన్మ మనము లోగడ చేసికొనిన మంచి చెడ్డ కర్మలపై ఆధార పడి యుండును.

సంసా:-మనుజుడు వాని కర్మను బట్టి అనేక శరీరములు పొందుచుండునని తెలిసికొంటిని. కాని శాస్త్రముల యందు పితృలోకమనియు గంధర్వలోకమనియు స్వర్గలోకమనియు చెప్పబడియున్నవి. ఆ ప్రకారము మన లోకముగాక యితరలోకములుకూడ నున్నట్లు ఎట్లు చెప్పగలము ?

స్వా:-ప్రపంచములో 14 లోకములున్నవి. అవి భూమితో కలిసియున్నవి. 7 పైన ఉన్నవి. 7 క్రిందయున్నవి. మనము దూర దేశములను స్టీమర్ల సహాయముగాని, విమానసహాయముగాని లేనిది చూడలేము. ఈ లోకములుకూడ చూడలేము. అవి ప్రాకృతిక శరీరముతో చూడలేము. సూక్ష్మ శరీరములతో అవి చూడవచ్చును. మంచిపనులు చేయువారు ఊర్ధ్వలోకములకును, చెడుపనులు చేయువారు అధోలోకములకును పోవుదురు మనుష్యునియొక్క మేధస్సు తెలివి సంకుచితము బలహీనముగ నుండును. కాబట్టి మన యింద్రియములచేతను, బుద్ధిచేతను సాధ్యముకానివి లేవని చెప్పకూడదు.

సం:-నేను భగవంతుడున్నాడని నమ్ముదును. కాని భగవంతునికి మనుజునికి నుండు సంబంధ మెట్టిదో నాకు స్పష్టముగా తెలియుటలేదు. మనము భగవంతుని ఎందుకు జ్ఞాపకముంచుకొని పూజ చేయవలెను.

స్వామి:-అగ్నికి, అందుండి బయటకు వెడలు అగ్నికణములకు ఎట్టి సంబంధము గలదో సూర్యునికి వానియొక్క కిరణములకు యెట్టి సంబంధముకలదో అట్టి సంబంధము జీవునికి ఈశ్వరునికి కలదు. ఒక కుండయందలి ఆకాశము, దాని

బయటనుండు ఆకాశము నొకటియేగదా. ఆ ప్రకారము ఆత్మకు పరమాత్మకు భేదములేదు. జీవుడు అవిద్యయను తెరచే కప్పబడియుండును. ఆ కారణమువల్ల జీవుడు తన నిజస్వభావమును మరిచి అహంవల్ల అనిత్యమగు ప్రపంచ సంబంధమైన పేర్లను రూపములను పొంది మంచి చెడ్డ కర్మలలో చిక్కుకొనును. తన నిజస్వరూపము తెలిసికొని ఆ పరమాత్మతో తాదాత్మ్యము పొందుటకొఱకు పరమాత్మయొక్క ఉపాసనపూజ అవసరము. అది చేయుట వలన హృదయము స్పటికమువలె పవిత్రమై దివ్యజ్ఞానము అలవడును.

పంసా:- అనాత్మవాదులు, జనసంఘవాదులు, నిరీశ్వరవాదులు మతము అనునది అనవసరమనియు మనము మంచి గుణములు కలిగి జీవించుచు మనకు ఉన్నది యితరులతో కూడ అనుభవించుచున్న చాలునని అందురు. వారి వాదము ఎంతవరకు సరియైనది.

స్వామి:-వారివాదన సరికాదు. జీవాత్మ పరమాత్మల యొక్క సంబందము వారు తెలిసికొనలేదు. మతమనగా భగవంతుని తెలిసికొని వానిని ప్రేమించుట యేర్పడిన శాస్త్రము. అది మనుజుని జీవితమునకు ముఖ్యఅవసరము.

పంసా:-స్వామిజీ, ఇప్పుడు అన్ని విషయములు నాకు బోధపడినవి ఇంక నేను వేయదగిన ప్రశ్నలు లేవు.

స్వామి:-బిడ్డలారా, ఇట్టి సందేహములు ఆధ్యాత్మిక సాధన చేయు వారికందరకు ప్రారంభమందు కలుగునవే. మీకు మంచి సంస్కారములు గలవు. మీరు సాధన అభ్యసించ

వలెను. నేను చెప్పబోవు ఆధ్యాత్మిక బోధ శ్రద్ధగావిని దాని ప్రకారము నడుచుకొనుడు. భగవంతునియందు మత గ్రంథముల యందు నమ్మకము లేని మనుజులతో కలిసి తిరుగవద్దు. అటుల చేసిన మీ మనస్సు భ్రమపొందును. సత్యము, బ్రహ్మచర్య, అహింస అభ్యసింపుడు. మితముగ మృదువుగ మాట్లాడుడు. కొన్ని గంటలు మౌనముగా నుండుము. గీత, రామాయణము, భాగవతము పఠింపుడు. పూర్వము ఋషుల జీవితము, ప్రపంచము వ్యక్తి, భగవంతుడు, చూడబడునది చూడబడనిది మొదలగు విషయములన్నియు విమర్శించిరి. వారు తపస్సు చేసి అంతర దృష్టి గలిగి ఆత్మవిచారణచేసి పవిత్రమైన అంతరాత్మను గురించి ధ్యానముచేసి బ్రహ్మసాక్షాత్కారము పొందిరి. వారి అనుభవములు ప్రత్యక్షములు ఏశాస్త్రము వల్లను నిరసించుటకు వీలులేనివి. వారు చేసిన నియమములు, సూత్రములు, పవిత్రమైన ఉపనిషత్తులలో నున్నవి. అవి మీరు చదువ లేని యెడల భగవద్గీత చదువుడు. ప్రాతః కాలమందుతప్పక ధ్యానముచేయుడు. ఏదో నొకమంత్రము నియమముగా జపింపుము. ఈ విధముగా నీవు దివ్య జీవనము గడుపుము. చేయవలసిన సాధన అంతయు ముక్తసరిగా చెప్పెదను.—బ్రహ్మ ముహూర్తమున ఉదయము 4 గంటలకు నిద్రనుండి లెమ్ము. రామనామము జపింపుము ప్రతి దినము రెండు గంటలు మౌనముగ నుండుము. ఏకాదశిరోజున ఆహారము భుజింపకుము. పాలు పండ్లు పుచ్చుకొనుము. ప్రతి దినము గీత నొక అధ్యాయము పఠింపుము. నీ ఆదాయములో 10 వ వంతు దానము

చేయుము. నీ ఆత్మబలము పైని ఆధారపడుము. నౌకర్లను నుంచుకొనకుము. రాత్రిళ్ళు కీర్తన చేయుము. సత్సంగము మంచిది. ఎట్టి కష్టము వచ్చినను నిజమే పలుకుచుండుము. ధర్మము రక్షించుకొనుము. సత్యముపలుకుము. ధర్మమాచరింపుము. బ్రహ్మచర్య విడువకుము. అహింసయే పరమ ధర్మము గనుక అందరిని ప్రేమింపుము. ఇతరుల మనస్సు నొప్పింపకుము. అందరియందు దయగలిగి యుండవలెను. కోపము క్షమవల్ల అణచుకొనుము. విశ్వప్రేమ వృద్ధిచేసి కొనుము. ఆధ్యాత్మిక దినచర్యవ్రాయుము. ఈ ప్రకారము చేసిన నీవు త్వరలో వృద్ధి పొందుదువు.

(సంకీర్తన)

మోహన బంసీవాలా తుంకోలాఖో ప్రణామ్ ।
శంకర భోలో భావేతుం కేలాఖో ప్రణామ్ ।
తుమ్‌కోలాఖో ప్రణామ్ ప్రియారోక రోరో ప్రణామ్ ।
మోహన బంసీవేతుమ్ ఖోలాఖో ప్రణామ్ ॥

హరేకృష్ణ హరేరామ రాధేగోవింద రాధేగోవింద భజోశివా గోవిందహరి బోలోబోలో భాయిరాధేగోవింద్ ॥

(మోహినితో) ప్రియమైనబిడ్డా, నీవు ప్రతి దినము ఏదో మంత్రము జపించుచుండుము. రామాయణము చదివి సీత నడచిన ప్రకారము జరుపుము. నీభర్తకు సరియైన సేవ చేయుము, ప్రపంచ వస్తువులయందు ఎక్కువగా ప్రేమ ఉంచు కొనకుము. కృష్ణభగవానుని విగ్రహము నీగది యందు ఉంచుకొని దానిని పూజ చేయుచుండుము. ఆ పూజలో నీభర్తకూడా నీతో పాల్గొనవచ్చును.

సంసారి । మోహిని:-గురుజీ మేము ఏమంత్రము జపింపవల యును.

స్వామీజీ:-ఓం నమో భగవతే వాసుదేవాయ

(ఇద్దరు స్వామికి సాష్టాంగ ప్రణామము చేసి నిష్క్రమింతురు)

3 వ రంగము 1 వ సీను మంజీత్ సింగు సంసారినాథ్

మంజీత్:-స్నేహితుడా ! ఏమి యీ రోజున చాల ఆలస్య ముగా వచ్చినావు.

సంసా:-పూజ చేసుకొనుట ఆలస్యమైనది.

మంజీ:-ఎన్నడును మీరు పూజ చేసికొనరే ? క్రొత్త పద్ధతి అవలంభించినారే.

సంసా:-నిన్న మేము తపోవన స్వామిజీ దర్శనమునకు వెళ్ళి నాము. వారు చక్కటి బోధ చేసినారు. వారి సలహా ప్రకారము మేమిరువురముపూజ ప్రారంభించినాము. వారు నా సందేహము లన్నియు తీర్చినారు. ఆయన గొప్ప మహాత్ముడు. అట్టివారిని మనముఇది వర కెన్నడును చూచి యుండ లేదు.

మంజీ:-సోదరుడా ! మీకు అట్టి సద్గురువు దొరకుట చాల అదృష్టము. నేను కూడా వారిదర్శనము చేసికొన వలెనని యున్నది. నన్ను నాభార్యను కూడా యీ రోజు మధ్యా హ్నము వారివద్దకు తీసికొని వెళ్ళెదరా ?

సంసా:-సంతోషముతో తీసికొని వెళ్లెదను. వారు మనకు తప్పక స్వాగత మిచ్చెదరు. వారి దర్శనము వల్ల మీరు

చాల సంతోషించెదరు. మన మందరము ఆశ్రమమునకు వెళ్ళుదము.

## 2 వ రంగము 2 వ సీను

(స్వామివారి ఆశ్రమము సంసారినాద్ మోహిని మన్‌జిత్ సింగ్ హరిదాసి శీతారాం వచ్చి స్వామికి ప్రణామము చేసి కూర్చుందురు)

(స్వామి ఉపన్యాస మిచ్చును)

స్వామిజీ:-సోదరులారా! జీవితమన నెట్టిది? ఊపిరిపీల్చుట లేక ఆహారము జీర్ణముచేసి కొనుట మొదలగు క్రియలా? లేక ఆలోచన ప్లానింగు డబ్బు సంపాదన కీర్తి పేరు సంపాదించుటయా లేక పిల్లలను కని వంశము నిలబెట్టుటయా? లేక అన్నిటి యొక్క మొత్తమా? ప్రకృతిశాస్త్రజ్ఞులు, జీవశాస్త్రజ్ఞులు, శంకరునివంటి తత్వశాస్త్రజ్ఞులు దీని విషయమై వివిధమైన అభిప్రాయములు కనపర్చిరి. జీవితము రెండువిధములు. పదార్థములోనున్న జీవము ఆత్మలోనున్న జీవము శరీరశాస్త్రజ్ఞులు, జంతుదేహశాస్త్రజ్ఞులు, జీవితము ఆలోచనలోను తెలిసికొనుటలోను జీర్ణశక్తిలోను, నెత్తురు ప్రవహించుట లోను, ఊపిరి తీసికొనుటలోను ఉన్నదని అభిప్రాయబడుచున్నాను. ఇట్టి జీవితము భయము ఆదుర్దా కష్టము పాపము వయస్సు రుగ్మత చావుబ్రతుకు మొదలగు వాటితో కూడియున్నది. కాబట్టి ఋషులు మునులు దీర్ఘదర్శులు, తపస్వినులు అంతరాత్మ అనుభవము కలవారై త్యాగము తపస్సు వైరాగ్యము అభ్యాసము విరక్తిజీవనము మొదలగు వాటివల్ల మనస్సు స్వాధీనపర్చుకొని ఆత్మయందు జీవించుటయే శాశ్వతానందము శాంతి పరమ

సౌఖ్యము నిరంతరతృప్తి అమరత్వము యివ్వగలదని చెప్పు దురు. అట్టి ఆత్మ సాక్షాత్కారము పొందుటకు అనేక నిర్ణీత మార్గములువారు ఏర్పరచిరి అవి వ్యక్తులయొక్క కర్మమును బట్టి శక్తులను బట్టి రుచులను బట్టి మారు చుం డును. నీ యొక్క ఉత్కృష్టమైన కర్తవ్యము ఆత్మ సాక్షా త్కారము. ఇదియె మనుష్య జీవితమునకు గమ్యస్థానము దీనికే నిర్వాణము పరమగతి, పరంధామము బ్రహ్మస్థితి అను వివిధ నామములు చెప్పుదురు. దీనినిబట్టి మనము ప్రాకృతిక జీవితము నిరసించమనే ఉద్దేశముకాదు ప్రకృతి భగవంతుడు కల్పించినదే. అది వాని లీల. ప్రాకృతిక జీవితము బ్రహ్మయందు గలిగెడు శాశ్వత జీవితమునకు ప్రారంభ ప్రయత్నకదశ. ఈ ప్రపంచమందే దివ్య సద్గుణ ములగు దయ, క్షమ, సహనము, విశ్వప్రేమ, కారుణ్యము ధైర్యము, ఓర్పు, దాతృత్వము గంభీరత ఆత్మ శక్తి మొదలగునవి వృద్ధి చేసికొనుటకు వీలగు స్థలము. గీతయందును యోగవాసిష్టమందును ప్రపంచమునుండియే ఆత్మసాక్షాత్కారము పొందవలెనని చెప్పబడి యున్నది. ప్రపంచములోని జీవితము నీటిమీద తామరాకువలెనుండ వలెను. స్వప్రయోజన పరత్వము, కామము, క్రోధము, లోభము, ద్వేషము ఈర్ష్యలను విడిచి దివ్యస్వభావము అలవర్చుకొనవలెను. ఆత్మ సుఖబలిదానము మానసిక వైరాగ్యముగా జీవితము గడపవలెను. మానవ జన్మ కలుగుట కష్టసాధ్యము. కాన మనము ప్రయత్నించి యీ జన్మయందే తరించు మార్గము చూచుకొనవలెను.

కాలపురుషునకు అడ్డములేదు కాబట్టి మనము తొందరపడి యోగసాధన చేయవలెను. అటుల చేసిన మీకు పరమ శాంతి గలుగును. చీట్లపేక ఆడుట, సినీమాలు చూచుట పొగ పీల్చుట మొదలగు క్షణిక సుఖములతో కూడిన ప్రపంచ విషయములయందును పోట్లాటలు వృధా ప్రసంగ ములయందును కాలము వృధాపరచిన మీరు నిజమైన శాంతిని పొందలేరు. మీకు యీ దైనిక జీవిత యుద్ధమందు కొన్ని దెబ్బలు ఆపదలు గలిగినప్పుడు మీ మనస్సు అధ్యాత్మ మార్గమునకు తిరుగును. అప్పుడు యీ ప్రపంచ సౌఖ్యములందు అసహ్యతగలిగి మోక్ష మార్గము కోరు దురు. జీవించుట అనగా గమ్యస్థానముకొఱకుపోరాడుటయే జీవితము ఒక జయము. నీ యొక్క నిజమైన శత్రువులగు మనస్సును యింద్రియములను గెలువుము. నీ చెడు అల వాట్లు చెడు సంస్కారములు చెడు ఊహాలు చెడు వాస నలు జయించుము. ఈ జీవితము ఆత్మసాక్షాత్కారము పొందుటకు ఏర్పడినది కాన సరియైన సాధన సంకీర్తన చేసి ఆత్మానందము పొందుము. నిష్కామ్యకర్మ యోగము నీ హృదయము మనస్సును పవిత్రము చేయును. ఇంద్రియ ములను స్వాధీనపర్చుకొని నీ స్వరూప మందు విశ్రమింపు ము. అధ్యాత్మిక జీవితమనగా కళంకములేని సంతోషము ఆనందము. మంచి గుణములు అలవర్చుకొనుము. ఆత్మవిష యమై ధ్యానము చేయుట అభ్యసింపుము స్థూలశరీరము ఆత్మయని అను కొనవద్దు. అదిగొప్ప పాపము. ఆశలు ఆలోచనలు ప్రపంచమందలి కీర్తి విడిచిపెట్టుము కోరికలు చంపివేయుము. ఉపనిషత్తులు బాగుగా చదువుము అజ్ఞా నమును పోగొట్టు కొనుము అశాశ్వతమైన నామ రూప

ములతో సంబంధము కలిగియుండవలెను. నిజస్వరూపమైన ఆత్మను ప్రేమించి దానియందే జీవింపుము. బ్రహ్మమగుము. కర్మ యోగాభ్యాసము వల్ల మనస్సు వేదాంతము చదువుటకు వీలగు అధికారముగల మార్గములో పడును. అజ్ఞానులు కర్మయోగ మభ్యసించకుండ జ్ఞానయోగ మభ్యసించెదరు. అటుల చేసిన వారిమనస్సులలో మాలిన్యములు నిలిచియుండును. ఆత్మభావముతో దేశమునకు మానవజాతికి అంతులేని స్వలాభ శూన్యమైన సేవ చేయుటయే వేదాంతమందు కావలసిన ముఖ్యవిషయము. అందరిని ప్రేమించవలెను. విశ్వప్రేమ అభ్యసించవలెను. ప్రతికర్మయు పవిత్రమైన ప్రేమతో చేయవలెను. నిరంతరము దయతో కూడిన పనులు చేయుటవల్లనే అమరత్వము గలుగును. ద్వేషము, కోపము, యీర్ష్య, ప్రేమతో కూడిన హృదయముతో సేవ చేయుచుండిన అదృశ్యమగును. దయతో కూడిన పనులు చేయుచుండిన నీకు యెక్కువగా బలము సంతోషము తృప్తి గలుగును. అందరి వల్ల నీవు ప్రేమించబడుదువు. ధర్మ కార్యములు కరుణతో గూడిన సేవలు హృదయమును పవిత్రపరచి మృదువుగా చేయును. అప్పుడాహృదయపద్మము దివ్యజ్యోతిని పొందుటకు తగిన అధికారము గలిగియుండును. ఈ ప్రకారము మీరు నిస్వార్థమైన దివ్యజీవనము గడిపి ప్రపంచమందలి కర్తవ్యములు జరుపుచు శ్రద్ధతోను, భక్తితోను భగవంతుని నామస్మరణ చేయుచుండిన మీకు పరమశాంతియు, పరమసౌఖ్యమును గలుగును.

స్వామిజీ:-(సంసారితో) మీరు మీ స్నేహితులను తీసికొని వచ్చితిరా? మీరందరు దివ్యజీవన ఉపన్యాసము పొందిరి గదా. అదియే అన్ని వేదములకు సారము.

పండిత్:-మహారాజ్! నా స్నేహితుడు సంసారనాథ్‌వల్ల మీ యొక్క ప్రఖ్యాతి విన్నాము. మీయొక్క దివ్యమైన, ఆత్మోద్ధారకమైన ప్రసంగము విని ధన్యుడనైతిని.

స్వామి:-మీరందరు యీ జన్మయందే తరించవలెను. అదియే పరమ పురుషార్థము. నీభార్య చాల భక్తురాలు సంకీర్తన సమయమందు ఆమె పరవశము పొందినది. అట్టి భార్య మీకు గలుగుట మీ అదృష్టము. మీరు మీ మనస్సును యింద్రియములనుస్వాధీనము చేసికొనగలిగిరి. ఉపనిషత్తులు గీత పఠింపుడు. మీరు అధ్యాత్మవిద్యయందు వృద్ధి గాంచి సౌఖ్యమును పొందెదరు.

సేవారాం:-స్వామీజీ స్వప్రయోజనము లేనిసేవయందు నాకు చాల యిష్టము. దీని విషయమైన మీసలహాకోరుచున్నాను

స్వామి:-నిరంతర సేవవల్ల నీ హృదయము పవిత్రమైనది. కాని దానియందు భక్తిలేదు. కర్మయోగము భక్తియోగముతోగాని, జ్ఞానయోగముతోగాని మిళితమై యుండవలెను. పరాభక్తియే జ్ఞానము, ఈరెండింటిలో యేదియో యొకటి ప్రతిదినము అభ్యసించిన నీవు త్వరలో వృద్ధికి రాగలవు.

స్వామీజీ:-(హరిదాసితో) బిడ్డా! నీకు మంచి సంస్కారములు గలవు, నీ భర్తను నారాయణ భావముతో సేవింపుము సావిత్రి యొక్క మార్గము ననుసరింపుము. పాతి

ప్రత్యము, నమ్రత, లోని అందము, ఇవియే నీకు నిజ మైన ఆభరణములు. అవి జాగ్రత్తగా రక్షించుకొనుము. నీ భర్తయొక్క ఆధ్యాత్మిక వృద్ధియందు తోడ్పడుము. (అందరు స్వామీజీకి ప్రణామముచేసి నిష్క్రమింతురు)

## 4 రంగము

(స్వామీజీ వారి శిష్యులు, రామదాసు, ఆత్మానంద, యోగానంద, భక్తుడు సంసారినాథ్ ఉందురు)

స్వామీజీ:-తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపి మతోధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున
యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్భజతే యోమాంస మేయుక్తతమో మతః॥
రామదాసు, నీవు యీ శ్లోకము యొక్క భావము తెల్పుము.

రా:-భగవంతుని పాదపద్మముల యందు మిళితమైన హృదయముగల భక్తుడు పరివ్రాజకుడు. పండితులగు ఋషులు, ఫలము కోరక కర్మలు చేయువాడును, అందరికంటె గొప్ప వారు. అందులకు, భగవంతుని శ్రద్ధతో పూజించువాడే చాల మంచివాడు,

స్వామి:-ఆత్మానంద ఆశ్లోకమందర్థము నీవు నిర్వచింపుము.

ఆత్మా:- ఆత్మజ్ఞానము కలవాడు పరివ్రాజకుల కంటెను వేదములు తెలిసిన వారికంటెను కర్మయోగుల కంటెను గొప్పవాడు. భగవంతునియందు శ్రద్ధతో ఆత్మ సమర్పణ చేయువాడు యోగులందరిలో గొప్పవాడు.

స్వామిజీ:- యోగానందా! దీని విషయమై నీ అభిప్రాయము తెలియపర్చుము.

యో.గా:- యోగాభ్యాసము వల్ల కుండలిని మేల్కొలిపిన వ్యక్తి పరివ్రాజికు లందరికన్నను పండిత పురుషులందరి కన్నను, కర్మయోగు లందరికన్న గొప్పవాడు. అతడు శ్రద్ధతో కూడిన భక్తి గలవాడు గనుక అందరు యోగు లలో ఉత్కృష్టుడు.

సంసా:- ఈ ముఖ్య శ్లోకముయొక్క వివిధ విమర్శనలు విన్నాను. దయచేసి ఈ శ్లోకముయొక్క భావము తమరు తెలవియ్యమని ప్రార్థించుచున్నాను. మరియు వేదాంత విషయమైన బోధకూడకొంత మీవల్ల వినగోరుచున్నాను.

స్వామిజీ:- ప్రియమైన బిడ్డలారా! యోగి, పరివ్రాజికుని కన్నను, పండితునికన్నను గొప్పవాడని యెంచబడు చున్నాడు. పండితుల నగా శాస్త్రముయొక్క భావము తెలిసినవారు. అతడు (యోగి) కర్మయోగుల కంటెను అధికుడు. శరీరముయొక్కయు మనస్సుయొక్కయు వాక్కు యొక్కయు కాఠిన్యతగలవాడె తపస్వియనబడును. శాస్త్ర జ్ఞానము లేక పరోక్షజ్ఞానము గలవాడు జ్ఞాని. అగ్నిహో త్రము మొదలగు వేదవిహితమగు కర్మలు చేయువాడు కర్మయోగి. వీరందరికంటె శ్లోకములో చెప్పబడిన యోగి గొప్పవాడు. ఎందువల్ల ననగా అతడు అంతరదృష్టి ద్వారాగాని ప్రత్యక్షానుభవమువల్లగాని, నిర్వికల్ప సమాధివల్లగాని ఆత్మజ్ఞానము కలవాడు ఇట్టి ఉచ్చస్థితి అట్టి యోగి పొందును. యోగు లందరిలో ఎవరు పూర్ణమైన శ్రద్ధతో తన అంతరాత్మ భగవం

తునితో ఐక్యము చేసికొనునో, ఎవరు భగవంతుని పూజ చేయునో అట్టివాడు భగవంతుని దృష్టిలో గొప్ప భక్తుడు. ప్రియమైన బిడ్డలారా! శ్రద్ధగా వినుడు. అమరత్వము పొందుటకు యిదియే మార్గము. ఇందులో కొంత భాగమైన మీరు అభ్యసించిన యెడల మీకు మరణము, విచారము బాధ దాటి పోదురు. ఎల్లప్పుడు యీ విధముగా ధ్యానింపుడు. "నేను సచ్చిదానంద బ్రహ్మమును. నేను అచలుడను. స్వయం ప్రకాశకుడను. చావులేని ఆత్మ స్వరూపుడను 'మూడు అవస్థలకు (జాగ్రత్ స్వప్న సుషుప్తి) సాక్షీభూతుడను నేను శరీరము మనస్సు ప్రాణము ఇంద్రియములకు విశిష్టుడను. అయిదు పొరలకు అతీతుడను' నీవు త్వరలో బ్రహ్మసాక్షాత్కారము అనగా బ్రహ్మజ్ఞానము పొందగలవు. నీవు నీభార్య యందు కుమారుని యందు ఆస్తియందు శరీరమందు సంగము గలిగియుండిన అది బంధము. నీవు ప్రపంచమందలి యేవస్తువుతోను సంగము లేక పవిత్రముగ అమృత ఆత్మతో తాదాత్మ్యము పొందిన అదినీకు ముక్తి. కోరిక ఎచ్చట నున్న అచ్చట ప్రపంచ ముండును. కాబట్టి వివేకము, వైరాగ్యము అభ్యసించి బ్రహ్మము విషయమై ధ్యానము చేయుచుండి సుఖముగా నుండి నప్పుడు నీవుభావా (కోరిక) తీతుడవగుదువు. అహము, మమకారము లేకుండ జీవింపుము. ఇంద్రియములను లోబర్చుకొనుము మంచి మార్గమందు నడువుము. హృదయము పవిత్రము చేసికొనుము. సత్యము పలుకుము. ఆత్మయందే విశ్రమించి సుఖింపుము. ఈశరీరము నీవుకావని ఎప్పుడు తెలిసికొంటివో

అప్పుడు నీకు కర్మ, బానిసత్వము తొలగును. కోరికయొక్క బంధములనుండి విడిబడుదువు. లౌకికసంబంధమైన జీవితము దానితో కూడిన చెడుగులు బాధలు అను ఎండమావులు తొలగి పోవును. ఆపరమాత్మ లేక ఆత్మ అనగా ఎల్లప్పుడు శాశ్వతముగా నిలిచియుండి నశ్వరమైన ప్రపంచమునకు మూలాధారమై విభజింపశక్యముకానట్టిన్ని స్వయంప్రకాశమై నట్టియు- మార్పు లేక అంతటను వ్యాపించునట్టియు జాగ్రత్ స్వప్న సుషుప్తి మూడింటి యందు సాక్షిగా నుండునట్టియు స్థితియైయున్నది. ఆత్మ తెలిసికొనిన వాడు అమరత్వముపొంది ఆనందము అమృతముగల చోట ప్రవేశించును. అజ్ఞానివిషయ సౌఖ్యముల వెంటపరుగిడి చుట్టు నుండు నశ్వరజాలములో పడిపోవును. చీకటిలో నివసించును తఱుచుయముని స్వాధీనములో పడుచుండును. మోక్షమార్గమతనికి స్పష్టముగ తెలియదు. అతడు ప్రపంచవిషయములలో తగుల్కొని భ్రమలో నుండును. కాని వివేకము వైరాగ్యము కలిగిన ఓర్పుగల మనుజుడు ప్రపంచము యొక్క మిథ్యా సౌఖ్యములను కోరడు. అతడు పరమాత్మను ధ్యానముచేసి శాశ్వతా నందమును పొందును. నీకు మనోనిర్మాలిన్యము ధారణ నున్నయెడల నీమనస్సును యిష్టమైన భావనలో నుంచవచ్చును. నీవు శాంతికోరిన శాంతి కరుణకోరిన కరుణతో నీ శరీరము నిండియుండును. అధ్యాత్మమార్గము వివిధ కష్టములకు ఆశ్రయమైనది. దాని మార్గము పదునైన మంగలికత్తి అంచుపైన నడుచుట వంటిది. నీవు అనేకసార్లు పడిపోవుదువు. అయినను తిరిగి తొందరగా లేచి లోగడకంటె యెక్కువ పట్టుదల ధైర్యము

సంతోషముతో నడువవలెను. అధైర్యపడవద్దు. నీఅంత ర్యామియే నిన్ను ప్రోత్సహించి నడిపించును అందరుమునులు పావన పురుషులు రాబోవు విషయములు చెప్పువారు (prophets) గమ్యస్థానము చేరక పూర్వము మిక్కుట మైనకష్టను కఠిన పరీక్షలు అనుభవించవలసినదే. వివే కము గల మునులయొక్క మార్గము పాపరహిత మైనది. ముక్తికి మార్గము ప్రతి కర్మ పవిత్రమైన మనస్సుతో చేయుట, మంచిగుణములు కలిగి యుండుట, జితేంద్రి యత్వము గలిగి నిర్మలమైన స్వయం ప్రకాశమైన పరి చిన్నము గాని అంతటను వ్యాపించియుండు పర మాత్మను ధ్యానించుట. నీవు బ్రహ్మ సాక్షాత్కారము పొందిన నీ సందేహము లన్నియు తీరును. నీ హృదయ మందు పరమ తృప్తి గలుగును. రజస్సు తమస్సు నిన్ను విడిచిపోవును. నీవు ఎల్లప్పుడు శాంతముగాను సౌఖ్యముగాను నుందువు. కాబట్టి కష్టపడి అట్టి స్థితి యీ జన్మలోనే పొందుటకు ప్రయత్నింపుము. ఏది తెలిసిన యింక యితర విషయము లేవియు యుం డవో యేదిపొందిన యింక నేవస్తువును పొందుటకు ప్రయత్నించ నవసరములేదో ఏది పొందిన ఒక వ్యక్తి చావు లేక నిర్భీతిగా కోరిక లేకుండా పరమశాంతి సుఖముగా నుండునో అట్టి బ్రహ్మము లేక ఆత్మ లేక సత్యమే మన జీవితము. అదియే ఉత్కృష్టమైన ఆశయము. మీరందరు సారము గ్రహించితిరి గాన మీరు భగవంతుని కటాక్షము ద్వారాముక్తిమార్గములు నాల్గును పొందెదరుగాక. మీ రందరును యీ జన్మలోనే తరించి ఆత్మసుఖమే పొందెదరు

గాక (జ్ఞానానందుడు సుందరదాసు, మాయావతి, దేశి రాజు పెయిలాల్ మొదలగువారు ప్రవేశము)

జ్ఞా:-గురుమహారాజ్, వీరు హరిద్వారము వచ్చిన యాత్రీకులు. మహామహోపాధ్యాయ పండిత శేఖరశాస్త్రి గారు హిందూమతమును గురించి హరి ద్వారములో ఉపన్యాసము యిచ్చుచుండగా వారితో వీరు పోరాడినారు. వీరికి కొన్ని విరుద్ధమైన అభిప్రాయములు గలవు. వారి అభిప్రాయములు సరిచేయు నిమిత్తము వారిని తమ వద్దకు తీసికొని వచ్చినాము

స్వామి:-పండిత్ జీ బాగా చదువుకున్న వ్యక్తి వారితో పోట్లాట పెట్టుకొని వారి ఉపన్యాసము మధ్య ఆపుచేయుట మంచిపనికాదు. అయిన మీ ఆక్షేపణలు యేమియో నాకు తెల్పిన యెడలమీకు నాకు తెలిసినంత వరకు సరియైన సమాధానములు చెప్పెదను.

సుంద:-స్వామిజీ। ఈ జీవితమందు మతముయొక్క అవసరమేమియు లేదని నా అభిప్రాయము

మాయావతి:-విద్యావిషయ పరిజ్ఞానముగల యీ కాలమందు అట్టిది అనవసరమనియే నా అభిప్రాయము

దేశరాజ్:-సద్గుణ సంబంధమైన కృషి, సాంఘిక సేవయు మాత్రమే మానవజాతియొక్క ఉద్ధరణకు చాలునని నా మతము.

స్వామి:-మీ కందరకు ధన్యవాదములు. మీరందరు చదువుకున్న వ్యక్తులు.సంస్కృతి పొందుచున్నవారు. మీయొక్క దృష్టి పశ్చిమ నాగరికతయొక్క తళుకుచే మిరుమిట్లు గలిగి

నది. మీరు మీ దేశముయొక్క యధ్యాత్మిక చరిత్ర తెలిసికొనలేదు. అందువల్ల మతముయొక్క ప్రాముఖ్యత ఆవసరము తెలియ జాలక యున్నారు. నిజస్థితి యేమన పూర్వకాలమునుండి మనుజుడు సౌఖ్యముల కొఱకై వెదకులాడు చుండును. ఇది మనుజస్వభావము. ఎందువల్ల ననగా అసౌఖ్యముగా నుండుటకు నెవరికిని కోరికయుండదు. చరిత్రవల్ల మనకు తెలియునది యేమనగా మనుజుని యొక్క ప్రయత్నము లన్నియు వృధాయైనవి. ప్రపంచ సంబంధమైన సౌఖ్యము లన్నియు అనిత్యములనియు మిధ్య యనియు తేలినది. ఆత్మ సాక్షాత్కార మొక్క దానియందే సౌఖ్యము కలదని వశిష్ట, యాజ్ఞవల్క, వ్యాస. శుక మొదలగు గొప్ప మహర్షులు మన పవిత్ర గ్రంథముల ద్వారా యీ సిద్ధాంతము తేల్చినారు అందువల్లనే మన జీవితమందు మతము అవసరమని స్థిరపర్చినారు. కేవలము సద్గుణములు గలిగియుండుట సంఘసేవ, భగవంతుని యందు ప్రేమ లేనిదిమానవజాతియొక్క ఉద్ధరణకు చాలదు. అది ఒకవైపు వృద్ధికి మాత్రమే తోడ్పడును. చివరకు జ్ఞానమునకు కారణమగు. భగవద్భక్తిలేని మనుజుడు పూర్ణత పొందనేరడు. జ్ఞానభక్తి కర్మయోగముల ద్వారా తల, హృదయము చేయి సమానముగా వృద్ధి కావలెను. వివేకము వైరాగ్యము ఉండవలెను. ముక్తి కొఱకు మనః పూర్వకముగ భగవంతుని ధ్యానింపుడు. మీరుత్వరగా వృద్ధి పొందగలరు.

అందరు. సరే స్వామిజీ, మీరు చెప్పినది. సబబుగానే కన్పించు చున్నది.

స్వామి:-బుద్ధితో సంబంధించిన వ్యాగ్రూపమైన ఆమోదము చాలదు. మీరు యేదో యొక విధమైన సాధన చేయవలెను. అది ఆరుమాసములు అభ్యసింపుడు. మీయందు క్రొత్త మార్పు గలుగును. నేను చెప్పిన ఉపదేశముల ప్రకారము మీ దైనిక జీవితమందు కొంత కాలము అభ్యసింపుడు. అప్పుడు మీయొక్క మార్పు మీకే తెలియును. మీరు భాగవతులై హరినామము ప్రపంచము యొక్క అన్ని మూలలను వెదజల్లుదురుగాక (అందరు స్వామికి ప్రణామము చేసి స్వామి వారి భక్తులై దివ్య జీవనము గడుపుట ప్రారంభించెదమని వ్యాఖ్యానము చేసి వెళ్ళిరి)

(ఓం సద్గురు పరమాత్మనే నమః - ప్రార్థన శాంతి పాఠములు)

## నా మ మ హి మ

(మూర్ఖరాజు, ప్రేమదాస్, దయాల్ చంద్, జ్ఞానదేవు ఆశ్రమమునకు వత్తురు)

మూ:-స్వామీజీ! భగవంతుని నామము తఱుచుగా జపించుటచే గలుగుఉపయోగమేమియో తెలియజాలకున్నాను. జీవితములో నేదైన నొకవస్తువు సాధించ వలసివచ్చిన ప్పుడు దాని యందు మనస్సుధారణ చేయుట అవసరమే. కాబట్టి తత్త్వజ్ఞానము సంపాదనకు ధ్యాన ధారణలు అవసరమని చెప్పవచ్చును. నామము అనేక సార్లు జపించుట నాకు నచ్చలేదు. అది విజ్ఞానవిరుద్ధముగ నాకు కను

పించు చున్నది. అనేక మంది రామ్ రామ్ పూసల దండలు త్రిప్పుట చూచితిని. దాని వలన వారికి గలుగు లాభమేమి ? దీని విషయమై మీ అభిప్రాయము నాకు చెప్పకోరెదను.

(అప్పుడు 12 సం॥ వయస్సుగల యొక బాలుడు పెద్దపులి యని అరచుచు ఆశ్రమములోనికి వచ్చెను.)

మూర్ఖ:-దయాల్ నా రివాల్వరు తెచ్చిపెట్టుము.

ప్రేమ:-దానిని చంపవద్దు. మన మెచ్చటనైనను దాగు కొనెదము.

దయాల్:-స్నేహితులారా ! ఆడవాండ్రను జాగ్రత్తగా నొక సురక్షితమైన స్థలమునకు తీసికొని వెళ్ళవచ్చును.

జ్ఞాన:-నేను ఆ పెద్దపులిని చూడనిమ్ము (పెద్దపులి జ్ఞానదేవుని వద్దకు వచ్చి నిలుచుండును. నెమ్మదిగా పరుండును? దానిపై నుండి పులి చర్మము క్రింద పడిపోవును. ఒక పెద్ద కుక్క కనుపించును. అప్పుడు జ్ఞానదేవుడు అందరిని బిగ్గరగా పిలుచును. అందరు వత్తురు)

జా:-స్నేహితులారా ! దీనికి యింత పెద్దగందరగోళము చేసినారు॥ అదియొక పెద్దకుక్క. ఇప్పుడు మీ ప్రశ్నకు మంచి జబాబు కుదిరినది.

మూర్ఖ:-అదియెట్లు ?

జ్ఞాన:-పెద్దపులి పేరు విన్నంత మాత్రమున యిక్కడ నున్న మనుష్యులలో ఎంత ఆందోళన గలిగించినదో చూడుము. నీవు దానిని రివాల్వరుతో కొట్టుటకు ఆలోచించినావు.

ప్రేమ దాసువాగివాడు దయాల్ చందు స్త్రీలనుసురక్షితమైన స్థలమునకు తీసికొనివెళ్ళమని చెప్పినాడు. నేను ఆ పెద్దపులి యెట్టిదో చూడ నుద్దేశించితిని. పెద్దపులి అను మాటకే యిట్టి మార్పులు అందరి మనస్సులలో కలిగినప్పుడు భగవంతుని నామము యెట్టిమార్పులు కలిగించునో ఆలోచింపుము.

మూర్ఖ:-నిజమే కాని స్వామీజీ చావు బ్రతుకుల వ్యవహారము కలిగినప్పుడు అట్టి మార్పులు రావచ్చును. మమూలు సందర్భములో మాటలవల్ల అట్టి జాగ్రత్తలు అనవసరము గదా !

జ్ఞాన:-స్నేతులారా ! మీ చిన్నతనమునందు మీకు మాటలు యెటుల వచ్చినవి? తలిదండ్రుల వల్లను స్నేహితుల వల్లను గురువుల వల్లను నేర్చుకొనిరి. పెద్దవాళ్లైన తరువాత కొన్ని ఊహలు కలిగి వాటిని ప్రకృతి చట్టముల వలనను ధ్యానము వలనను వృద్ధి చేసికొందుము. మాటలు ఉపయోగించక యెట్టి జ్ఞానమును మనకురాదు. ఇది ప్రాకృతిక చట్టము.

మూర్ఖ:-అవును.

జ్ఞాన:-ఏడు భూమికలు మాటలవల్ల వర్ణించి వాటివిషయమై యితరులకు సరియైన మాటలవలన బోధపరిచెదను. పశ్చిమ విజ్ఞాన శాస్త్ర ప్రకారము ధ్వని గాలి లేక యీథర్ లో అలల వలన గలుగు నందురు. హిందూ శాస్త్రప్రకారము ధ్వని 'నాదబిందు' అను పదార్థము వల్ల బయలు వెడలు నని చెప్పుదురు. ఇది భగవంతుని యొక్క-సూక్ష్మమైన శక్తి యనియు అది ప్రపంచము సృష్టించి

పోషించి లయింప జేయుననియు చెప్పెదము. మంత్ర ముల యొక్క కంపనములు ప్రపంచము ప్రకటితమై నప్పుడు చులుకగానుండును. ఒక్కొక్క ధ్వని యొక్కొక్క అధ్యాత్మికశక్తి. అది బహి ప్రపంచమునందు కొన్ని స్థిర రూపములుగా కనపడగలదు. ఈవిషయము ప్రయోగ ముల వలన ఋజువు చేయబడినది. కాననొక మంత్రమనగా గుంభనగనున్న నొక జ్ఞానసమూహము. అది కొన్నినాళ్లు ఉచ్చరించిన విడివడి ప్రకటితమగును. ఆమంత్రము కొన్ని సార్లు ఉచ్చరించిన అందు ఉద్దేశింప బడిన వ్యక్తియొక్క రూపము స్వభావము తెలిసికొన వచ్చును. ప్రతి మంత్రము నకు ఒక ప్రత్యేకదేవత మూలాధారముగ నుండును. సాధకుని కర్తవ్యము ఆమంత్రము యొక్క ధ్వనిని దేవత యొక్క రూపముతో సంబంధము కలుపుటయే. నట్లనే మనగా 'తలంచు చుండుము. అది నీవగుదువు' ఈ పట్టము ముఖ్యముగ మనశరీరమునుండి ఆత్మ ఉత్క్రమణమగు నప్పుడు ఉపయోగపడును నీమృత్యుసమయమందు నీవుభగ వంతుని తలచిన నీవు భగవంతునిలో నైక్యమగుదువు. లేక ప్రపంచ కోరికలు యేవైన నీకు ఆసమయమందు గలిగిన యెడల తిరిగి మనుష్య జన్మ వచ్చును. మనము మంచి అవకాశము పోగొట్టు కొందుము. కొంచము జాగ్రత్తగానున్న లభించునుగాన ప్రాణ ఉత్క్రమణసమయ మందు తప్పక భగవంతుని తలచిన నీకు అదియే ఆఖరు జన్మయగును.

మూ:-మీరు చెప్పిన విషయము చాల ఆశ్చర్యకరముగ నున్నది. ఒకవ్యక్తి జీవితమంతయు మంచి గుణములతో

గడిపి చివరకు కోరికతో చనిపోయిన తిరిగి వానికి జన్మ వచ్చుటయు, యింకొక వ్యక్తి జీవితమంతయు చెడుమార్గములలో గడిపి చివరసమయమున భగవంతుని తలచిన మోక్షము గలుగుటయు చాల ఆశ్చర్యముగాను సబబుకు వ్యతిరిక్తముగాను కనుపించు చున్నది.

జ్ఞాన:- అవును ఆశ్చర్యముగానే కనుపించును ఇవియొక ఉదాహారణతో నీకుబోధపరచెదను. నీవు ఫోటోగ్రాఫరని చెప్పియున్నావు. నీవు యొకమనుష్యుని ఫోటో తీసికొనవలసినప్పుడేమి చేయుదువు.

మూ :- మొదట నేను ఫోటో తీసికొన దలచిన వ్యక్తియొక్క రూపము సరిగా కనపడునట్లు నా కెమీరా సరిచేసికొందును. అవసరమైన ఆ పురుషుని లేక వస్తువును కూడ సరిచేసెదను. తరువాత లెన్సు సరిచేసెదను. తరువాత బొమ్మపడు ప్లేటు సిద్ధము చేసికొనెదను దానితో ఫోటో తీయుటకు సిద్ధపడెదను.

జ్ఞాన :- తరువాత యేమి చేసెదవు ?

మూ :- తరువాత మనుష్యుని కదలకుండ కూర్చుండుమని చెప్పి బటన్ నొక్కెదను. ఫోటో పడును.

జ్ఞాన :- నీవు బటను నొక్కినప్పుడు నేను కదలెదను. ఏమి అగును ?

మూ :- ఫోటో బాగారాదు. పాడగును.

జ్ఞాన :- ఒక వ్యక్తి అంతకు పూర్వము సరిగా ఉండక కదులుచుండి సరియైన సమయమున కదలక జాగ్రత్తగా నుండిన యేమగును.

మూ :- ఫోటో గ్రాఫరును.

జ్ఞాన:- కాబట్టి నీవు అడిగిన ప్రశ్నకు నీవే జవాబు చెప్పితివి.

మూ:- ఆ తెలిసినది. సరే. అయితే ఒక మనుష్యుడు అనేక నాళ్లు మంత్రము ఎందుకు పఠించవలెను. ఒక్కసారి అనగా మృత్యుసమయమున ఉచ్చరించిన చాలదా?

జ్ఞాన.- బాగా అడిగినావు. కాని ఈ భగవంతుడు మామూలు ఫోటో గ్రాఫరుగా మనకు కనుపించడు. ఫోటో గ్రాఫరు వలె 'సిద్ధముగనుండుడు' అని కేక వేయడు. ఆ ప్రాణ ఉత్క్రమణ సమయ మెప్పుడు వచ్చునో మనకు తెలియదు. కాబట్టి మనము ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలసినదే. కాన ఎల్లప్పుడు ఆ భగవంతుని నామము నాలుకతో ఉచ్చరించ వలసినదే. అట్టుల చేయుటకు అలవాటుపడిన ప్రాణ ఉత్క్రమణ సమయమందు కూడా వాని నామము వచించెదము. నామమే పవిత్రముచేయును నామమే మర్యాదయిచ్చును. నామమే హృదయమును మెత్త పరుచును. నామమే పాపములన్నియు పోగొట్టును. శ్రద్ధతో భక్తిభావముతో నామము స్మరించిన నీవు అన్ని పాపముల నుండి విముక్తుడగుదువు

మూ:-స్వామీ! క్షమించవలెను. తమరింకను నామనస్సులో కొన్ని సందేహములు కల్పించుచున్నారు. భగవన్నామ ముచ్చరించినంత మాత్రమున నేను ముక్తికి అర్హుడ నైనప్పుడు ఆ నామము ఒక్కసారిపలికిన చాలదా? ఎప్పుడు అనేకసారులుదానిని ఎందుకనుచ్చరించవలెను? ఒకమారు ఆనామము పలికిన నా పాపములన్నియు పోయినచో నేనెప్పుడుచనిపోయినను స్వర్గమునకు పోవలసినదేకదా.

జ్ఞా:-నేనొక ఉదాహరణతో దాని యొక్క నిజతత్వము బోధ పర్చెదను. ఒక లాంతరు తీసికొనెదము దాని యొక్క ఉప యోగ మెట్టిది ?

మూ:-రాత్రి కాలమందు దానిని వెలిగించిన చీకటిపోవును.

జ్ఞా:-మంచిది. అది ఒకసారి ముట్టించిన చీకటి పోవును.

మూ:-అవును.

జ్ఞా:-చీకటిపోయి వెలుతురు వచ్చిన తరువాత లాంతరు ఆర్ప వచ్చునా ?

మూ:-లాంతరు ఆర్పిన తిరిగి చీకటి గలుగును.

జ్ఞా.-ఇదియే నీప్రశ్నకు జబాబు. భగవన్నామము నొకసారి ఉచ్ఛరించిన నీ పాపములు పోవును. అది ఉచ్ఛరించుట మానివేసిన అవి తిరిగి నిన్ను ఆవరించును

మూర్ఖ-తెల్లవారి సూర్యోదయము గలిగి నప్పుడు లాంతరు అవసరము లేదు. దానిని ఆర్పవచ్చును.

జ్ఞా:-ఆప్రకారమే నీయందు జ్ఞానసూర్యుడు ప్రకాశించు వరకు నీవు మాత్రము పఠించు చుండవలెను అనగా బ్రహ్మ సాక్షాత్కారము అగువరకు భగవంతుని నామము ప్రతి దినము జపించుట ప్రతిమనుజునకు సులభమైనపని. ఒకవ్యక్తి భగవంతునిరూపమువలె తనయొక్క గుణములు మార్చు కొనవచ్చును. మరియు మృత్యుసమయమున మనస్సు యెట్టిస్థితిలో నుండవలెనో అది కూడ ఊహించుకొన వచ్చును నీజీవితమునందు నీవడవడికగుణ స్వరూపములేనీ మనస్సు యొక్క-స్థితి మార్పు జేయును. కాబట్టి నీయావజ్జీ వము భగవంతుని యూహాలయందే గడుపుట అవసరము.

మూః- స్వామి! మీబోధ నాకు బాగుగ నచ్చినది. నేను యీ రోజునుండి శ్రీకృష్ణుని యొక్క రూపమును ధ్యానించి వారిజపము ధ్యానము చేయుదును. ఇందుకై నేను యే మంత్రము పఠించవలెనో దయయుంచి తెలియ పరచుడు

జా:- మహామంత్రము పఠించవచ్చును. కాని నీ మంత్రము నీజీవితములో మార్చకూడదు. ఏమంత్రమైనను ఒక్కటియే ఒకటి తక్కువది యింకొకటి యెక్కువదని విచక్షణ లేదు. అన్నియు నొక్క ఫలితమునే యిచ్చును. కాని ఒక మంత్రమునే నీవు వుచ్చరించుకొని అది శ్రద్ధగా భక్తితో ఉచ్ఛరించవలెను. దానివలన నీఅంతిమ ఆశయమగు బ్రహ్మసాక్షాత్కారము గలుగునని గట్టి నమ్మకముంచవలెను.

మూః- మంచిది స్వామిజీ

హరేరామ హరేరామ రామరామ హరేహరే హరే కృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥

---

## రాసలీల (రాధాప్రేమ)

(జ్ఞానదేవుడు, ప్రేమదాసు)

ప్రే:- స్వామిజీ మహారాజ్, నా మనస్సునందు నొక సందేహ మున్నది. అది తీర్చెదరా?

జా:- తప్పక తీర్చెదను సంకోచింపక అది యెట్టిదో తెల్పుము.

ప్రే:- చాలమంది జనులు రాసలీల విషయమై చెడుగా చెప్పెదరు దానియందు గూఢార్థ మేదియో నున్నదని నే నూహించుచుంటిని గాని అది యేదియో తెలియదు. ఆ ఆక్షేపకులకు నేను సరియైన సమాధానము యివ్వజాలకున్నాను. దాని రహస్యము నాకు చెప్పెదరా.

కృ :- నీకు గలిగిన కష్టమేదియో స్పష్టపరుపుము.

ప్రే:- ధర్మశాస్త్ర ప్రకారము యితర పురుషుల భార్యలతో కూడి ఆడుట, పాడుట తప్పు గదా! శ్రీకృష్ణుడు అట్టి వారిని చేరదీసి వారితో నృత్యము చేయుట తప్పుగాదా?

కృ :-ఆహా! ఇదియేనా నీ సందేహము! చెప్పెదను వినుము వ్రజయందలి స్త్రీలు నొకానొక సమయమందు తాము ఆహారము పెట్టుటకు ఒక బ్రాహ్మణుని పేరు తెల్పవలసి నదిగా శ్రీకృష్ణుని కోరిరి. అతడు దూర్వాసుని పేరు చెప్పెను అప్పుడు గోపికలు వానివద్దకు మేమెట్లు వెళ్ళ గలము మధ్యయయినా నదియున్నది. అది దాటుటెట్లు? ఇంకొక మహాత్ముని పేరు చెప్పమనిరి. నిత్య బ్రహ్మచారి యగు కృష్ణుని పేరుతో యమునానదిని త్రోవ యివ్వ వలసినదిగా కోరండి అని చెప్పెను. ఆ ప్రకారము వారు చెప్పగా యమున పాయ యిచ్చి వారు అవతల వొడ్డుకు వెళ్ళుటకు వీలగునట్లు చేసెను. యమునకు ఆ కృష్ణుని యొక్క నిజస్వరూపము తెలుసును. అతడు దివ్యపవిత్రుడనియు నిత్యబ్రహ్మచారి యనియు యమునకు తెలియును

ప్రే:-ఆ కథ నేనును వింటిని. కాని శ్రీ కృష్ణుడు గోపికలతో కలపియుండెననియు అతడు 16, 108 మంది భార్యలను వివాహమాడెననియు చెప్పుదురు.

కృ:-అది నీకు ఆశ్చర్యముగా కనుపించుచున్నది. శ్రీ కృష్ణుని రాసలీల చాల అద్భుతమైనది. గోప అనగా జీవుడు గోపాలుడన జీవులను రక్షించువాడు. గో అనగా భూమి

లేక ప్రకృతికి కూడ అర్ధముగలదు. ప్రకృతికిని పరమ పురుషునకును భేదము గలదు. జీవకోటి అంతయు ప్రకృతి సంభవులు. గోపాలుడు అనగా అన్ని జీవరాసులనురక్షిం చువాడు. క్రిష్ణా అనగా కిశోరుడు అనగా 7, 13 సంవత్స ముల వయస్సు గలవాడు. బృందావనమునకు మధ్య భాగమందు అష్టకోణములుగల శ్రీ కృష్ణునియొక్క యోగ పీఠముగలదు. దానికి అతడు ప్రభువు. బ్రహ్మ, విష్ణు, శివులు వానిలో భాగములు. ప్రపంచమునకు ఆధారమైన మూల ప్రకృతి రాధిక. ఆ యోగపీఠము పైన గోవిం దుడు రాధతోను వాని ముఖ్యసఖులు పట్టపురాణులగు చంద్రావతి, చిత్రలేఖ, చంద్ర, మదనసుందరి శ్రీమధుల మతి, చంద్రరేఖ, హరిప్రియ లతో కూర్చుండును.

ప్రే:-మీరు మరింత చిక్కులు పెట్టుచున్నారు. మీరు చెప్పిన విషయము కృష్ణునియొక్క చేతలకు యెట్లు సమాధాన వాక్యము.

జ్ఞా:-చెప్పెదను వినుము. ఈ అద్భుతము నీకు విమర్శించుట చాల కష్టసాధ్యమే. రాచలీల రహస్యము ఎవరు చెప్పగ లరు. అది వర్ణనాతీతము. మాటలవల్ల అది చెప్పలేము. నాలుకకు చెప్పశక్యముకాదు. మనస్సు ఆ నిజమును చేర నేరదు. అది ఎవరు యితరులు విమర్శింపలేరు. భగవద్గీతలో నీవు చదువ లేదా ?

శ్లో. ఆశ్చరవ త్పశ్యతి కశ్చిదేన ।
మాశ్చర్య వద్వద తిత థైవచాన్యః ॥
ఆశ్చర్యవచ్చైన మన్యశ్శృణోతి ।
శృత్వాప్యేనం వేదన చైవకశ్చిత్ ।

భగవంతుని లీలలు తర్కమునకు తగినవి కావు. అవి స్వయముగా చూచి అనుభవించవలసినదే. ఆహా! అట్టి అనుభవము వల్ల గలుగు ఆనందము కూడ వర్ణనాతీతము. పైనచెప్పిన రాధిక వ్రజనీలుగాక వారి తరువాత ముఖ్యులు గోపికలు. ఈ గోపికలు వానిఆనందముయొక్క స్థితి తెల్పుటకు కృష్ణస్వామియొక్క మధ్యవర్తులు. వారు పూర్వజన్మమందు దండకారణ్యములోనుండిన ఋషులు. వారు అప్పుడు రామునియొక్క అందముచూచి వానిని కౌగలించుకొనగోరిరి. అప్పుడు రాముడు ఏకపత్నీవ్రతుడుగనుక కృష్ణావతారమందు వారలకోరికలుతీరునని వారికివరమివ్వబడినది. కాని ఆఋషులు యీ జన్మలో గోపికలుగాపుట్టి స్వామిలో ఐక్యమగునట్లుగోరిరి. గోపికలకు భర్తలు, తలిదండ్రులు కుమాళ్ళుఉన్నారు. వారు ప్రపంచములో చేయవలసిన కర్తవ్యములుకలవు. కాని ఆగోపికల మనస్సు ఎల్లప్పుడు స్వామిమీదనేయుండును. తమ హృదయమందుండు పురుషుని చేరుటకు సమయముగలిగినప్పుడు ప్రతిగోపికయు సంసారబంధములువిడిచి స్వామికి పూర్ణశరణాగతయగుచుండెను. అట్లుచేయుటకు ప్రపంచమందలి యెట్టిబంధము ఆటంకముపెట్టలేకుండెను. ఇది యేశక్తియొక్క పరమోత్కృష్టస్థితి, అదిమనకు ఒక ఆదర్శమునూచించుచున్నది. ఇట్టి ఔన్నత్యము ఎట్లువర్ణించగలము.

ప్రేమ:-క్షమించండి. నేను మందబుద్ధిని. అయితే గోపికలు వారి భర్తలనువిడిచిపెట్టుట అను నేరమునకు పాత్రులు గారా? మరియుకృష్ణుడు వారలను తన సంగీతముతో మరులుకొల్పుటకాదా?

జ్ఞా:-కాదు. శ్రీ కృష్ణుడు నిర్మలమైన ప్రేమచేత ఇంద్రియసుఖా శక్తి (కామము) తగ్గించుటకు రాసలీల యేర్పాటు చేసెను. గోపికలు ఆ ప్రభువును చేరినప్పుడు వారియందు మనుష్య సంబంధమైన కామము లేదు. మనుష్య మాంసమునందు ప్రేమ లేదు. ప్రాకృతిక అనుభవమునందు ఇచ్ఛలేదు. అవి జీవునకు ఆత్మకును గలుగు ఆకర్షణ - వారు ప్రభువుకు సేవచేయుటయందే నిమగ్నులైరి. వీరు మాధుర్య భావముతో నిండియుండిరి. భగవానుడు వారి వారి ప్రారబ్ధ కర్మవలన కలిగిన పరిసరములు లెక్కచేయక వారు తనతో కలియుటయే కోరుచుండెను. బృందావనలీల ఎల్లప్పుడును నుండునది. రాసలీల నిజభక్తులకు ఎల్లప్పుడు నుండును. అది శ్రద్ధగలుగుటకును ఆధ్యాత్మికకృత్యములు పవిత్రతతో బలపడుటకును. గోపికల మనస్సులు, జన సామాన్యమును వృద్ధిచేయుటకును ఏర్పడినది.

ప్రేమ:-అయియుండవచ్చును. కాని ఆధ్యాత్మిక మార్గములో అది ఎట్లు సహాయపడును ?

సామాన్య మనుజునియొక్క జీవితములో యిది జరిగి మరిచిపోదగిన సామాన్య సంఘటనగా కనుపించుచున్నది.

జ్ఞాన:-కాదు. అది కేవలము చరిత్ర విషయ సంబంధమైనది కాదు. ఒక శాశ్వత సంఘటనము. అది రాత్రిసమయమున నందరు నిద్రించువేళ. అప్పుడు ఆధ్యాత్మిక చురుకుదనము ప్రారంభమగును. అప్పుడు లోకవాసనలు పూర్తిగా అదృశ్యమైయుండును. మనుష్యుడు తనకు తెలియకుండగనే ఆ సమయమున కొంత ఆధ్యాత్మిక వృద్ధిపొందును. కాని అట్టి స్థితి భగవంతుని హృదయమందు ప్రకటితమైవానితో

ఆత్మీయకలయిక కోరు కొలదిజనులయందే కనుపించును. చాల మందికి గాఢనిద్రపట్టును. కాని తురీయావస్థకు పోవువారు బహుకొద్దిమంది యుందురు. పురుషు డొకడే. జీవప్రకృతులు లేక పరాప్రకృతులు అనేకముగానున్నవి. పురుషునికి ఆ పరాకృతి రూపములు ఎంత అనుకూలమైనను జీవునకు వ్యతిరిక్తముగానే నుండును. పురుషుని చుట్టు ఆనందము గలుగజేయు పురుషోత్తముడే చైతన్యము. ఇచట స్త్రీ పురుషభేదము లేదు. పురుషోత్తముడు ఎల్లప్పుడు పురుషుడు జీవ ప్రకృతి ఎల్లప్పుడు స్త్రీ. భక్తివిషయములో భక్తుని హృదయములో ప్రతి ఫలించెడు భగవానుడు పురుషుడు. భక్తుడు స్త్రీ. గోపికలు ప్రపంచ మందలి వ్యక్తులుకారు. వారుపూర్వ జన్మమందు తపస్సువల్ల పవిత్రత పొందినవారు. ఈ జన్మలో వారు భగవంతునిలో ఐక్యము కావలసియున్నది. శాస్త్రములనుండియు యేమియు తెలిసికొనలేని గ్రుడ్డివారికొరకు వారు భగవంతుని నెట్లు ప్రేమింపవలెనో తెలుపుటకు వారు గోపికల శరీరములు పొందిరి.

ప్రే:-మీ సమాధానము వల్ల నాతల తిరుగుచున్నది. నాకు బోధ పడుట లేదు.

జ్ఞా:-నిజము ఆశ్చర్యముగా నుండును. దానియందు గూఢ భావముండునని లోగడనే నీకు తెల్పితిని వినుము. వారికి భగవంతునితో కలియుటకు అధికారము కలదు. మరియు శ్రీకృష్ణుడు వారి స్నేహము నిరసించలేదు. అదిగాక జీవులందరు ఆధ్యాత్మిక అనుభవములను పొంది వానిలో

కలియుటయే వచ్చుటయే వానికిష్టము. ఆ వచ్చుటవల్ల స్వాభా
వికము. అందు ఉభయులకు సంతోషము కలుగును. మంద
బుద్ధి గలవారు నీచమైన మోహముతో కూడుకొని
మనుష్య అంతిమ సౌఖ్యము యొక్క కోరికల నిరసించ
కూడదు. కాని ఆ కలయిక యందునొకఅపాయముగలదు.
ఆసూక్ష్మమైన అపాయము "నేను భగవంతునితో కలసి
యున్నాను" అనుకొను అహము గోపికలకుకూడ నొకసమ
యమందు అట్లనుకొనిరి. తత్క్షణముకలయికయందు ఎడబాటు
తటస్థించెను. కృష్ణుడెచ్చటను కనుపించలేదు. వారు ప్రపం
చమందు వానికర్మలుచేయనటించిరి. వానికాలిజాడలనుబట్టి
వానికొఱకుతిరిగిరి. వారికపోలమునుండి కన్నీళ్ళు వరదలుగా
కారెను. వారుకోరెడు ఆప్రభువు యశోదకుమారుడేగాక
ప్రపంచమునకు ప్రభువని తెలిసికొనిరి. మరియుఅట్టిఆశ్చర్య
మైనఅనుభవములో అహముమఱచిరి. అప్పుడుతక్షణం
కృష్ణుడుకనుపించెను. అహము పోగొట్టుకొనుటకు మంచి
మార్గము దానిని పూర్తిగా మరచిపోవుట లేకదానియొక్క
యునికి మనస్ఫూర్తిగా లేదని నమ్ముట ఈసమయమందు
కలయికజరిగెనుగాని అది వ్యక్తిగతకలయిక కాదు. గోపిక
లందరు నొకరిచేయి నొకరు పట్టుకొని వలయాకారముగ
నుండిరి. ప్రభువు వ్యక్తిగత ప్రభువుకాడు. విశ్వప్రభువు.
వారికిని బైటచూచువారికిని ప్రతిగోపికజతమధ్య అతడు
న్నట్టుకనుపించెను. మరియు వారు వానితో నృత్యముచేయు
చుండిరి. కాని వ్రజమందలి ప్రజలు భగవానుని యోగ
మాయవలన వారి భార్యలు వారిప్రక్కనేయున్నట్లు
నూహించిరి. దేవతలు ఆశ్చర్యముతో చూచిరి. గోపికల

స్థితిపొంది వారికి యీప్సితగలిగెను. మనముకూడా అట్టి రాసలీల ఆ దివ్య ప్రేమ నాట్యము చూడ గోరెదము ఆ ప్రకారము చూచిన మనము కూడ భూమియందలి దేవతలు అగుదుము. భాగవతము శ్రద్ధతో భక్తితో చదువుడు. దానివల్ల కొన్ని మంచి సంస్కారములుగలుగును. కాని కేవలము పఠనమువాలదు. దాని అర్థము తెలిసికొన వలెను. భగవంతుని లీలలలోనుండు గంభీరమైన యూహా లపై ధ్యానముంచుము. అప్పుడు మనుజుని అజ్ఞానము వలన వాని దృష్టికి కనుపించని శాశ్వతమైన సత్యము, శక్తివంతమైన ధారణతో కూడిన నీచూపునకు కనుపించును. ఆ గొప్పరహస్యము నీవు నెమ్మదిగాను క్రమము గాను గ్రహించ గలుగుదువు ఒకసారి నీవు ఆ తెర తొలగించిన భగవంతుని స్వయముగా తెలిసికొన గలవు. ఈస్థితియే రాధయొక్క అనుభవము.

ప్రేమ:-మీ యొక్క ఉపన్యాసము వల్ల రాసలీల విషయమై కలిగిన సందేహము లన్నియు నివృత్తి అయినవి. మీకు కృతజ్ఞుడను. (ప్రణామము చేయును)

జ్ఞా:-భగవంతుడు మిమ్ములను ఆశీర్వదించుగాక.

ఓం నమోనారాయణాయ (అందరు నిష్క్రమింతురు)

---

# సాధ్వసాధు పత్రము

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 3 | 11 | , | . |
| | 17 | లి | ం |
| | 18 | రీ | ం |
| | 19 | లేని | లేనిది |
| 6 | 7 | వయలు | బయలు |
| | | దీస | దీన |
| 7 | 9 | దీనవ | దీనక |
| | 11 | ఆసం | ఆనం |
| | 20 | విభ్య | విద్య |
| 8 | 7 | లోపనుండి | లోపలనుండి |
| | 10 | రాజు | దాసు |
| 9 | 16 | తెలయు | తెలియు |
| | 19 | సి. ఐ. సూ | సి. ఐ. శి సూ |
| | | సూణ్మారాం | సూత్మారాం |
| | 20 | న్య | నం |
| 11 | 16 | వీవే | నీవే |
| 13 | 9 | సే | సె |
| 16 | 16 | నాయండు | నాయందు |
| | 22 | మాలు | మాలులు |
| 20 | 13 | పోయెను | పోవును |
| 21 | 23 | వర్తకుని | వర్తకుడు |
| 23 | 12 | కా | క |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| | 15 | సగా | వగా |
| 26 | 3 | బౌరంగీ | చౌరంగీ |
| 31 | 11 | పాపప | పావన |
| | | ప్రుషులు | పురుషులు |
| | 17 | కామము | క్రోధము |
| 32 | 2 | గొక్కువ | యెక్కువ |
| 35 | 20 | తస్మస్తే | తస్త్మైశ్రీ |
| 36 | 13 | కఫీ | కాఫే |
| 37 | 6 | వాంద్రు | వాంద్ర |
| | 25 | వెళ్ళేదరు | వెళ్ళేదరు |
| 43 | 15 | బూంమిన్ | బ్యామిన్ |
| 45 | 9 | పొంపిన | పొందిన |
| | 4 | తటస్థమగును4 | వ పంక్తి 5 వ పంక్తికలిపి చదువవలెను |
| | 5 | మా॥ | మా॥ నేను నీకంటె |
| 46 | 5 | నలందేశు | నందేశు |
| | 11 | రాన | రావ |
| 47 | 8 | సంభాషించుం | సంభాషించుచుం |
| | 11 | యగుడు | యముడు |
| 48 | 20 | నేసు | నేను |
| 49 | 12 | పట్టె | పట్టి |
| 50 | 6 | మునకు | మునకు |
| 51 | 21 | పోలునట్లు | పోవునట్లు |
| | 20 | మంచి | మంచు |
| 52 | 22 | యింకొ | యింకను |

| పుట | పంక్తి | అశుద్ధము | శుద్ధము |
| --- | --- | --- | --- |
| 54 | 5 | భరించినని | భరించిన |
| | 6 | లోలుపత్వము | లోలుపత్వము |
| 57 | 11 | పమాప్తి | సమాప్తి |
| 68 | 8 | ఉపనిషత్తు | ఉపనిషత్తులు |
| | 23 | కావ్యములపై | కావ్యపై |
| 73 | 3 | నొక్క | నొప్పు |
| 75 | 7 | నామ | నావ |
| | 24 | నైళ్ళదమా | నిఘృదమా |
| 79 | 18 | తెలుగు | తెక్కలు |
| 82 | 21 | సద్వ్యోషాం | సక్వ్యోషాం |
| 83 | 15 | నదన | నదని |
| 84 | 3 | అనుచారకము | అనుభవము |
| | 7 | అపని | ఆపని |
| | 19 | న్నాపు | న్నావు |
| | 22 | ఉవన్యా | ఉపన్యా |
| 89 | 11 | మమూలు | మామూలు |
| 90 | 19 | మృడుడ | మృకండ |
| 93 | 6 | ఆయవ | ఆయున |
| 95 | 3 | నున్నది | వున్నది |
| 100 | 13 | హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే | హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణ కృష్ణ హరేహరే |
| 101 | 3 | వేవములు | వేదములు |
| | 12 | చూపుము | చూపుము(వెళ్ళును) |
| | 19 | ఏజంట | ఏజంటు |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 107 | 3 | గాని | గారి |
| 108 | 10 | పిలువుము | పిలువుము తర్వాత 9 వ పంక్తి చదువుడు |
| | 17 | నాత్ | నాట్ |
| 109 | 3 | నుండెను | నుండును |
| 115 | 9 | కోలపాలుని | కోలాహాలుని |
| 117 | 10 | వానిని | వారిని |
| | 13 | చేయును | చేయుము |
| 127 | 3 | సానము | స్థానము |
| 129 | 21 | (మోహన్ దాసితో) | మోహన్ హరిదాసితో |
| 135 | 14 | హరా | హర |
| 136 | 13 | అత్మ | ఆత్మ |
| 137 | 11 | గలిగ | గలిగి |
| 140 | 17 | సంబందము | సంబంధము |
| 144 | 18 | చున్నాను | చున్నారు |
| 145 | 4 | కర్మమును | కర్మములను |
| 147 | 5 | కర్మా | కర్మ |
| | 15 | చేయ | చేయు |
| 148 | 4 | పండిత్ | మంజిత్ |
| | 14 | శేచారామ్ | సీతారామ్ |
| | 22 | వీకు | నీకు |
| 149 | 22 | వీకు | నీకు |
| 149 | 22 | నమర్పణ | సమర్పణ |

| పుట | పంక్తి | అసాధు | సాధు |
|---|---|---|---|
| 153 | 10 | చిన్నము | చ్ఛిన్నము |
| | 24 | నాలుసు | నాల్గును |
| 155 | 22 | ధ్యానింపుఁడు | ధ్యానింపుఁడు |
| 157 | 5 | మొక | నొక |
| | 17 | జా | జ్ఞాన |
| | 20 | మూర్ఖ- | మూర్ఖ |
| | 21 | జ్ఞ్నాన | జ్ఞాన |
| 158 | 1 | దాగివాఁడు | దాగినాఁడు |
| 159 | 7 | పాళ్లు | సాళ్లు |
| 162 | 23 | స్థితి | స్థితిని |
| 163 | 4 | తెనియ | తెలియ |
| | 19 | జా | జ్ఞా |
| 164 | 2 | పే | ప్రే |
| | 10 | యయినా | యమునా |
| 168 | 5 | పరాకృతి | పరాప్రకృతి |
| | 14 | కావిలిసి | కావలసి |
| 170 | 12 | గహించ | గ్రహించ |

